ఈ విప్లవం అతి వేగంగా విశాఖపట్నం నుండి గోల్కొండ వరకూ వ్యాపించింది. మద్రాసులో గల కంపెనీ అధికారులు ఈ తిరుగుబాటు అణచడానికి జార్జి రస్సెల్ అనే వానిని ప్రత్యేకాధికారిగా నియమించి పెద్ద సైనిక దళాన్ని పంపించవలసిందిగా కంపెనీకి వ్రాశారు. విప్లవ జ్వాలలు చల్లార్చటానికి రస్సెల్ అనకాపల్లి రాజవంశీయుల మీద, ప్రజల మీద మొదట తీసుకున్న చర్యలు వ్రాయనలవి కానివి. అయినా అంతటితో తృప్తి చెందక, కోటను నేలమట్టం చేసి, లోపలి మహలును సర్వనాశనం చేశారు. పరంపరాగతంగా వచ్చే రాజవంశీయుల మీద ప్రజలు ప్రేమానురాగాలు చూపుతున్నందువల్ల పట్టణంలో కొంత భాగాన్ని కాల్చివేసి ప్రజలను చిత్రహింసలకు గురిచేసారు.

ఈ స్థితిలో జగన్నాథ పాయకరావు బలవంతంగా తెలంగాణా అరణ్యాలలో కొంతకాలం అజ్ఞాతవాసం చేయవలసి వచ్చింది. రెండు సంవత్సరాల అనంతరం మరల జగన్నాథ పాయకరావు బలంపుంజుకుని రంపను తన కార్యకలాపాలకు ఆటపట్టుగా చేసుకున్నాడు. విధి వైపరీత్యం వలన ఇతడు రంప ముఠాను నాయకునిచే వంచింపబడి శత్రువుల ఉచ్చులో చిక్కటంతో సర్వ సామాన్యమైన బందిపోటువలె సంకెళ్ళు వేసి 'తుని' తీసుకు వెళ్ళి తాండవనది ఒడ్డున ఉరితీయబడ్డాడు.

జిల్లా మాన్యువల్ గెజిటర్‌ల కర్త కార్మికెల్ జగన్నాథ పాయకరావు పాయకరావుపేటలోని నది ఒడ్డున ఉరితీయబడినాడు. ఆ కాలపు ఆచారాలను బట్టి ఉరితీయబడిన అతని శరీరాన్ని ఇనుప బోనులో బూజు పట్టునట్లు వదిలి వేయుట జరిగినది. 40 సం.ల అనంతరం ఇప్పటికీ అతని పుర్రె ఒకటి రెండు ఎముకలు కనబడుతున్నవి. 1758లో విశాఖపట్నంలో ప్రప్రథమంగా ఆంగ్లేయుల పతాకాన్ని ఎగురవేసిన రెండవ రామభద్ర పాయకరావునకు, ఆంగ్ల అధికారులు ఇచ్చిన ప్రతిఫలమిది.

1803లో విశాఖ జిల్లాలో జమిందారీవిధానం ప్రవేశ పెట్టబడిన తరుణంలో అనకాపల్లి రాజ్యం విజయనగరం జమిందారుల పరమైంది. ఏడు సంవత్సరాల అనంతరం అనగా 1810లో గోడె సూర్య ప్రకాశరావు విజయనగర వంశస్థుల నుండి అనకాపల్లిని కొన్నాడు. ఇతను పట్టణంలో ఒక సౌధం, ఉద్యానవనం నిర్మించాడు. అంతేగాక విశాఖలో మిసెస్ అంకితం వెంటక నరసింహారావు కళాశాల (ఎ.వి.ఎన్. కళాశాల), సివిల్ హాస్పిటల్ (కె.జీ.హెచ్.) నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించాడు. ఈయన మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో 1868 నుండి దాదాపు 16 ఏళ్ళు సభ్యులుగా ఉన్నారు. ప్రకాశరావుకు 1881లో రాజబిరుదము, 1898లో మహారాజు బిరుదము లభించాయి. 1903లో ఇతను మరణించారు. మహారాణి శ్రీమతి గజపతిరావు జీవించి ఉంది. ఈమెకు పురుష సంతతి లేదు. స్త్రీ సంతతిలో ఒకామెను రాష్ట్రానికి చెందిన వస్త్యాన్ వంశీయుల కిచ్చి వివాహం చేసింది. దీని వలన వారే అనకాపల్లి జమీందారీకి వారసులయ్యారు. చివరకు ఆమె కుమార్తె వారసురాలైన చెముడు సంస్థానాధీశులకు అనకాపల్లి సంస్థానం సంక్రమించింది. జమిందారీ రద్దుతో ఆ ఆస్తులు ప్రభుత్వ పరం అయ్యాయి. ఇదీ క్లుప్తంగా బెల్లంపల్లి అని ప్రసిద్ధి పొందిన అనకాపల్లి చరిత్ర.

# అనకాపల్లి మండల పరిషత్

అనకాపల్లికి 1810లో గోడె సూర్యప్రకాశరావు విజయనగర రాజుల నుండి కొన్నప్పటికి నుండి మండల కేంద్రంగా ఏర్పడి ఇప్పటి వరకూ దినదినాభివృద్ధి చెందుతూనే ఉంది. అనకాపల్లి మండలం చుట్టూ చోడవరం, ఎలమంచిలి, వూడిమడక, సబ్బవరం, మొదలయిన మండలాలు కలవు. బాగా అభివృద్ధి చెందిన మండలాల్లో అనకాపల్లి ఒకటి.

**1. అనకాపల్లి మున్సిపాలిటీ :-**

అనకాపల్లి మున్సిపాలిటీకి 120 వసంతాల చరిత్ర ఉంది. క్రీ.శ. 1877లో అనకాపల్లికి మున్సిపాలిటీ స్థాయి కల్పించారు. 1871 మద్రాస్ పట్టణ అభివృద్ధి చట్టాన్ని అనుసరించి ఈ పట్టణాన్ని మున్సిపాలిటీగా చేశారు. 1884 మద్రాస్ డిస్ట్రిక్ట్ మున్సిపాలిటీల చట్టం క్రింద దీనిలో 13 మంది సభ్యులు ఉండవచ్చుని నిర్ణయించారు. 1885లోను, 1897లోను ఈ మున్సిపాలిటీ తన కౌన్సిల్ సభ్యులలో నలుగురిని, ఛైర్మన్‌ను నేరుగా ఎన్నుకునే అధికారం పొందింది. ఆ తరువాత 1920 మద్రాసు జిల్లా మున్సిపాలిటీల చట్టాన్ని అనుసరించి 1921లో అనకాపల్లి పట్టణ మున్సిపాలిటీ కౌన్సిల్‌ను పునర్వ్యవస్థీకరించారు.

ఈ మున్సిపాలిటీలో 1943లో ఆరోగ్యశాఖాధికారిని, 1948లో ఇంజనీరును నియమించారు. 1952లో కౌన్సిల్‌ను 28 సీట్లతో విస్తరించారు. వాటిలో స్త్రీలకు, షెడ్యూలు కులాల వారికి ఒక్కో సీటు కేటాయించారు. 1956లో ఇది ఫస్ట్ గ్రేడ్ మున్సిపాలిటీగా గుర్తింపు పొందింది. ప్రస్తుతం మున్సిపాలిటీలో 32 వార్డులు ఉన్నాయి. 34 గ్రామాలు ఉన్నవి. సుమారు 1,62,531 జనాభా గల అనకాపల్లి పట్టణ విస్తీర్ణం 186,43 స్క్వేర్లు కిలోమీటర్లు కలిగి ఉంది. మున్సిపాలిటీకి కోటి రూపాయలకు పైగా ఆదాయం వస్తుంది.

**2. శీతోష్ణస్థితి - వాతావరణం :-**

ఇక్కడ వాతావరణం ఎక్కువ తేమగా వుంటుంది. వేసవిలో బాగా వేడిగా వుంటుంది. వర్షాకాలంలో వర్షాలు బాగా కురుస్తాయి. సంవత్సరంలో ఫిబ్రవరి నడుమ నుండి జూన్ మొదటి వారం వరకు వేసవి తరువాత సెప్టెంబర్ వరకు నైఋతి ఋతుపవనాల వలన వర్షం, అక్టోబర్ నుండి నవంబరు వరకు వర్షాలు వెనుకబడే కాలం. డిసెంబర్ మధ్య భాగం నుండి ఫిబ్రవరి వరకు వాతావరణం ఆహ్లాద కరంగా ఉంటుంది.

మే నెలలో యిక్కడ చాలా వేడిగా ఉంటుంది. ఈ నెలలో సరాసరి అత్యధిక ఉష్ణోగ్రత 30.0$^{\circ}$ సెల్సియస్ ఉండగా, అత్యల్ప ఉష్ణోగ్రత 27.6$^{\circ}$ సెల్సియస్ ఉంటుంది. శీతాకాలంలో రాత్రుళ్ళు ఉష్ణోగ్రత 13$^{\circ}$ సెల్సియస్ వరకూ పడిపోతుంది.

## 3. వర్షపాతం :-

అనకాపల్లి మండల కేంద్రస్థానమైన విశాఖ జిల్లాలో వర్షపాతం సముద్రతీరం నుండి వాయువ్య దిశగా పోయిన కొలదీ పెరుగుతుంది. ఇక్కడ మామూలుగా సంవత్సర వర్షపాతం 300 నుండి 500 మీ. ఉంటుంది.

భూమి :-ఇక్కడ ఇసుక, ఎర్రమట్టి, రేగడ, మెట్ట, నల్లనేల పల్లం భూములు ఉన్నవి.

## 4. నీటి వనరులు :-

అనకాపల్లి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. వ్యాపారం. వ్యవసాయానికి కావలసినంత నీటి వనరులు ఇక్కడ పుష్కలంగా లభ్యమవుతాయి. ముఖ్యంగా పంటకు కావలసిన నీరు శారదానది నుండి లభ్యమవుతున్నాయి. మరియు పంట కాలువలు, చెరువులు, బోర్లు, నూతులు, ఆవఖండల ద్వారా కావలసినంత నీరు లభిస్తుంది.

## 5. శారదా నది :-

ఈ నది మాడుగుల పర్వతాలలో పుట్టింది ఈ నది చోడవరం, అనకాపల్లి యలమంచిలి తాలూకాలలో ప్రవహిస్తుంది. తరువాత యలమంచిలి తాలూకాలోని వాకాడ వద్ద బంగాళాఖాతంలో కలుస్తుంది. శారదానది మొదట నూకాలమ్మ గుడిముందునుండే ప్రవహించేది. తరువాతి కాలంలో దానిని దారి మళ్ళించి పంటపొలాల వైపు త్రిప్పారు. ఇప్పటికీ నూకాలమ్మ గుడివద్ద కొన్ని అడుగులలోతున ఏటి ఇసుక ఉంటుంది.

## 6. ముఖ్య పంటలు :-

అనకాపల్లి మండలంలో ముఖ్య పంట చెరకు మిగిలిన పంటలు వరి, మొక్కజొన్న, బొబ్బర్లు, మినుములు, నువ్వులు, కందులు మొ॥ పంటలు పండుతాయి. మరియు ఆకుకూరలు, అన్ని రకాల కాయగూరలు పుష్కలంగా పండుతాయి. కొబ్బరి, జామ, జీడిమామిడి, మామిడి, సపోటా, మొ. తోటలు కూడ ఈ మండలంలో ఎక్కువగా కలవు.

## 7. పశు సంపద :

ఈ అనకాపల్లి మండలంలో ఆవులు, గేదెలు, మేకలు, గొర్రెలు మొదలగు వానిని పెంచుతారు. కొంతమంది ఇళ్లల్లో కోళ్ళు, గిన్ని కోళ్ళు కూడా పెంచుతారు. కుక్క, పిల్లి, చెవులపిల్లి మొ॥వి పెంపుడు జంతువులు.

## 8. రవాణా :-

ఈ మండలము దక్షిణ మధ్య రైల్వే లైను కలిగి ఉన్నది. అనకాపల్లి అన్ని సదుపాయములతో కూడిన రైల్వేస్టేషను ఉంది. ఒక బస్ కాంప్లెక్సు ఉంది. మరియు

అనకాపల్లి మండలం చుట్టూ ఉన్న గ్రామ ప్రాంతాలకు ప్రయాణం చేయడానికి గ్రామీణ బస్సులు కూడా ఉన్నాయి. అంతేకాకుండా అనేక ప్రైవేట్ బస్సులు కూడా నడుపుతున్నారు.

**9. విద్యా సౌకర్యాలు :-**

మానవ ప్రగతికి సోపానమైన విద్యాభివృద్ధికై మా అనకాపల్లిలో అనేక విద్యా సంస్థలు స్థాపించబడినవి. పట్టణంలో ఎ.ఎమ్.ఎ.ఎల్.కళాశాల, శ్రీ ఆదినారాయణ మహిళా కళాశాల, డా॥ సర్వేపల్లి రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల, కొణతాల ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, దాడివీరునాయుడు డిగ్రీ కళాశాల, ప్రతిభ మహిళా జూనియర్ కళాశాల, శ్రీ కన్యా జూనియర్ కాలేజ్, సంయుక్త కళాశాల, ఎస్.వి.ఎస్.ఎల్. కళాశాల, కౌసల్య మహిళా జూనియర్ కళాశాల మొదలగునవి కలవు.

**10. కాన్వెంట్‌లు మరియు హైస్కూల్స్ :-**

ప్రజలకు ఇంగ్లీషుపై రోజు రోజుకీ మోజు పెరగడంతో వీధికొక కాన్వెంట్ పుట్టుకొచ్చింది. అయినా ఉన్నవాటిలో గుడ్‌షెప్పర్డ్, ఎ.ఎం.ఎ. హైస్కూల్, డైమండ్, ఐడిల్ ప్రశాంతి నికేతన్, సంయుక్త, డి.ఎ.వి. పబ్లిక్ స్కూలు, వాసవీ బాల విహార్, సిటీ పబ్లిక్ హైస్కూలు మొదలగు వాటికి మంచి పేరు ఉంది.

**11. గ్రంథాలయములు :-**

శారదా గ్రంథాలయము (1936) శ్రీ గౌరీ గ్రంథాలయము (1943) శ్రీ లక్ష్మీ గ్రంథాలయము (1941), శాఖా గ్రంథాలయము, జడ్.జీ.ఎన్. గ్రంథాలయము (1954) మొదలగు గ్రంథాలయములు ఉన్నవి.

**12. సేవా సంస్థలు :-**

అనకాపల్లిని గురించి చెప్పకోవాలంటే ముందుగా వర్తక సంఘం గురించి చెప్పకోవాలి. వర్తక సంఘం ఒక పోస్టు గ్రాడ్యుయేట్ కళాశాల, ప్రసూతి ఆసుపత్రి, ఇంగ్లీషు మీడియం హైస్కూలు నిర్వహిస్తుంది. రాష్ట్రంలో ఖ్యాతి గాంచిన శారదా గ్రంథాలయం, శ్రీ గౌరీ గ్రంథాలయం, శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయాలకు ఆర్థిక సహాయం అందిస్తుంది.

**13. క్లబ్బులు - ఇతర విషయములు :-**

రోటరీ (1953), రోటరాక్ట్, లయన్స్ (1966) లయన్ లేడీ, వైజ్‌మెన్, లియో క్లబ్బులు ఉన్నాయి. శారదా వేలీ డెవలప్‌మెంట్ సమితి (ఎస్.వి.డి.ఎస్.) పేరుతో ఒక స్వచ్ఛంద సంస్థ పని చేస్తోంది. గాంధీ టి.బి. క్లినిక్ పేద క్షయ రోగులకు ఉచిత సేవలందిస్తోంది. కవితా సమితి, స్నేహ సమితి, బాలానందం వంటి పలు సాహితీ సంస్థలు ఉన్నాయి. (జూనియర్ ఛాంబర్, వైశ్య యువజన సంఘం (1939), గౌరీ యువజన సంఘం 1966, గౌరీ సేవా సంఘం 1970, ప్రేమ సమాజం 1943లో స్థాపించబడినాయి. డైమండ్ హిట్స్ అనే సాంస్కృతిక కళాభివృద్ధికి తోడ్పడుతుంది. అంతేగాక నూతనంగా

నిర్మించిన రావుగోపాలరావు కళాకేంద్రం, ఎన్.టి.ఆర్. స్టేడియం అనకాపల్లికి మరింత శోభాయమానంగా తయారైనవి.

అనకాపల్లి మండల కేంద్రం కావున ఎమ్.ఆర్.ఓ. ఆఫీసు, ఎమ్.డి.ఓ. ఆఫీసు మున్సిపల్ ఆఫీసు, పోలీసు స్టేషన్, సబ్ రిజిస్ట్రార్ ఆఫీసు, సోషల్ వెల్ఫేర్ ఆఫీసులు ఉన్నాయి. ప్రజలలో పొదుపును ప్రోత్సహించేందుకే స్టేట్ బ్యాంకు, మొదలగునవి ఉన్నాయి. ఈ మండలంతో అన్ని గ్రామాలనూ కలుపుతూ తారు, సిమ్మెంటు, కంకర రోడ్లు ఉన్నాయి. ప్రతీ గ్రామానికీ విద్యుత్ సౌకర్యం ఉంది.

వినోదం కోసం ఈ అనకాపల్లిలో ఎనిమిది సినిమా హాళ్ళు ఉన్నాయి. ఇతర ఊళ్ళ నుండి వచ్చే వారికి వసతి కల్పించేందుకు శ్రీ సూర్య లక్ష్మీ లాడ్జి, మురళీకృష్ణా లాడ్జి రంగా, శ్రీధర్, శ్రీనివాసా, మనోహర్ వంటి అనేక లాడ్జీలు ఉన్నాయి. పెరుగుతున్న నాగరికతకు చిహ్నంగా ఈనాడు ప్రతీ గ్రామంలో, ప్రతీ యింటిలో ఒక రేడియో, టేప్ రికార్డర్, టి.వి.ల వంటి ప్రసార సాధనాలు వాడుకలో ఉన్నాయి. ఈ అనకాపల్లి మండల పరిషత్‌లోని గ్రామీణులంతా నాగరికులే. విద్యా సౌకర్యాలు ఉండుట వలన అక్షరాస్యుల సంఖ్య కూడా ఎక్కువే. ఇక్కడి ప్రజల మాతృభాష తెలుగు. ఈ మండలం అనకాపల్లి అసెంబ్లీ అనకాపల్లి పార్లమెంటరీ నియోజక వర్గములుగా చెందుతుంది.

**14. కవులు, రచయితలు, కళాకారులు :-**

అనకాపల్లి కవులకు, కళాకారులకు, విద్యావేత్తలకు పుట్టినిల్లు. క్రీ॥శ॥ 16వ శతాబ్దంలో రామభద్ర పాయకరావు సర్వకామదాంబ పరిణయం, చంపూ రామాయణం, నీలగిరినాథ శతకం, పద్మినీ పరిణయం మొ॥ ప్రసిద్ధి చెందిన రచనలు చేశారు. ఇతను శతాధికం గ్రంథకర్త. రాష్ట్రపతి ప్రశంస పొందిన 'పలుకే బంగారామాయే' నాటక రచయిత శ్రీ దాడి వీరభద్రరావు అనకాపల్లి వాసి. ప్రముఖ సినీ గీత రచయిత 'సిరివెన్నెల సీతారామశాస్త్రి ఈ ప్రాంతం వాడే. వేదుల వెంకట శాస్త్రి గారు రామాయణాన్ని సామాన్యులకు అర్థము అయ్యే విధంగా వచనంలో వ్రాసిన ప్రముఖ పండితులు. ప్రముఖ కథా రచయిత శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం వైజ్ఞానిక కథా రచయిత, వ్యాసకర్త డా॥ బి.జీ.వీ. నరసింహారావు, ప్రముఖ నవలా రచయిత శ్రీ కొమ్మనాపల్లి గణపతిరావు మొదలగు వారు కలరు.'బాలాజీ దాసు - మరొకరు ఇతను హరికథలు జనరంజకముగా చెప్పేవారు. ఇతను అనేక రచనలు చేశారు. రాష్ట్రం గర్వించ తగ్గ చిత్రకారుడు స్వర్గీయ వడ్డాది పాపయ్య అనకాపల్లి మండలం కశింకోట నివాసి. సినీ రంగంలో వర్ధమాన నటులుగా ఉన్న శ్రీ పీలా కాశీ మల్లికార్జునరావు, శ్రీ అలక్‌చంద్ రామకృష్ణ, శ్రీ బాలాజీ, బుద్ధ కాశీవిశ్వనాధంలు అనకాపల్లి వాసులే. కోకిల సినిమా నిర్మాత శ్రీ గుర్రం మహేశ్వరరావు కూడా అనకాపల్లి వారే. అనకాపల్లిలో పేదలకు తన సహాయ సహకారాలు అందించిన విద్యావేత్తల విషయంలో హైకోర్టు జడ్జి పుష్పల నీలాద్రిరావు, లక్ష్మీనివాస్ బ్యాంకు ఛైర్మన్ శ్రీ జి.వి.రావు, ఆంధ్రా యూనివర్సిటీ మాజీ వైస్‌ఛాన్సలర్ ప్రొఫెసర్ కె.వి.రమణ, రోటరీ జిల్లా గవర్నర్ శ్రీ వి.వి.సన్యాశిరావు, లయన్సు క్లబ్ గవర్నర్ డా. జీ.

సుబ్రం మొ॥ ప్రముఖులు అంతా అనకాపల్లి వారే. ప్రముఖ పరిశోధకుడు స్వర్గీయ గంటి శ్రీరామమూర్తి, కళాప్రపూర్ణ కె.సుబ్బరాజు, ఉత్తమ ఉపాధ్యాయ జాతీయ అవార్డు గ్రహీత శ్రీ కొణుతుల నారాయణరావు, ఆలిండియా ఖో-ఖో ఫెడరేషన్ అధ్యక్షులు, ఉత్తమ వ్యాయామ ఉపాధ్యాయులు అవార్డు గ్రహీత శ్రీ దొడ్డి అప్పారావు, మొదలయిన ప్రముఖులెందరో అనకాపల్లి వాసులై యున్నారు. గంటా శ్రీనివాసరావు, రామకృష్ణ పార్లమెంటు సభ్యులుగా, శ్రీ దాడి వీరభద్రరావు గారు శాసనసభ్యులుగా వున్నారు.

## 15. స్వాతంత్ర్య సమర యోధులు :-

స్వాతంత్ర్య సమరానికి తొలి శంఖారావం అనకాపల్లిలోనే ప్రారంభమైంది. సిపాయిల తిరుగుబాటు జరుగక ముందే అనగా 1753లోనే ఫ్రెంచి వారిపై అనకాపల్లిలో దాడి జరిగింది. అంతేకాదు బుస్సీదొరను అనకాపల్లి సమీపంలోని కశింకోటలో బంధించారు. ఎందరో స్వాతంత్ర్య సమరయోధులు అనకాపల్లి విచ్చేసారు. మహాత్మాగాంధీ ఇచ్చిన విదేశీ వస్త్ర బహిష్కరణ పిలుపునకు దేశంలో ప్రప్రథమంగా స్పందించింది అనకాపల్లి పట్టణమే. విదేశీ వస్త్రాలను బహిష్కరించి అక్షర క్రమంలోనే కాక అన్నింటా ముందున్నామని ఈ గెడ్డ బిడ్డలు నిరూపించారు.

జాతిపిత మహాత్మాగాంధీ అనకాపల్లి విచ్చేసి బెల్లం మార్కెట్‌లో ఏర్పాటు చేసిన బహిరంగ సభలో ప్రసంగించారు. అప్పుడు బెల్లం మార్కెట్టుకు తమ పేరు పెట్టుకుంటామని వర్తకులు గాంధీ అనుమతి కోరగా తప్పులు చేయకుండా ఉంటే తన పేరు పెట్టుకోవటానికి అభ్యంతరం లేదని గాంధీ చెప్పారు. నాటి నుండి ఇది గాంధీ మార్కెట్ అయింది. బెల్లం మార్కెట్ ద్వారా ప్రభుత్వానికి ఏటా 48 కోట్ల రూపాయలు ఆదాయం వస్తుందని అంచనా.

మహాత్ముడు వచ్చిన మరో సంవత్సరానికి నవభారత నిర్మాత, పండిత జవహర్‌లాల్ నెహ్రూ అనకాపల్లి వచ్చారు. విప్లవవాది సుభాష్ చంద్రబోస్ కూడా తన ఉద్రేక పూరిత ప్రసంగం ద్వారా అనకాపల్లి ప్రజలలో స్వాతంత్ర్య పోరాట స్ఫూర్తిని నింపారు. శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, ఎన్.జి.రంగా, భారత కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త శ్రీ పి.సి. జోషి, సోషలిస్టు ఉద్యమనేత శ్రీ జయప్రకాష్ నారాయణ మొ॥ వారు కూడ అనకాపల్లి వచ్చి తమ ప్రసంగాల ద్వారా ప్రజలను ఉత్తేజితులను చేశారు.

ఆనాటి కాలంలో శ్రీ కోరుబిల్లి జోగారావు (టీచరు) జక్కనమిల్లి శ్రీరామమూర్తి (కంపౌండర్) 1944-45వ సం.లో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని గవర్నమెంటు వారికి వ్యతిరేకంగా మాట్లాడుట వలన వారిని రాయవెల్లూరు జైల్లో బంధించారు. సూరిశెట్టి జగ్గయ్య గారు కూడా ఆనాటి స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. శ్రీ వి.వి. రమణగారు స్వాతంత్ర్య సమర యోధులేకాక సుప్రసిద్ధ రాజకీయ వేత్త.

## 16. కర్మాగారములు :-

అనకాపల్లి మండలంలో ఇటుకలు, పెంకులు తయారు చేయు ఫ్యాక్టరీలు,

పంచదార ఫ్యాక్టరీలు, సిమ్మెంటు ఫ్యాక్టరీలు, బిస్కెట్లు తయారు చేయు కంపెనీలు మొ॥నవి కలవు. కుటీర పరిశ్రమలుగా బట్టలకు రంగులు వేయుట, అగరుబత్తీలు, అప్పడాలు తయారుచేయుట, పుట్టగొడుగుల ఉత్పత్తి పరిశ్రమ, మొదలగునవి కలవు. అనకాపల్లి మండల సమీపంలో కోళ్లను పెంచుటకు కోళ్ళ ఫారంలు కలవు. పారిశ్రామిక వాడ ఉన్నవి. (అనగా కొన్ని చిన్న పరిశ్రమల కూడలి).

## 17. షుగర్ ఫ్యాక్టరీ :-

ఈ ఫ్యాక్టరీని 1934-35 లో శ్రీరామకృష్ణా 'కోపరేటివ్ అగ్రికల్చరల్ అండ్ ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ పేరుతో శ్రీ దంతులూరి జగన్నాధరాజు, శ్రీ ఆర్.కె.ఎల్.ఎన్. గజపతిరాజు, శ్రీ బొడ్డేడ అచ్చియ్యనాయుడు తదితరులు కలిసి స్థాపించారు. ప్రస్తుతం ఈ ఫ్యాక్టరీ పాలక వర్గానికి జిల్లా కలెక్టర్ ఛైర్మన్‌గా ఉన్నారు. ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరక్టరుగా శ్రీ ప్రసాదరావు గారు ఉన్నారు.

ఈ ఫ్యాక్టరీకి సుమారు 4 కోట్ల రూపాయలు ఆస్తి ఉంది. ఈ ఫ్యాక్టరీకి సుమారు వేయి టన్నుల చెరకు క్రషింగ్ చేసే కెపాసిటీ ఉంది. ఈ మధ్యకాలంలో దీనిని ఆధునికీకరణ చేశారు. ఇందు ప్రత్యక్షంగా వేయిమంది కార్మికులు, పరోక్షంగా పదివేల మంది రైతులకు జీవనోపాధి కల్పించబడుతుంది. ఈ ఫ్యాక్టరీలో ఒక పంచదారే కాకుండా డిస్టిలరీ (ఆల్కహాలు) సోడాగ్యాసు, ఔషదాలు కూడా ఉత్పత్తి అవుతాయి. సీజనుకు 70 వేల నుండి లక్ష క్వింటాళ్ళ వరకు పంచదార ఉత్పత్తి చేస్తుంది.

## 18. అనకాపల్లిని కనకపల్లి చేసిన బెల్లం మార్కెట్ :-

అనకాపల్లికి కనకాపల్లి అని పేరు రావటానికి కారణం బెల్లం మార్కెట్. "కడుపుతో నున్నమ్మ కనకమానదు అన్నట్టు అనకాపల్లి మార్కెట్టుకొచ్చిన్నమ్మ బెల్లం అమ్మక మానదు. అనినానుడి ఒకనాటి కలెక్టరు బాలాజీ రావునాయుడు పేరుతో ఏర్పడిన ఈ మార్కెట్ గాంధీ సందర్భానంతరం గాంధీ మార్కెట్‌గా మారింది. ఈ అనకాపల్లి బెల్లం మార్కెట్ దేశంలోనే ద్వితీయ స్థానంలో ఉంది. మార్కెట్‌కు వచ్చిన బెల్లంలో సుమారు 80 వంతులు మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్, బీహార్ రాష్ట్రాలకు ఎగుమతి చేస్తారు. అస్సాం, తమిళనాడు రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలకు కూడా ఎగుమతి అవుతోంది. రైల్వే వ్యాగన్లు, లారీల ద్వారా ఏటా 60 వేల టన్నుల బెల్లం ఎగుమతి అవుతోంది. దీనిలో 30 శాతం రైల్వే వ్యాగన్ల ద్వారా 70 శాతం లారీల ద్వారా రవాణా చేస్తున్నారు.

## 19. విశాఖజిల్లా సహకార మార్కెటింగ్ :-

విశాఖ పట్టణం జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటీ (డి.సి.ఎం.ఎస్.) విశాఖపట్నం ప్రధాన కేంద్రంగా పనిచేసే ఈ సొసైటీ వ్యాపారమంతా అనకాపల్లి నుంచే నిర్వహిస్తుంది. చోడవరం, కోటవురట్లలో శాఖలు మరో 12 విక్రయ కేంద్రాలు ఉన్నాయి. ఇవికాక 110 సభ్య సంఘాల (పి.ఎ.సి.ఎస్) ద్వారా రైతులకు సేవలు అందిస్తుంది.

ఈ సొసైటీ ఛైర్మన్ తాకాశి ఉమామహేశ్వరరావుగారు, సూర్యనారాయ
అప్పలనాయుడు, సిబ్బంది, డైరక్టర్లు అధికారుల సహకార సహాయముతో ఈ సంస్థ
ప్రగతి పథంలో నడిపిస్తున్నారు. దీని బిజినెస్ మేనేజరుగా ఎమ్.ఎస్.భగవాన్ ఉన్నా

## 20. చారిత్రక ప్రదేశాలు :-

చారిత్రాత్మకమైన బొజ్జన్న కొండ అనకాపల్లి సమీపంలో గల శంకరం గ్రా
పరిధిలో ఉంది. బుస్సీని బంధించిన బురదకోట కశింకోటలో ఉంది. అయితే నే
ఇది సాక్షికంగా నిలిచి ఉంది. నాటి జమిందారీ భవనం నేడు అనకాపల్లి గ్రామీ
విద్యుత్ సహకార సంఘం (ఆర్.యి.సి.ఎస్) కార్యాలయంగా దర్శనమిస్తుంది. ఇ
కూడా కశింకోటలోనే ఉంది. రాణీగారితోటగా పిలువబడే భూమి ఇప్పటి
పూల్‌భాగ్‌రోడ్‌లో ఉంది. విశాఖపట్నం జిల్లా సహకార మార్కెటింగ్ సంఘ
(డి.సి.ఎమ్.ఎస్) వ్యాపారమంతా ఇక్కడే జరుగుతుంది. ఈ సంస్థ ఆవరణలోనే విత్త
శుద్ధి కర్మాగారం ఉంది. దేశంలోనే చెరకు పరిశోధనలో అగ్రగామిగా నిలిచిన ప్రాంతీ
వ్యవసాయ పరిశోధనా సంస్థ ఇక్కడే ఉంది. సహకార రంగంలో నెలకొల్పిన అనకాప
చక్కెర ఫ్యాక్టరీ తుమ్మపాలలో ఉంది.

## 21. చరిత్ర ప్రసిద్ధి పొందిన బౌద్ధ క్షేత్రం బొజ్జన్న కొండ :-

అనకాపల్లికి 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న బొజ్జన్న కొండవద్ద వున్న బౌ
శిల్పాలు పూర్వ ఔన్నత్యానికి అద్దంపడుతున్నాయి. సుమారు 1200 సం.ల క్రిత
బౌద్ధమతాచార్యులు నిర్మించిన ఈ బౌద్ధక్షేత్రం గతంలో బౌద్ధులతో సందడిగా ఉండేద
ఈ ఆలయంలో నేడు నిర్మాణంలో ఉన్న బౌద్ధ శిల్పాలు దర్శనమిస్తాయి. బౌ
మతాచార్యులు ఎంతో శ్రమించి కొండలను తొలచి నిర్మించిన ఎన్నో స్థూపాల
గుహాలయం, శిల్పాలు, ప్రభుత్వ అనాదరణకు గురయ్యాయి. ఈ బౌద్ధక్షేత్రాన్ని దేశవిదేశా
నుండి పర్యాటకులు సందర్శించుతారు. నాగార్జునుని కాలంలో ఆంధ్రదేశంలో బొజ్జ
కొండ, శంకవరం, ఇంకా అనేక ప్రాంతాల్లో బౌద్ధారామాలుండేవి.

మత్స్యాకారంలో మల్చబడిన ఈ కొండ దేశంలో మరెక్కడా లేదు. దీనికి
లింగాలకొండని పేరుంది. ఈ కొండపై అసంఖ్యాకంగా రాతిదగోబాలు ఉన్నాయి.
వీటిపైగల 'ఛత్రములు' ఖండించడం వలన ప్రస్తుతం ఇవి శివలింగాలుగా
కనబడతాయి. అందువలన దీనికి లింగాల కొండ అని పేరు వచ్చింది. ఈ కొండ
పశ్చిమ దిశలో చాలాపెద్ద రాతి స్థూపం ఉంది. దీనిని ఆనుకొని ఒక గుహకూడా
ఉంది. ఈ గుహలకు స్తూపానికి మధ్య 24 గం.లు చల్లని గాలి వీస్తూనే ఉంటుంది.
ఇక్కడ కూర్చునే వారికి సముద్రం ఒడ్డున కూర్చున్న అనుభూతి కలుగుతుంది.

ఈ కొండ దక్షిణపు అంచున గల గుహాలయంలో కూడా మత్స్యాసనంలో
కూర్చున్న రాజు విగ్రహం ఉంది. ఇది వడ్డాదిని రాజధానిగా పాలించిన అర్జునదేవునద
జన శ్రుతి. బహుశా ఈ వంశస్థులే మధ్యయుగాలలో లింగాల కొండను మత్స్యాకారంలో

మలచి ఉంటారని ఊహిస్తున్నారు.

ప్రతి సంవత్సరం సంక్రాంతి మరునాడు జరిగే కనుమ పండుగ రోజునే దేవాలయం వద్ద ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవానికి మండలంలోని పలుగ్రామాల నుంచి వేలాది మంది హాజరవుతారు. కొంతమంది తమ పశువులను దేవాలయం వద్దకు తీసుకువచ్చి గుహాలయములో ప్రదక్షిణ చేయించే అలవాటు ఉంది. ఇక్కడ ఉన్న హరిత విగ్రహాన్ని ఎరియమ్మ విగ్రహంగా భావించి ఆ రోజున దానిని రాళ్ళతో కొడతారు. ఎరియమ్మ చిన్న పిల్లల్ని చంపుతుందనే మూఢనమ్మకం ఇక్కడి ప్రజలలో ఉంది. హరిత విగ్రహాన్ని రాళ్ళతో కొట్టడం వల్ల విగ్రహం దెబ్బతిన్నది. ఈ బౌద్ధ క్షేత్రాన్ని ఫ్రాన్స్, శ్రీలంక, బర్మా, థాయ్‌లాండ్, అమెరికా, నేపాల్, జపాన్ మొ॥ దేశాలకు చెందిన బౌద్ధ యాత్రికులు తరచు సందర్శిస్తుంటారు. ఈ ప్రాంతాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమాచార పర్యాటక శాఖ మంత్రి తమ్మినేని సీతారాం దర్శించి దాని అభివృద్ధికి మరికొన్ని చర్యలు చేపడతామని చెప్పారు.

తొలి తెలుగు తిరుగు బాటు యోధుడు
కాకర్లపూడి ఏలిన కర్మభూమి
విశ్వ శాంతికి ఓనమాలు దిద్దిన
పాఠశాల మా బొజ్జన్న కొండ
సిరులు పండించు పవిత్రమూర్తి
మా శారదా నదీమ తల్లి
ఇక్షుసముద్రాన ఓలలాడు
రసికులు మా కవివరేణ్యులు
జీవకళల అలరారు
అల్కాపురిమా అనకాపల్లి.

**22. జాతులు :-**

అనకాపల్లిలో అనేక జాతుల వారు నివసించుచున్నారు. వీరిలో గవర కులస్థులు ప్రథమ స్థానంలో ఉండగా కాపుకులస్థులు రెండవ స్థానమును ఆక్రమించినారు. బ్రాహ్మణులు, కోమట్లు, విశ్వబ్రాహ్మణులు, కంసాలి, తెలగాలు, బోయలు, దాసర్లు, యాదవులు, కమ్మవాళ్ళు, రెడ్డి, మంగలి, చాకలి, కుమ్మర్లు, జంగాలు, అగ్నికుల క్షత్రియులు, రెల్లి కులస్థులు మొ॥ జాతుల వారు కలరు.

**23. ఆలయాలు :-**

అనకాపల్లి ప్రజలు మిక్కిలి భక్తి ప్రవత్తులు కలవారు. వారి భక్తికి నిదర్శనంగా అనేక దేవాలయాలు నిర్మించుకున్నారు. వాటిలో ఉత్తరాంధ్రకు దైవం, ఆపదమొక్కుల తల్లి నూకాలమ్మ, శ్రీ కన్యకాపరమేశ్వరీ, శ్రీ గౌరీపరమేశ్వరి, సంతోషిమాత, జగన్నాథ స్వామి, సత్యన్నారాయణస్వామి, సాయిబాబా, ఆంజనేయస్వామి, నాగేంద్రుని గుడి, భోగలింగేశ్వరస్వామి, వెంకటేశ్వరస్వామి, శ్రీ రాములవారి గుడులు ఇందు ముఖ్యమైనవి.

ఇవి గాక ఒక్కో వీధిలో రాములవారు, సంతోషిమాత, సాయిబాబా, ఆంజనేయస్వామి మొ॥ దేవతల ఆలయాలలో పూజలు జరిపిస్తారు. వీటి కన్నా ముఖ్యంగా మండలంలో ప్రతి గ్రామానికి ఒక గ్రామ దేవత ఉంటుంది. గ్రామ దేవతల పండుగలను అత్యంత వైభవంగా జరిపిస్తారు.

అనకాపల్లి మండల పరిధిలో జగన్నాథపురంలో నూకాలమ్మతల్లి, తగరంపూడిలో మరిడెమ్మతల్లి, డొంకాలమ్మ, కూండ్రంలో నేరాలమ్మ, కుంచంగిలో మరిడెమ్మ రొంగలివానిపాలెంలో పైడితల్లమ్మ, వేటజంగాలపాలెంలో పరమటమ్మ, సీతానగరములో నల్లమారెమ్మ, కొత్తూరులో సివాలమ్మ, మరిడమ్మ, తుంపాలలో పోలిపల్లెమ్మ, మరిడిమాంబ, అల్లికానుడి పాలెంలో మరిడమ్మ, దుర్గాలమ్మ, మార్టూరులో పరదేశమ్మ, దుర్గాలమ్మ మాకవరంలో నూకాలమ్మ, మరిడిమాంబ, దుర్గాలమ్మ, పైడితల్లమ్మ, పాపయ్యపాలెంలో పైడితల్లమ్మ గున్నపాలెంలో పైడిమాంబ, చింతనిప్పల అగ్రహారంలో దుర్గమాంబ, రేబాకలో పోలిపల్లెమ్మ, కొప్పాకలో పైడిమాంబ, సిరసపల్లిలో దుర్గాలమ్మ, రాజపాలెంలో కనకమహాలక్ష్మి మారేడుపూడిలో మరిడిమాంబ, మారేడుపూడి అగ్రహారంలో దుర్గాలమ్మ, నర్సింగరావు పేటలో మోదకొండమ్మ, వల్లూరులో పరదేశమ్మ, పిసినికాడలో మరిడమ్మతల్లి, దిబ్బపాలెంలో మరిడెమ్మ, గున్నువానిపాలెంలో దుర్గాలమ్మ, అక్కిరెడ్డిపాలెంలో నూకాలమ్మ, శీరంశెట్టి వానిపాలెంలో దుర్గమాంబ, సాలాపువాని పాలెంలో మరిడిమాంబ మొదలగు గ్రామ దేవతలు ఉన్నారు.

# ప్రముఖ దేవాలయములు



నూకాంబికా దేవాలయం

### 1. నూకాంబికా ఆలయం :-

ఇది గవరపాలెం కోటవీధిలో ఉంది. అనకాపల్లిని పాలించిన కాకర్లపూడి అప్పలరాజు ఈ ఆలయాన్ని 'కాకతాంబ'గా ప్రతిష్టించాడు. ఈ తల్లిని 'నూకాంబికా' అని, నూకాలమ్మ అని పిలుస్తూ కొలుస్తున్నారు. ఈ పేరు మార్పుకు సరైన వివరణ కానరాలేదు. ఫాల్గుణ అమావాస్యకు జరుగు ఈమె మహోత్సవానికి అనేక వేలమంది భక్తులు వస్తుంటారు.

### 2. శ్రీ భోగలింగేశ్వర స్వామి ఆలయం :-

గవరపాలెం కోట వద్ద ఈ ఆలయం ఉన్నది. దీనిని కూడా కాకర్ల పూడి రాజులే ప్రతిష్టించారు. పాల్గుణశుద్ధ ఏకాదశికి కళ్యాణం వైభవంగా జరుగుతుంది. ఈ ఆలయ ఆవరణలోనే శ్రీ సర్వకామదాంబ ఆలయం ఉన్నది.

### 3. శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయం :-

ఇది 3 శతాబ్దాల పూర్వం నిర్మాణమైంది. తిరుమల, తిరుపతి దేవస్థానం వలె యదావిధి పూజ, ఉత్సవాలు జరుగుతాయి.

### 4. శ్రీ సత్యన్నారాయణస్వామి ఆలయాలు :-

అనకాపల్లి ఊరి చివర సుంకరమెట్ట వద్దను, కాలేజీ వద్ద కొండ మీదను, కొండ క్రిందను ఈ ఆలయాలు ఉన్నాయి. మాఘశుద్ధ ఏకాదశికి కళ్యాణాలు, మహోత్సవాలు జరుగుతున్నాయి.

### 5. శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయం :-

ఈమె వైశ్యుల కులదేవత. 1925లో ఈమె ప్రతిష్ట జరిగింది. వైశాఖ శుద్ధ దశమినాడు ఈమె జన్మదినోత్సవము. దేవీ ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి.

### 6. శ్రీ గౌరీ పరమేశ్వరీ ఆలయం :-

నిదానం దొడ్డిలో ఈ ఆలయం ఉన్నది. ఈ ఆలయాన్ని గవర కులస్థులు 1947లో ప్రతిష్టించారు. ఈమె వారి కులదేవత. కార్తీక, పుష్యమాసాలలో ఘనంగా ఉత్సవాలు జరుగుతాయి.

### 7. శ్రీ కాశీ విశ్వేశ్వర ఆలయం :-

సుమారు 60 ఏళ్ల క్రితం శ్రీ తాటికొండ వంశీయులచే ప్రతిష్టించబడినది. శివరాత్రి మహోత్సవం, గణపతి ఉత్సవాలు ఇచ్చట జరుగుచున్నవి.

ఇవి గాక పట్టణంలో శ్రీ సిద్ధిలింగేశ్వర స్వామి, జగన్నాథస్వామి, సత్యన్నారాయణస్వామి, సంతోషిమాత, కనకదుర్గ, ఆంజనేయస్వామి, కామాక్షి శ్రీ మరిడమ్మ, కుంచావారి గౌరమ్మ, విఘ్నేశ్వర, వీరభద్ర స్వామి, పెదరామస్వామి, చిన రామస్వామి, సీతారామస్వామి, ఆలయాలు ఉన్నాయి.

అవతార్ మెహర్ బాబా, కుసుమకుమారి, మరిడమ్మ, దుర్గాలమ్మ, పోలమాంబ, సత్తెమ్మ, గంగపరదేశమ్మ, గవరపాలెం గౌరమ్మ, వేల్పులవీధి గౌరమ్మ, మొ॥ అనేక దేవాలయములు అనకాపల్లి పట్టణ పౌరుల ప్రగాఢ అధ్యాత్మిక తత్త్వనిరూపణకి నిదర్శనము.

### 25. మసీదులు - చర్చిలు :-

ఈ మండలంలో హిందువులకు దేవాలయములతో పాటూ ముస్లింలకు మసీదులు, క్రిస్టియన్లకు చర్చిలు నిర్మించి మత సామరస్యాన్ని పాటిస్తున్నారు. అనకాపల్లిలో కాంప్లెక్సు వద్ద, తాలూకా ఆఫీసువద్ద గల చర్చిలు చాలా ప్రధానమైనది. అలాగే పెద్ద బజారుగా పిలువబడే కూరగాయల మార్కెట్టు వద్ద గల మసీదు కూడా చాలా ప్రధానమయినది.

### 26. పండుగలు - వినోదాలు :-

అనకాపల్లి ప్రజల భగవదారాధన ప్రియులు. దేవుని ఉత్సవాలు జరిపి పండుగల విషయంలో ఉత్సాహాన్ని చూపిస్తారు. నిత్యం నగరంలో ఏదో ఒక దేవాలయంలో దేవుని ఉత్సవాలు జరుగుతుంటాయి. వినాయక నవరాత్రులు మొదట జరుపుతారు. అది తొమ్మిది రోజులైనప్పటికినీ 15, 20 రోజుల పాటు ఉత్సవాలు జరుపుతారు. అది కాగానే దేవీ నవరాత్రులు, ప్రతి వీధిలోనూ కాళీమాతను ప్రతిష్టించి వినాయక నవరాత్రుల వలే ఉత్సవాలు జరిపిస్తారు. తరువాత వెంకటేశ్వర కళ్యాణం, శ్రీరామనవమీ, కన్యకాపరమేశ్వరీ, కామాక్షీదేవీ, ఇలా ప్రతి దేవునికి 5,9,15,20 రోజులు ఉత్సవాలు నిర్వహిస్తారు. ఈ ఉత్సవ రోజుల్లో ఒక్కో రాత్రి ఒక్కొక్క రకమైన వినోద కార్యక్రమములుంటాయి. అనగా సినిమాలు, హరికథలు, బుర్రకథలు, రికార్డింగ్ డ్యాన్సులు, మిమిక్రీ లలిత సంగీతం, నాట్య ప్రదర్శనలు, ఆర్కెస్ట్రాలు మొ॥ వివిధ రకాలయిన కార్యక్రమములు అమలు జరుపుతూ ఉత్సవాలు నిర్వహిస్తారు.

# III. గ్రామ దేవతారాధన ప్రారంభదశ - వికాసము

## గ్రామ దేవతల ఆరాధన ప్రారంభ దశ - వికాసము

మానవ సంస్కృతి వికాసమందు మతము అధిక ప్రాధాన్యము సంతరించుకున్నది. పురాగాధలు మతము ఈ రెంటికి అవినాభావ సంబంధము కలదు. కావున మతము పరిణామాలను అలంబనముగా గ్రహించి పురాగాధలను పరిశీలించిన అవగతమగును. మతములోని మౌలికాంశమైన ఆత్మారాధన నుండియే భగవదారాధన ప్రారంభమైనదనియు ప్రకృతిలోని వస్తువుగానీ ప్రాణిగానీ ఒక వంశమునకు మూలమనియు దాని రక్త సంభందము ఆ వంశమునకు కలదని భావించుట ప్రాచీన మతాచార పద్ధతుల్లో ఒకటి.

**మాతృదేవతారాధన :-**

ప్రాచీన మానవులు వ్యవసాయంలో స్థిరపడుచున్న కాలంలో మాతృస్వామిక యుగమున ప్రపంచమంతయూ పంటలకు ప్రతి రూపం స్త్రీ దేవతలని ప్రజలచే ఆరాధనలను పొందినారు. జానపద సాహిత్యాన ఈ దేవతల మహాత్యము వర్ణించు కథలు అనేకం ఉన్నాయి. ఈ గ్రామ దేవతల కథలన్నియూ ఆ నాటి మౌళికాంశముల మీద నిర్మితమైనవని నిర్ధారించవచ్చును.

**పౌరాణిక దేవతారాధన :-**

మాతృస్వామిక వ్యవస్థ తరువాత మానవుడు వ్యవసాయం మీద స్థిర జీవితం ఏర్పరుచుకొని సంచార మానవునిగా కాక నాగరిక జీవితాన్ని అలవర్చుకొనెను. ఈ సమయమున స్త్రీ ప్రాధ్యాన్యము తగ్గి పురుష ప్రాధ్యాన్యము హెచ్చినది. ఇది క్రమముగా పౌరాణిక దేవతారాధనకు దారి తీసినది.

ఆచారము, పురాగాధల వలన సమాజపు వ్యక్తుల మధ్య భావైక్యతను సాధింపవచ్చును. మానవుని ఆలోచనా విధానాలు, చేతలు ఒకే ప్రామాణిక మార్గములో పయనించుటకు పురాణగాధలు, ఆచారాలు, దోహదము చేయుచున్నవి. ఆచార క్రమ వికాసము, మత పరిణామాలను గ్రహించుట పురాగాధలకు అమూల్యమైన సంపదలు.

పల్లెలకు పట్టుకొమ్మ భారతదేశము. ఈ పల్లెలలో భారతీయు ఆత్మ ప్రకాశించుచున్నది. పల్లెలన్నియూ దుష్టశిష్ట శక్తుల చేత కూడుకున్నవనియు, వాటి నుండి రక్షించు భారము దేవతలదేనని వారి నమ్మకము. దేవతకు అనుగ్రహము కలిగినచో ఆ పల్లె సిరులతో తులతూగుననియు, ఆగ్రహం కలిగితే అరిష్టములు కలుగునని పల్లీయుల విశ్వాసము. ఆరాధన అన్నది ఆదిమానవుని నుండి వస్తున్న ఆచారము. ఇది కేవలము భయంతో మొదలయి భక్తిగా మారింది. గ్రామ దేవతల అనుగ్రహమునకై, నైవేద్యాలు, జంతు బలులు, అర్పించి జాతర ఉత్సవములు జరుపుచున్నారు. భౌతికమైన అవసరాలకు ఈ ఆరాధనా తత్త్వము మొదలై ఆర్య ద్రావిడ జాతుల సంఘర్షణలో పితృస్వామిక, మాతృస్వామిక వ్యవస్థలుగా నిలిచాయి. తరువాత

ఆర్య ద్రావిడ జాతుల సంఘర్షణలో పితృస్వామిక వ్యవస్థపై మాతృస్వామిక వ్యవస్థ దాడి చేసి బలపడినది. ఆ కారణంగా మాతృారాధనతత్త్వము వెలిసింది. కావున గ్రామదేవతలు స్త్రీమూర్తులైనారు. స్త్రీదేవతలకు గల ప్రాధాన్యము పురుష దేవతలకు లేదు. జానపదులు వైదిక మత ప్రభావము కలిగి ఉన్నా మాతృస్వామిక వ్యవస్థ అయిన గ్రామదేవతారాధనను మాత్రము విడువలేకపోయిరి.

హిందూ దేశము నున్న ఆర్యద్రవిడ జాతుల సమ్మేళనమే హిందూ సమాజం. దేశంలో స్త్రీపరంగా ప్రకృతిని ఆరాధించు పద్ధతి నాలుగు వేల సంవత్సరాలకు పూర్వమే కలదు. హారప్పా మొహంజుదారో త్రవ్వకాలవల్ల లభించిన స్త్రీమూర్తి శిలలు తెలియచేయుచున్నవి.

మానవ జాతి చరిత్రలో ఏ దశ యందు గ్రామ దేవతలు పుట్టిరో తెలుసుకొనుటకు మాతృస్వామిక దశ ఏర్పడిన విధానము పరిశీలించిన సమాధానము దొరుకుతుంది. మానవజాతి పరిణామాలు మూడు దశలుగా చెప్పవచ్చును. అవి 1. ఆటవిక దశ 2. అనాగరిక దశ 3. నాగరిక దశ.

**1. ఆటవిక దశ :-**

ఆదిమ మానవుడు గుహలలో చెట్ల తొర్రల్లో జీవనాన్ని సాగించేవాడు. ఆ దశలో మానవునకు ప్రకృతి జ్ఞానము లేదు. ఆకలి తీర్చుకొనుటకు ఆకులు కాయలు పండ్లు, దుంపలు ఆహారముగా స్వీకరించేవారు. ఈ విధముగా కొన్ని వేల యేండ్లు గడచిన తరువాత రాళ్ళ రాపిడి వల్ల నిప్పును కనుగొన్నాడు. ఆ నిప్పుతో దుంపలను మాంసమును కాల్చుకొని తినుచూ అనాది మానవుడిగా పెరిగి విల్లును కనిపెట్టి దాని సహాయముతో జంతువుల పక్షులపై ఆదిపత్యం సాధించెను. వేట ఆనాటి మానవుని జీవనాధారమైనది.

**2. అనాగరిక దశ :-**

ఇటుకలతో గృహములను నిర్మించుట పాత్రలను తయారు చేయుట, పసువుల మేతకై నదీ తీరముల యందు సంచరించుటతో అనాగరిక దశ ప్రారంభమైనది. వీరు గుంపులుగా ఏర్పడి జీవనమును సాగించారు. దీనినే గణవ్యవస్థగా పేర్కొన్నారు. కొన్ని గణములు కలిసి కూటమిగాను కొన్ని కూటములు కలిసి ఒక తెగగానూ రూపు దిద్దుకొనెను. ఋగ్వేద మందు యదు తుర్వ శు దహ్యలనునవి ప్రధాన గణాలు. శౌనకులు కుక్క సంకేతము కలవారు. మాతంగులు ఏనుగు సంకేతము గలగణ జీవులు.

గణ వ్యవస్థ ప్రారంభాన స్త్రీకి జన్మించిన శిశువును తల్లి ద్వారా గుర్తించుదురు. స్త్రీ సంతానము ద్వారా వృద్ధి చెందిన గుంపే గణముగా వ్యవహరించేవారు. అందుచేతనే స్త్రీని గణమాతగా పిలిచేవారు. పిల్లలను పెంచు బాధ్యత తల్లిది. ఈ గణవ్యవస్థలో తండ్రి స్పష్టంగా తెలిసినను సంతానమునకు తల్లి పేరు సంక్రమించేది.

మహాభారతమున స్త్రీ పారంపర్య చిహ్నములు కానవచ్చుచున్నవి. దితి యొక్క సంతతిని దైత్యులనియు, కద్రువ (నాగమాత) యొక్క సంతతిని కాద్రవేయులనియు కుంతి యొక్క, సంతతిని కౌంతేయులనియు చెప్పడం స్త్రీ పారంపర్య ప్రభావితమే.

చాణుక్యుడు పరాజయము గావించిన గణమునందు గణము మురయొక్క సంతతివాడు. మౌర్యచంద్రగుప్తుడు మన చారిత్రక పురుషుడు. గౌతమీ పుత్రశాతకర్ణి వసిష్ఠ పుత్రశాతకర్ణి స్త్రీ పారంపర్య ప్రభావితులే.

ఈ గుణవ్యవస్థలో తండ్రి ఆస్తి సంతానమునకు చెందదు. తల్లి ఆస్థియే. సంతానమునకు చెందును. ఈ వ్యవస్థనే చారిత్రకులు మాతృస్వామిక వ్యవస్థ అని పేర్కొనిరి.

ఈ వ్యవస్థలో ప్రకృతి ప్రసాదించిన పదార్థములను సేకరించి భుజించుటచే ప్రకృతి మాతృమూర్తిగా దేవతగా పూజించేవారు. వ్యవసాయము తెలియని స్థితిలో పురుషుడు వేటాడి ఆహారమును సంపాదించేవాడు. స్త్రీలు గృహమందే యుండి సంతానమును కాచుచూ ఇంటి పరిసరాలలో గింజలు కాయలు సంపాదించేది. తరువాత తన నివాసము చుట్టూ విత్తులు చల్లి ఆహారమును యిచ్చే మొక్కలను పెంచేది. స్త్రీ కృషి ద్వారా లభించిన ఆహారముపై ఆధారపడుటచే మాతృస్వామిక వ్యవస్థ బలపడినది.

**నాగరిక దశ :-**

వ్యవసాయోత్పత్తి ప్రారంభించిన తరువాత మానవుడు స్థిర నివాసము ఏర్పరచుకొని గ్రామములు నిర్మించుకొని జీవనాన్ని సాగించెను. నాగలి ఉపయోగించి పొలమును దున్ని పంటలు పండిచే స్థితికి మానవుడు చేరాడు.

మహాభారతములో ప్రమీలార్జునీయము కథ మాతృస్వామిక వ్యవస్థ కలదని రూఢి చేయుచున్నది. నాగలితో పొలము దున్ను ప్రక్రియకు మానవుడు చేరుకున్నాక పురుష ప్రాధాన్యము రూపుదిద్దుకున్నది. వ్యవసాయము ప్రారంభదశలో స్త్రీ ప్రాధాన్యముగా ఉన్ననూ సమాజము వ్యవసాయాభివృద్ధి దశలో పురుష ప్రాధాన్యముతో పితృస్వామిక వ్యవస్థగా మారినది.

ఈ నాగరిక దశలో మానవుడు లోహములను కనిపెట్టి వాటిలో వస్తువులు తయారు చేసుకొని పంటలకనువైన ప్రాంతములలో స్థిరనివాసమున్నాడు. మాతృస్వామిక వ్యవస్థ నుండి పితృస్వామిక వ్యవస్థకు వీరడుగిడినా మాతృస్వామిక ప్రాధాన్యమును రూపుమాపలేక పోయిరి.

ఆర్యులు పశుపాలకులు పితృస్వామిక వ్యవస్థను పొందిన తరువాత వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరించి అటు పిమ్మట వ్యవసాయపు దేవతలను స్త్రీమూర్తులుగా భావించిరి. పురాణములలో ప్రాచీన గ్రంథములలో వ్యవసాయపు దేవతలను స్త్రీ దేవతలుగానే పేర్కొనబడ్డారు. వ్యవసాయ ప్రాముఖ్యత పెరిగి స్త్రీ శక్తి స్వరూపిణిగా మారి వ్రతాలు నోములు స్త్రీ శక్తికి జరిగెడివి. నేలతల్లి, భూదేవి, ఇవన్నీ స్త్రీవాచకాలే. హరప్పా త్రవ్వకాల్లో లభ్యమైన ఫలకముపై ఒక స్త్రీ గర్భము నుండి మొలకలు మొలిచినట్లు ఉన్నది. అంటే స్త్రీ దేవత పంటలు పండటానికి కారణభూతురాలు. అని తేటతెల్లమగుచున్నది.

వ్యవసాయము కనిపెట్టినది స్త్రీలు కనుక దానికి సంబంధించిన పూజలు, వ్రతాలు, నోములు, కర్మకాండలు, మొ॥న వాటి యందు వీరికే ప్రాధాన్యము కలదు.

వర్షాలు పడిన తరువాత పొలాన్ని అదునుకు తీసుకొని వచ్చే వంతు మగవారిది. విత్తులను చల్లుట వరినాట్లు వేయుట కోతకోయుట స్త్రీలవంతు. ఈపై పనులు చేసే ముందు మట్టి గౌరమ్మను పొలమునకు ఈశాన్యముగా ప్రతిష్టించి పసుపు కుంకుమ బెల్లం కొబ్బరి అరటి పండ్లతో పూజించి పై కార్యక్రమాలు అన్నీ ముత్తైదువుల చేత చేయించుదురు. పొట్టమీద యున్న వరిచేలను గర్భిణీ స్త్రీలతో కవులు పోల్చుట చేను ఈనినదని గర్భిణీ స్త్రీకి వాడు పదమువాడుట, పంటలతల్లి అని స్త్రీ పరముగా వాడే ఆచారం మనకు గలదు.

స్త్రీయే వ్యవసాయారంభకురాలగుటచే పంటలకు స్త్రీయే ఆధారమను భావన కలిగెను. ఆమె సృజనాత్మక శక్తి స్వరూపిణి అనుభావం మానవులందు ప్రబలి గ్రామదేవతల ఆవిర్భావమునకు ఆరాధనకు ముఖ్యకారకములైనవి. ప్రాచీన మానవుడు సంచార జీవితమునకు స్వస్తి పలికి గ్రామాలు నిర్మించుకొని మాతృదేవతారాధన గ్రామదేవత ఆరాధనగా రూపకల్పన చేసుకున్నాడు.

భారత దేశమందలి గ్రామీణుల మాతృదేవతా లక్షణాలను కొన్ని పేర్కొనవచ్చును. మాతృదేవత రూపం భయంకరం చతుర్భుజములు, పొడవైన నాలుక, కోరలు కలిగి బలిని గ్రహించి రక్త మాంసముల స్వీకరణ ప్రీతురాలుగా యుండుటచే మానవుడు ఈమెను భయముతో కొలుచుటకు పూనుకున్నాడు. తనను కొలువని మనుష్యులను కష్టాలు పాలు చేయుటలో గొప్ప పట్టుదల కలదిగానూ, పూజించు జనులను వారి గ్రామాలను పరిరక్షించి ఈతి బాధలను గ్రహ భాదలను కలుగకుండా రక్షించి పంట పొలాలను పంటచెరువులను కాపాడేదేవతగా కొలుస్తారు.

వైదిక యుగమందలి ఆర్యదేవతా లక్షణాలకు ఈ మాత్రారాధన లక్షణాలు భిన్నమైనవి. ఇవి జానపదుల జీవితములో స్థిరంగా నిలిచిపోయినవి.

శ్రీసూక్తంలోని శ్రీలక్ష్మి, వేదాల్లోని వాగ్దేవత, మండుకోపనిషత్తు నందలి సప్తమాతృకలు జానపద దేవతలైన పోశమ్మ, పోలేరమ్మ, పెన్నమ్మ మొదలైనవారు ఏకతా సూక్తిని పొంది ఏక సమాహార రూపంగా హైందవ మత విధానంతో శక్తి రూపంగా శ్రీవాణి గిరిజ త్రయంబికాస్వరూప లబ్ధిని పొంది నెలకొనుట జరిగినది.

తొలుత గ్రామదేవతలు, వారి చిహ్నములు ప్రతిమలు, వృక్షములు క్రిందనే నెలకొని యుండెడివి. ఆదిమ మానవుడు ఆరాధన దశలో ఆత్మ వృక్షముల నాశ్రయించుననను నమ్మికతో అని పూజనీయములని భావించెను. ఈ భావన సింధూనాగరికత కాలం నాటికే యున్నదని త్రవ్వకాలవల్ల తెలియుచున్నది. వృక్షముల క్రింద దేవత నెలకొల్పియున్న చిత్రము, ఆమె ముందు మోకాళ్ళపైన వంగి నమస్కారము చేయుచున్న భక్తుని చిత్రము, హరప్పా మొహంజదారోలో లభించిన ఫలకముపై కలదు.

జానపదుల గ్రామదేవతల ఆరాధనకు వైదికమతస్థుల దైవారాధనకు మధ్య అంతరం చాలా ఎక్కువ. వైదికమతంలో పురుష దేవతలకు ప్రాముఖ్యత యివ్వబడినది. స్త్రీ దేవతలను పురుష దేవతల భార్యలుగా మాత్రమే గుర్తించిరి. వైదికమత దేవతలను బ్రాహ్మణులు పూజించుటకు అర్హులు. ఇతర కులస్థులలో నిమ్నజాతులవారు అనర్హులు.

గ్రామదేవతలను తక్కువ కులంగా పిలువబడే మాల, మాదిగ, కుమ్మరి, చాకలి, మంగలి మొ॥వారు పూజిస్తారు. గ్రామదేవతలంటే స్త్రీదేవతలే. దేవతలు నూటొక్కమందిగా ప్రజలు పిలుస్తుంటారు. వారికి తమ్ముడు పోతురాజు సహాయక దేవతగా నిలుస్తాడు. గ్రామదేవతల జాతర ఉత్సవాల్లో కులమత ప్రసక్తి లేక వైషమ్యాలు విడనాడి ప్రజలందరూ పాల్గొందురు. ఈ గ్రామదేవతారాధన ఉత్సవాల్లో నిమ్నజాతుల వారిదే ప్రాధాన్య పాత్ర.

గ్రామదేవతల పేర్లు కొన్ని అర్థవంతము గానూ కొన్ని అర్థరహితముగానూ ఉండును. ఈ పేర్లు పుట్టుక తెలుసుకోవడం కష్టము. ప్రతీపేరు చివర "అమ్మ" పదం వాడబడుతుంది.

ఉదా :- నూకాలమ్మ, మరిడమ్మ, సత్తెమ్మ, గంగపరదేశమ్మ. అమ్మ అను పదములు జానపదుల భక్తి విశ్వాసములను తెలుపుచున్నవి. ఒక ప్రాంతములో ఉన్న గ్రామ దేవత మరొక ప్రాంతంలో ఉండవచ్చును. లేక ఉండకపోవచ్చును. కొన్ని ప్రాంతాలలో అదే పేరుతో కూడా గ్రామదేవతలు ఉండవచ్చును. ఉదాహరణకు అనకాపల్లిలో ప్రసిద్ధి పొందిన నూకాలమ్మ తునిలో గల సూరవరం అనే గ్రామంలో నూకాలమ్మ పేరుతోనే ఉన్నది. అనకాపల్లి మండలంలో నూకాలమ్మ, సత్తెమ్మ, మరిడమ్మ, పోలమాంబ, గంగపరదేశమ్మ, గౌరమ్మ ..... మొదలగు దేవతలు ఉన్నారు.

కొన్ని నగరములు గ్రామాలు, గ్రామదేవతల పేర్లమీద ఏర్పడి ఉన్నాయి. ముత్యాలమ్మ గ్రామదేవత పేరుమీద ముత్యాలమ్మపాలెం అను గ్రామం ఏర్పడినది. ప్రాచీన నగరమయిన బొంబాయి మహారాష్ట్రలోని ఒక దేవత పేరు. ముంబా అయి దేవత, ఆమె పూజలందుకొన్న ప్రాంతము పెరిగి పెద్దదయి బొంబాయిగా మారినది. దీనికి శివసేన పార్టీవారు ఈ నగరాన్ని పూర్వపు పేరుపెట్టి పిలవాలని ఉద్యమం చేపట్టగా చివరికి బొంబాయి ముంబాయిగా మారినది.

## గ్రామ దేవతల ప్రాముఖ్యము - జన జీవనమున వారి ప్రాధాన్యత

ప్రతీ గ్రామంలో ఉన్నటువంటి గ్రామ దేవతలు ఆ గ్రామ ప్రజలను సర్వవిధాల సర్వావస్థల యందు రక్షిస్తూ ఉంటారు. కాని ఎటువంటి పరిస్థితికి లోనయినా ఆ గ్రామ దేవతకు కోపం కలిగినట్లయితే ఆ గ్రామాన్ని అన్ని అరిష్టాలకు గురిచేస్తుంది. వివిధ గ్రామాల్లో ఒకే పేరుతో గ్రామదేవతలున్నా రూపాలు మాత్రం వేరుగా ఉంటాయి. ఆచారాల్లోనూ ఆకారాల్లోనూ కట్టుబాట్లలోనూ గ్రామ గ్రామానికీ తేడా ఉంటుంది. ఎంత తేడా ఉన్నప్పటికీ గ్రామదేవతలందరూ జన జీవితంలో తమ యొక్క ప్రాధాన్యతను చాటుకుంటూనే ఉన్నారు. ప్రదేశాన్ని బట్టి, సంఘాన్ని బట్టి ఆచరించే పద్ధతిలో తేడా ఉన్నా ఆచరించే విషయాల్లోనూ ఆచారాల్లోనూ పోలిక ఉంటుంది. అనేక గ్రామ దేవతల ఆచార నమ్మకాల్లో, వైరుధ్యమున్నా ఆ గ్రామదేవతల పుట్టుక ఉద్దేశ్యము ఒక్కటే కాబట్టి లక్షణాల్లో పోలిక ఉంటుంది.

గ్రామదేవతలను ప్రజలు సాధారణంగా రెండు రకాలుగా పూజిస్తారు. ఒకటి ఆ దేవత గ్రామాల్ని పట్టి పీడించే దేవతగానూ, రెండు ఆ దేవత గ్రామాన్ని రక్షించే దేవతగానూ,

పూజిస్తారు. గ్రామంలో వ్యాపించిన రోగాల్ని నయం చేయటానికి, అంటురోగాలు ప్రబలకుండా వుండటానికి గ్రామదేవతయే కారణమని జనుల నమ్మకము.

గ్రామదేవతల గుడులు ఊరి పొలిమేర్లలో ఉంటాయి. గ్రామదేవత గుడిలోనే ఉండాలనే నియమం లేదు. ఊరి చివర పొలిమేరల్లో ఏ చెట్టుక్రిందనో దేవత ఉండవచ్చును. అయితే జనులలో గ్రామ దేవతలపై నమ్మకం, గ్రామ దేవతారాధన పెరిగి కొందరు గ్రామ దేవతలకు గుడులను కూడా కట్టించుచున్నారు. అలాగే అనకాపల్లిలో ఉన్న సత్తెమ్మకు మొదట గుడి లేదు. చాలాకాలం తరువాత గుడి నిర్మించారు.

గ్రామ దేవతలు ఒక ప్రాంతం నుండి మరియొక ప్రాంతమునకు వలస పోవడం, వలస రావడం జరుగుతుంది. ఒక గ్రామంలో ఉత్సవం సరిగా జరుగలేదనో తన్ను సరిగా పూజించలేదనో కోపంతో గానీ లేక మరొక ఊరును రక్షించాలనే ఉద్దేశ్యంతో గానీ గ్రామ దేవతలు సాధారణంగా ఒక ఊరి నుండి మరియొక ఊరికి వలస రావడం జరుగుతోంది. అనకాపల్లిలో గల గంగపరదేశమ్మ ఆ విధంగానే నీటిలో కొట్టుకొని వచ్చిన వలస దేవత. ప్రతీ గ్రామదేవతకు పూజారులుంటారు. అక్కడక్కడా గణాచారి అనబడే వ్యక్తి ఉంటాడు. ఇతడు దేవతకు ప్రతినిధి. ప్రతి దేవత జంతుబలిని కోరుతుంది. ఆ విధంగా బలి ఇచ్చినట్లయితే దేవత శాంతిస్తుందని లేదంటే నాశనం చేస్తుందని జనుల నమ్మకం. అందుకే ప్రతి గ్రామ దేవతకు జనులు బలిగా కోడినో, మేకనో బలి ఆనవాయితీగా యిస్తుంటారు.

వ్యవసాయ పంటలను, పశువులను రక్షించు దేవతగా, మనుష్యులకు వచ్చు మశూచికం, కలరా, పొంగు వ్యాధుల నుండి కాపాడు దేవతగా గ్రామదేవతలు పూజింపబడతారు. గ్రామాన్ని సమస్త అనర్థాల నుండి కాపాడు శక్తి కలది గ్రామదేవత. ఏ ఊరులో ఉన్న గ్రామదేవత ఆ ఊరిని రక్షించు భారాన్ని పొందుతుంది. ఊరి పొలిమేరలో ఉండి వారిని కాపాడుతూ ఉంటుందని జనుల విశ్వాసము. సృష్టికి మూలం అమ్మ. అందుకే అన్ని గ్రామ దేవతల పేర్ల చివర అమ్మ అను శబ్దం చేరి ఉంటుంది. గ్రామ దేవతలకు ప్రాంతాన్ని బట్టి పూజా విధానం మారవచ్చు. పూజా విధానంలో ఆచారాల్లో ప్రాంతీయతా భేదం ఉంటుంది.

గ్రామ దేవతలకు పూజారులుగా సమాజంలో తక్కువ కులం వాళ్ళుగా చెప్పబడుతున్న చాకలి, మంగలి, కుమ్మరి, మాల, మాదిక, కాపు మొదలైన వారు ఉంటారు. జానపదులు గ్రామదేవతలకు మట్టితో గానీ, లోహముతో గానీ తయారు చేసిన ఘటములు పెడతారు. వాటినే దేవతా రూపాలుగా ఆరాధిస్తారు. ప్రతీ దేవతకు పసుపు కుంకుమ వేపకొమ్మలు ఇష్టమైన వస్తువులు. వీటిని తప్పనిసరిగా జాతరలో ఉపయోగిస్తారు. గ్రామ దేవతారాధన ప్రాచీన కాలంలోనే ప్రారంభమైనప్పటికీ ఆనాడు ఆ దేవతలకు ప్రత్యేకంగా గుడులు అంటూ ఏవీ నిర్మించలేదు. కానీ నాగరికత పెరుగుచున్న కొలదీ గ్రామీణులకు దేవతారాధనలో మార్పు వచ్చి దేవాలయాలు నిర్మించడం ప్రారంభించారు. కొన్ని గ్రామదేవతలకు నిర్దిష్టమైన రూపాలు కూడా కలవు.

మానవుడు నాగరికుడైన కొద్దీ ఒక్కొక్క ప్రాంతంలోని మానవులు ఒక్కొక్క

విధంగా తమ గ్రామదేవతను ఊహించి అవిధంగా రూపాలు ఏర్పరచుకున్నాడు. కొంతమంది గ్రామదేవతలకు పేర్లలో పోలిక ఉన్నప్పటికినీ దేవతలకు రూపంలో పోలిక ఉండదు. ఒకే పేరుతో ఉన్నా భేదం కనబడుతుంది. మొత్తం మీద గ్రామదేవతలందరకు భయంకరాకారమే ఊహింపబడినది. గ్రామదేవతల యెడల ప్రజలకు భక్తి కంటే భయమే ఎక్కువ. గ్రామదేవతలు గ్రామస్థులపై పూని వారికి కావలసిన కోరికలు తీర్చమని అడగటం జరుగుతుంది. జానపదులు ఆ పూనిక వచ్చిన వ్యక్తిని సాక్షాత్తూ దేవతగానే భావించి కాళ్లకు పసుపు కుంకుమలు పూసి, భయ భక్తులు ప్రదర్శిస్తారు.

గ్రామ దేవత ప్రభావం నుండి ఎవరూ తప్పించుకోలేరనే విశ్వాసం. ఈ విశ్వాసం జానపదులలో బలంగా నాటుకొని యున్నది. కాబట్టి గ్రామంలో మంచి జరగాలన్నా చెడు తొలగాలన్నా గ్రామ దేవతయే దిక్కను మాట జానపదుల్లో కలదు. జానపదులు తమను కష్టాల నుండి రక్షించమని గ్రామదేవతకు బలులు, మొక్కుబళ్ళు ఇస్తారు. గ్రామాల్లో గ్రామదేవతలతో పాటు, కుల దేవతలు కూడా పూజనీయులే. గ్రామదేవతలతో పాటూ వీరికి కూడా గ్రామాల్లో ప్రాముఖ్యత ఉంది. గ్రామదేవతలతో సమానంగా వీరికి కూడా ఉత్సవాలు జరుగుతుంటాయి. గ్రామదేవతలు, కులదేవతలు వీరితో పాటు జానపదులచేత పూజింపబడే పేరంటాళ్ళు ఉన్నారు. ఈ పేరంటాళ్ళు సమాజంలో మానవ స్త్రీలుగా పుట్టి మరణానంతరం విశిష్ట లక్షణాలతో జానపదులచే ఆరాధింపబడు చున్నారు. ఈ పేరంటాళ్ళు చాలా వరకు పురాణ పతివ్రతలతో సమానమైన వాళ్ళు. వీరి ప్రాతివ్రత్యం మహిమ చేత మరణానంతరం ప్రజల చేత పూజింపబడుతున్నారు. ఒక జన్మ విషయంలో తప్ప మిగిలిన అన్ని విషయాలలోనూ ఈ పేరంటాళ్ళు మనం తెలుసుకోలేనంతగా గ్రామదేవతల్లో కలిసిపోయారు.

మానవ స్త్రీలు చనిపోయిన తరువాత మహిమను చూపి పేరంటాళ్ళు అయి దేవతలుగా పూజింపబడుతున్నారు. వీరు గ్రామం కోసం త్యాగం చేసిన, పురుషుల అత్యాచారానికి గురైన, భర్తతో పాటు సహగమనం చేసిన, వాళ్లందరూ ఉంటారు. ఈ పేరంటాళ్ళు తమకు కావలసిన వాళ్లకు కనబడి గుళ్ళు కట్టించమని, పూజలు చేయమని ఆదేశిస్తారు. గ్రామ దేవతలు మానవ జన్మను పొందిన సమాజంలో జీవించిన స్త్రీలుగానూ, పేరంటాళ్ళు మాత్రం ఒకప్పుడు సమాజంలోని మానవస్త్రీల వలె జన్మించి మరణానంతరం తమ విశిష్ట లక్షణాల చేత పేరంటాళ్ళుగా మారినారు. గ్రామదేవతలకు ఏవిధంగా బలి మొక్కుబళ్ళు, జాతర్లు ఉత్సవాలు నిర్వహిస్తారో అదే విధంగా ఈ పేరంటాళ్లకు జరుగుతాయి. కానీ పూజా విధానంలో కొన్ని తేడాలు ఉంటాయి. గ్రామ దేవతలకు సంబంధించిన జాతర సమయంలో ఊరినడివీధి ఒక పాకవేసి పొలిమేర గుడిలోని గ్రామదేవతను ఆ పాకలో ఘటం రూపంలో ఉంచుతారు. ఉత్సవ అనంతరం గుడిలో పెడతారు. ఈ విధమైన పద్ధతి పేరంటాళ్లకు లేదు. పేరంటాళ్లను పసుపు కుంకుమలతో పూజిస్తారు. స్త్రీలు అధికముగా పూజిస్తారు. తమ భర్త ఆయురారోగ్యాలు కోసం పేరంటాళ్లను కొలుస్తారు.

కేవలం విశిష్టమైన శక్తి కలదానిగా రక్షకురాలిగా తలచి జానపదులు పేరంటాళ్లను పూజిస్తారు.

# IV) గ్రామదేవతల ఆరాధనా విధానము

## గ్రామ దేవతల ఆరాధనా విధానములు

గ్రామదేవత ఆరాధన మన సంస్కృతిలోఒక భాగం. ఇది అనాదిగా వస్తున్న ఆచారం. గ్రామదేవతలు ద్రావిడ సంస్కృతికి చెందినవి. గ్రామాల్లో జరిగే మంచి చెడులకు గ్రామదేవతయే కారణమను నమ్మకం జానపదుల్లో కలదు. గ్రామదేవతల ఉత్సవాల్లో నిమ్న జాతీయులైన, చాకలి, మంగలి, కుమ్మరి, రెల్లి, కాపు మొదలగు కులములకు చెందిన వారు పూజారులుగా ఉంటారు.

అనకాపల్లిలో నూకాలమ్మ, గంగపరదేశమ్మ, సత్తెమ్మ, పోలమాంబ, మరిడమ్మ మొదలయిన గ్రామ దేవతలు కలరు. ఈ గ్రామ దేవతలకు పూజలు, జరపడానికి చాలా గ్రామాల్లో పూజారులుంటారు. కొన్ని గ్రామాలలో గ్రామ దేవతలకు పూజ చేయుటకు పూజారులు ఉండరు. భక్తులే చేసుకుంటారు. ఈ ఆరాధనకు నిర్దేశ విధానం ఉండదు. జానపదులు గ్రామ దేవతలను మూఢ విశ్వాసంతోనే ఆరాధిస్తారు. తమకు కలిగే వ్యాధులకే గాక పశువులకు వచ్చు వ్యాధులను కూడ రాకుండ గ్రామదేవత రక్షించునని వీరి భావన.

కొన్ని గ్రామాలలో గ్రామ దేవతలకు గుళ్లు ఉండవు. ఏ వేపచెట్టు క్రిందనో దేవతా విగ్రహాలు ఉంటాయి. నాగరికత పెరిగిన కొలదీ జానవదులకు గ్రామదేవతారాధనపై ఆసక్తి పెరిగి దేవతలకు గుడులు నిర్మించారు. అనకాపల్లిలో గల గ్రామదేవతలందరికీ దేవాలయాలు నిర్మించబడ్డాయి.

గ్రామదేవతలు హిందూ దేవతలయిన విష్ణువు, లక్ష్మీ, సీతారాముల కంటే భిన్నులు. హిందూ దేవతల ఆరాధనలో ఆధ్యాత్మిక ధోరణి కనిపిస్తుంది. గ్రామ దేవతల ఆరాధనలో ఈ ధోరణి కనిపించదు. గ్రామ ప్రజలు తమ గ్రామాన్ని సమస్త అనర్థాల నుండి రక్షించు శక్తి స్వరూపిణీ గ్రామ దేవత అని, అందుచేతనే ఆరాధిస్తారు.

గ్రామదేవత లేని గ్రామమంటూ ఎక్కడా ఉండదు. దేవత ప్రీతి కోసం పూజలు జాతరలు, తీర్థాలు ఆ గ్రామ ప్రజలు తమ కనువైన సమయాల్లో జరుపుకుంటారు. గ్రామ దేవతలకు జరిగే ఉత్సవాలు నిత్యమూ జరుగవు. పైగా నిత్య ధూపదీపారాధన నైవేద్యాలు చెల్లించే ఆచారం చాలా చోట్ల లేదు. జానపదులు దేవతలకు చేసే పూజా విధానములు ఆరాధనా పద్ధతులు ఒక్కొక్కసారి చాలా విచిత్రముగా ఉంటాయి.

నరబలి పేరుతో సజీవమైన మనిషిని దేవతకు బలిగా యివ్వడం పరిశీలిస్తే, మానవుని భయంకర తత్త్వం మనకు తెలుస్తుంది. ఈ ఆచారం రాయకుదురు మావుళ్ళమ్మ దేవత పూజా విధానంలో పూర్వం ఉండేదట. బలి పద్ధతిలో తోటి మనిషినో, జంతువునో హింసించుట, దేవతను ప్రసన్నం చేసుకోవటానికి తనను తాను హింసించుకోవటం, అవలంభించాడు మానవుడు. ఈ పద్ధతిలో దేవాలయం చుట్టూ

దొర్లుతూ దండాలు పెట్టడం, నిప్పులు గుండాలు త్రొక్కడం ఇవి పవిత్ర హింసలుగా గ్రామదేవత ప్రీతి కోసం కొన్ని గ్రామ దేవతల ఉత్సవాల్లో ఈ ఆచారం పాటిస్తున్నారు.

గ్రామ దేవతలు మాతృమూర్తులుగా జానపదులచే ఆరాధింపబడుతున్నారు. గ్రామ దేవతల యందు భక్తి కంటే భయం ఎక్కువ. గ్రామ దేవతను ఆరాధించకపోయినా మొక్కిన మొక్కులు తీర్చకపోయినా ఆలస్యం చేసినా దేవతకు కోపం వచ్చి చెడు చేస్తుందనే భయం కొంతమంది గ్రామ ప్రజలలో నేటికీ ఉన్నది. అందుచేత ఎన్ని ఆటంకాలు వచ్చినా అనుకున్న ప్రకారం గ్రామదేవతకు మొక్కులు సకాలంలో తీర్చుకుంటారు. గ్రామాల ప్రజలకు భయం వల్ల ప్రాచీన కాలం నాటి ఆచారాలు నేటికీ విధిగా పాటించుచున్నారు.

**జాతర :-**

జాతర ప్రస్తావన పూర్వ ప్రబంధములందు కన్పట్టుచున్నది. "జాతర సేయగా వలయు సర్వ జనంబుల నంబు రాశికిన్", మహాభారతమున సంబరము గూర్చి ప్రస్తావన కలదు. గోవింద సంబరం సంభావింపు జాతరనే 'పరస' అందురు. పాల్కురికి సోమన శ్రీశైల యాత్రోత్సవపరముగ ప్రయోగించెను. పాండురంగ మహాత్మ్యంలో కూడా "అరిది తన్న గరీపతి జాతర పాటించె పశు విసర మనితర సాధ్యాతర వాతామయ సిద్ధాంతాహతి గాలి గరగల కెల్లన్" అని తెనాలి రామకృష్ణుడు గాలిగంగల జాతర గూర్చి చెప్పెను.

జాతరకు ముందు అమ్మవారిని గుడి నుండి పూరి గుడిసెకు తీసుకువస్తారు. జాతర రోజున పూరి గుడిసెలో వున్న దేవతా స్వరూపాలైన గరగలను ఆసాదులు నెత్తిన ధరించుతారు. అక్కడ నుండి మేళతాళాలతో ఆ ఊరిలో తన పుట్టింటి వారి యింటికి వెళుతుంది. వారు పాన్పువేసి బుక్కాలు చల్లి వడి గట్టులు కట్టి చీర రవిక బియ్యం పసుపు కుంకాలు చెల్లించగా గుడికి వచ్చి, అక్కడ నుండి గ్రామసేవలో ఇంటింట తిరుగుతూ, అరటి పండ్లు, కొబ్బరికాయలు, బియ్యము, పసుపు కుంకుమలు, పసుపు నీరు స్వీకరిస్తూ, తెల్లవార్లూ ఊరేగింపు జరిగిన పిమ్మట దేవత గుడికి చేరును. గుడి దగ్గర ఊరుమ్మడి మేకపోతును మొదట బలి యిస్తారు. పిమ్మట గ్రామ ప్రజలు తమ మొక్కులు వ్యక్తిగతంగా చెల్లించుకుంటారు. ఈ విధంగా అనేక గ్రామాల్లో జరుగుతుంది.

ఈ జాతర్లో విచిత్ర వేషధారణ, అనగా పులివేషాలు, దేవతా వేషాలు, రాజకీయ నాయకుల, సినిమా కళాకారుల వేషాలు, బండ్ల వేషాలు, వీధి నాటకాలు, హరికథ, బుర్రకథ చెప్పట, రోడ్లపై సినిమాలను ప్రదర్శించుట, లలిత సంగీతం మొ॥గు అనేక వినోద కార్యక్రమాలను ఏర్పాటు చేయుటయే కాకుండా అధిక ఖర్చుతో కూడినదైన మందుగుండు సామాగ్రిని కూడా కాల్చుతారు. ఈ విధంగా ఆనందోత్సాహాల మధ్య గ్రామ దేవతల జాతర ఉత్సవం జరుగుతుంది.

**ముడుపు కట్టుట :-**

గ్రామ దేవత ఉత్సవాలకి సంబంధించి ప్రారంభాన్ని తెలియచెప్పే ఆచారమిది.

మొదట ఊరి పెద్దలందరూ కలిసి జాతర చేయటానికి అనువైన రోజు నిర్ణయిస్తారు. ఈ నిర్ణయాన్ని చాటింపు ద్వారా గ్రామ ప్రజలకు తెలియజేస్తారు. ఆ రోజునే క్రొత్త కుండను కుమ్మర్ల దగ్గర నుండి తెచ్చి అందు నవధాన్యాలు వేసి వేపమండలి కట్టి తెల్లని వస్త్రమును గాని, దారాలు గానీ చుట్టి కప్పతారు. ఆ కుండను దేవత గుడి దగ్గర ఉంచుతారు. దీనినే ముడుపు కట్టుట అందురు. సాధారణముగా ఈ ఆచారం మూడు సంవత్సరాల కొకసారి జరిగే గ్రామదేవతల ఉత్సవంలో ముందుగా ప్రజలకు తెలియజేయుటకై జరుపబడును.

కొన్ని గ్రామాల్లో గ్రామదేవతలు ఊరి చివర పొలిమేరల్లో ఉంటారు. జాతర నిర్వహించే రోజుల్లో పూరిపాకకు తీసుకువచ్చి అమ్మవారి ఘటాలను ఉంచుతారు. ఆపాక అమ్మవారి పుట్టిల్లుగానూ, గుడి అత్తవారి ఇల్లు గానూ చెపుతారు. జాతర ముగిసిన తరువాత అమ్మవార్ని గుడికి పంపి పూరిగుడిసె కాల్చి వేస్తారు. జాతర జరుగువరకు పూరిపాక దగ్గర అమ్మ వారికి నిత్య ధూపదీప నైవేద్యాలు జరుగుతాయి. చాకలి, కాపు, కుమ్మర్లు, మంగళ్లలో ఒక్కరు పూజార్లుగా వ్యవహరిస్తారు.

**పరగంగను పంపుట :-**

గ్రామ దేవతను ఊరి నడివీధిలోని పూరిపాకలో ఉంచిన తరువాత పరగంగకు గుర్తుగా కొత్త కుండను అందంగా అలంకరించి గ్రామ దేవత దగ్గర ఉంచుతారు. గ్రామ ప్రజలు తమ గ్రామాల్లో వ్యాపించే వ్యాధులకు పరాయి దేవతయే కారణమని ఆ జానపదులు నమ్మకం. అందుకే తమకు ఎటువంటి కీడు చేయవద్దని తమ గ్రామాన్ని వదలి వెళ్లమని కోరుతూ, ఆ కొత్త కుండను పరాయి దేవతగా పరగంగ పంపుట కార్యక్రమము పూర్తి అగును.

**పొలిమేర కట్టు :-**

పొలిమేర లేక సరిహద్దులందు కట్టు కట్టుటనే పొలిమేర కట్టు అందురు. గ్రామంలోని జాతర సమయంలో పరాయి దేవతలు రాకుండా ఉండటానికి నిర్వహించే ఆచారమే ఈ పొలిమేర కట్టు. గ్రామ దేవతలకు బలిచ్చిన బలిపశువు రాక్తాన్ని అన్నంలో కలిపి దాన్ని బలివేటలో పెట్టి గ్రామ దేవతకు పూజారిగా నున్న కాపు, చాకలి, మంగలి, కుమ్మరి, వీరిలో ఒకరు బలిచేటను పట్టుకొని యుండగా గ్రామ ప్రజలు ఆ చేటను పట్టుకొన్న వ్యక్తి మీదకు పరాయి దేవతలు వాలి ఆ బలి అన్నమును ఎత్తుకు పోకుండా కర్రలతో గుండ్రంగా కొడుతూ రక్షిస్తారు. అలా చేస్తూ ఊరి చుట్టూ 3 సార్లు తిరిగి చేటలోని రక్తాన్నాన్ని పొలిమేర చుట్టూ 3 సార్లు జల్లుతారు.

పొలిమేర కట్టు కట్టుటలో మరొక పద్ధతి కలదు. అది నాలుగు దిక్కుల యందు బలి పసువుగా మేకపోతును, కోళ్లను బలిచ్చి మరికొన్ని చోట్ల కొబ్బరి కాయను కొట్టి నాలుగు సరిహద్దుల యందు నాలుగు గడులు పాతి వాటికి వేపమండలు కడతారు. ఆ బలులు పరాయి దేవతల నైవేద్యముగా సమర్పించి వెనుకకు తిరిగి చూడకుండా

ఊరిలోనికి తిరిగి వస్తారు. అక్కడిచ్చిన బలులు మాల, చాకలి మొదలగు వారు తీసుకుంటారు.

## గుమ్మడి కాయను సాధించుట :-

మనిషి అనాగరిక దశ నుండి నాగరికతను పొందినా పూర్వపు ఆచారాలను సంప్రదాయాల్ని విడిచి పెట్టలేదు. దేవతలకు బలిచ్చు ఆచారంలో మొదటి దశ నరబలి. మానవుడు తన శరీరము భగవంతుడిచ్చిన ఆహారముచేత నిర్మితము కాబట్టి ఆ శరీరాన్ని ఆ దేవతకు అర్పణం అనే భావనచే నరబలిని, దీనికి మారుగా పశుబలి మార్పును పొందినాడు. మనిషి తను యిచ్చే బలివిధానం వల్ల తాను ఆశించే ప్రయోజనంలోను, బలియెడల తనకున్న ఆలోచనల్లోనూ మార్పు పొందలేదు. ఇటీవల కాలంలో అహింసావాదం పెరగడంవల్ల ప్రభుత్వ ఉత్తర్వుల వల్ల జంతు బలులు బహిరంగంగా జరుగుట కొంత తగ్గినది. జంతు బలుల మాటగా కొన్ని ప్రాంతాల్లో ఆచరిస్తున్న విధానం గుమ్మడికాయను పగులుకొట్టుట దీనినే గుమ్మడికాయను సాధించుట అందురు. ముఖ్యముగా దీనిని బ్రాహ్మణులు, కోమట్లు మొదలగు శాఖాహార జాతులకు చెందినవారు ఆచరిస్తున్నారు.

గుమ్మడి కాయకు పైన ఉండే తొడిమను తీసి కాయలోపల గుజ్జును గింజలను తీసి శుభ్రపరచి అందు కుంకుమ, పసుపు కలిపిన నీటితో నింపి తొడిమ భాగపు రంధ్రాన్ని మామూలుగా మూసివేసి, దానికి పసుపు రాసి కుంకుమ బొట్టు పెట్టి అమ్మవారి ముందు పగుల గొడతారు. సర్వసాధారణంగా జంతువుని బలిచ్చినప్పడు రక్తాన్ని చూసి అమ్మవారు సంతోషించినట్లే, ఈ గుమ్మడి కాయను సాధించినప్పడు అందలి నీరు ఎర్రగా ఉండును. కావున అమ్మవారు దానిని రక్తముగా భావించి తృప్తి చెంది ప్రసన్నమౌతుందని వారి నమ్మకం. జంతు బలికి మారుగా ఆచరించే ఆచారం ఈ పద్ధతి.

## నిప్పల గుండం తొక్కుట :-

అమ్మవారి గుడి దగ్గర వెడల్పు గల గొయ్యను తవ్వుతారు. ఒకడు దేవతకు ఎదురుగా కూర్చుని ఒక పాత్రలో కొలత ప్రకారము బియ్యంపోసి ఆ పాత్రకు దాసెనకట్టి దేవత యందు ఉంచుతారు. మరుసటి రోజున చూసి బియ్యం పరిమాణం పెరిగితే అగ్ని గుండం తొక్కటానికి అమ్మ అనుమతించిందని భావించి చెట్టు మానులను తెచ్చి కాల్చి నిప్పకణాలుగా చేసి ఆ గుండమున వేయుదురు. పిమ్మట ఆసాదులు గరగలు నెత్తిన ధరించి నిప్పల గుండంలో నడుస్తారు. తరువాత భక్తులు నడుస్తారు. వారి కాళ్ళు కాలవు. అది అమ్మవారి మహిమ. అగ్ని గుండం చల్లారిన తరువాత బూడిదను ఇళ్ళు, పొలాలలో చల్లుతారు. దాన్ని సంపదగా భావించి ఈ ఆచారం చేస్తారు. ఇది చాలా గ్రామదేవతా రాధనలో ఆచారంగా పాటింపబడుతుంది.

గ్రామ దేవత ఆరాధనా విధానంలో ప్రాంతీయతా భేదం ఉంటుంది. ఎందువల్ల

నంటే ఆ ప్రాంతపు ఆహారపు అలవాట్లు నడవడులు లభించే వస్తు సామాగ్రి మొ॥ వాటిపై ఆధారపడి యుండును.

## మతాతీతమైనట్టిది గ్రామ దేవతారాధన

మన సాహిత్యములో కర్మవీరుల కంటే, జ్ఞానుల కంటే, భక్తుల సంఖ్యయే అధికము. ముఖ్యముగా శైవ, వైష్ణవ సాహిత్యములో నెల్ల భక్తుల కధలే విశేషము. మానవులకే కాక తిర్యక్కులకు సహితము భక్తి మార్గము సులభము. భక్తిచేత భగవంతుడు తొందరగ చిక్కువడుట కలదు. భక్తిచే హనుమంతుడు రాముని పాదములకే బంధమైనాడు. రాముడు శబరి యెంగిలి మ్రింగినాడు. కొమ్మలెగిరే యుడుత ఒక్కటి కోదండ రాముని చేతిలో చేయిగలిపినాడు. రామదాసు భక్తికి ఆ రాముడే ఆసామియైనాడు. ఎలుగెత్తియేడ్చిన ఏనుగునకై విష్ణువు పడతి పైరును బట్టుకొని యాసిరికి జెప్పక, పురికి జెప్పక, ఉత్తకాళ్లను గొట్టుకొనుచు ఉరికి వచ్చెను. పక్షి యొక్కటి రెక్కలెత్తి పట్టి యతనిని దిక్కులెల్లను ద్రిప్పకొని వచ్చెను. తండ్రినేగాదని, తన్నుదలచే పిల్లవాని మాటలో మరొకమారు వేషము జూపెను. పురుగుజచ్చి తుట్టెపురుగు జచ్చి ఏనుగు జచ్చి సిరిగట్టు దొరచే మరల పుట్టుక యుండెడు మంచి మందును దొరకించుకొనెను. అందుకే భగవంతుడు భక్తసులభుడు. జన్మచే శూద్రులైనను వాల్మీకి వ్యాసాదులు ద్రష్టలై, దివ్యర్షులై మానవజాతికే మార్గదర్శకులైనారు. దీనికి వారికి గల అమేయమైన భగవద్భక్తి. అదే విధంగా పల్లె ప్రజలకు కూడా భక్తి మార్గమే శరణ్యమైనది. భాగవతంలో బమ్మెర పోతనామాత్యుడు నవవిధ భక్తి మార్గములు చెప్పినప్పటికీ పల్లీయులు భక్తి పారవశ్యముతో భజనలు, కీర్తనలు, కోలాటములు, జోలపాటలు, లాలి పాటలు, మంగళహారతి పాటలు, మేలుకొలుపు పాటలు వంటివాటి ద్వారా భగవంతుని భక్తితో ఆరాధిస్తారు. ఇవన్నీ కూడా సహజస్ఫోరకమైనవి. కోలాట మేళములు, భజన మండలులు ప్రతి ఊరిలోనూ ఉండును. పర్వ దినములలో ప్రత్యేక సందర్భములలో ఒక వంక భజనలు చేయుట మరొక వంక కోలాటములు వేయుట జరుగుచుండును.

భారతదేశములో నన్నయ్య తరువాత శివకవుల కాలంలో మతమనేది శైవ వైష్ణవ మతాలుగా విడిపోయి శైవ మతానికి ప్రాధాన్యత పెరిగింది. తరువాత తక్కువ కాలంలో శైవ వైష్ణవాలను ఏకం చేసి హరి హరులు ఇద్దరూ ఒకటే అని చెప్పి హరిహరనాథ తత్వాన్ని ప్రవేశపెట్టాడు. కానీ ఆ కాలానికి పూర్తిగా మత భేదాలు సమిసిపోలేదు? అయితే శైవ వైష్ణవాది మత భేదములన్ని యున్నను, పల్లీయులకవన్నీ ఒక్కటే "ఏకం సతే విప్రాబహుధావదంతి" అను వేద సత్యము వారిలో కనిపిస్తుంది. ముఖ్యముగా గ్రామ దేవతారాధన విషయంలో ఈమతభేదాలు అస్సలు పాటించరు. గ్రామ దేవతారాధన మతాతీతమయినట్టిది. నూకాలమ్మ, గౌరమ్మ, మరిడమ్మ, సత్తెమ్మ, పోలమ్మ, ఎల్లమ్మ, ముత్యాలమ్మ, వంటి గ్రామ దేవతలకు కేవలము పల్లీయులు

జీవితముతోనూ తద్వాతావరణముతోను మాత్రమే సంబంధమున్నది. అందువలన వివిధ ప్రాంతాలలో వివిధములైన గ్రామ దేవతలు గన్పట్టుచుందురు. అవి పల్లీయుల భక్తికి ప్రత్యేకమైన రూప కల్పనలు, గ్రామ దేవతలను ఆ గ్రామంలోని స్త్రీ పురుషులు, పిల్లలు, పెద్దలు, అన్ని మతస్థుల వారు భయ భక్తులతో వారి ఆర్థిక స్థోమతకు తగిన విధంగా ఆరాధిస్తారు.

అనకాపల్లి నూకాలమ్మను ఆ గ్రామ ప్రజలే కాకుండా చుట్టు పట్ల ఉన్న గ్రామ ప్రజలు మిక్కిలి భక్తి ప్రపత్తులతో ఆరాధిస్తారు ఈ తల్లిని కేవలం ఒక మతం వారే కాకుండా హిందూ, ముస్లిం, క్రైస్తవ, జైన, బౌద్ధ, మతములకు చెందిన వారు కూడా దర్శించుకుంటారు. మహమ్మద్ రఫీక్ అనే ముస్లిం వ్యక్తి ప్రతి ఆదివారం ఇంటి వద్ద పూజలు చేయకపోయినప్పటికినీ దేవాలయమునకు వెళ్లి అమ్మవారి హిందూ మత గ్రంథాలైన రామాయణ, భారత, భాగవత గ్రంథాలను అవపోసన పట్టినటువంటి గొప్ప వ్యక్తి. అదే విధంగా షేక్‌దరియా అనే వ్యక్తి ముస్లిం వ్యక్తి అయినప్పటికినీ ఒక రోజు జ్వరంతో బాధపడుతుండగా స్నేహితుల ప్రోద్బలం వల్ల అతడు అమ్మవారి దర్శనం చేసుకోగానే అతనికి గల జ్వరం వెంటనే తగ్గిపోయిందట. ఆనాటి నుండి అతడు ప్రతి ఆదివారం అమ్మవారి దేవాలయానికి వెళుతున్నాడు. అంతేకాకుండా అతడు ముస్లిం అయినప్పటికినీ తన స్వగ్రామంలో హిందువుల ఆరాధ్య దైవమయినటువంటి శ్రీరామచంద్రుని దేవాలయం నిర్మించారు. అనకాపల్లిలో కూడ ఎవరైనా దేవాలయం కడుతున్నాం అని చెప్పిన వెంటనే వాళ్ళు అడగకుండానే తనకు తోచినంత ధన సహాయం చేసేటువంటి మతాతీతమైన మహాదాత శ్రీ షేక్ దరియా. ఈ విధంగా అనకాపల్లి నూకాలమ్మను హిందూ, ముస్లిం అనే మత భేదం లేకుండా అందరూ ఆరాధిస్తారు. జైన మతానికి క్రైస్తవ మతానికి చెందిన వారు కూడా దేవాలయానికి వెళ్లి అమ్మవారిని దర్శించుకుంటారు. వారికి పూజా విధానాలు తెలియకపోవటం చేత వారు దేవాలయానికి వచ్చి అమ్మవారిని దర్శనం చేసుకొని ప్రసాదాలు కొనుక్కొని పట్టుకెళతారు. మధ్యలో క్రైస్తవ మతం స్వీకరించినటువంటి ఇతర కులస్థులు అన్ని పూజలు మానివేసినా అమ్మవారికి నైవేద్యం పెట్టడం మాత్రం మానరు. అనకాపల్లి నూకాలమ్మను కేవలం అనకాపల్లి చుట్టుపట్ల గ్రామ ప్రజలే కాకుండా దేశ విదేశాల నుండి కూడ భక్తులు వచ్చి సందర్శించుకుంటారు. ఒకనాడు చైనా, జపాన్‌ల నుండి యాత్రికులు రాగా వారిని ఎందువల్ల వచ్చారని ప్రశ్నించగా భారతీయుల ఆచార వ్యవహారాలు, దైవభక్తి మమ్మల్ని ఆకర్షిస్తుందని, వారి ఆనందానికి కారణమైన దేవతను దర్శించుకోవడానికి వచ్చామని ఆంగ్లంలో చెప్పారని శ్రీ కడలి కళ్యాణ్‌కుమార్ చెప్పారు. ఈ విధంగా అనకాపల్లి నూకాలమ్మను భిన్న మతస్థులు దర్శించుకుని గ్రామదేవతారాధన మతాతీతమయినదని ఋజువు చేశారు.

# నూకాలమ్మ అమ్మవారు



## నూకాలమ్మ పుట్టుక

కలియుగం రాకముందు ఆదిశక్తి 'ఓం' అను శబ్దంతో పుడుతుంది. ఆ తరువాత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పుడతారు. తరువాత కొంతకాలానికి శక్తి ఈ ముగ్గురినీ మ్రింగివేయడానికి ప్రయత్నించగా ఈశ్వరుడు ఆమె నోటిలోనికి శూలం విసిరివేసి తల్లి నువ్వు నూకాలమ్మా, మరిడమ్మా, మాంకాళి మొదలగు రూపాలతో ప్రతి గ్రామంలోని ఉండి అక్కడ నివసించే ప్రజలను కన్న బిడ్డలవలే కంటికి రెప్పలా చూసుకో ' అని చెప్పాడు. మరియు ఈవిధంగా అంటాడు 'నీ పేరు చెప్పి కొందరు బలులు ఇస్తారు. కొందరు పళ్ళు ఫలాలిస్తారు. కొందరు చీరలు, రవికలు పెడతారు. నీ పేరు చెప్పి రకరకాల వంటలు చేస్తారు. కానీ నీకు ఎప్పుడూ అగ్గిమీద గుగ్గిలము, పసుపుకుంకుమలే ఆహారం, నిన్ను సముద్రాలలో వదిలివేస్తారు. నీకు మర్రి, వేప మొదలగు చెట్లే నివాస స్థానాలు" అని చెప్పినాడు.

గ్రామ దేవతలకు గల పేర్లను ఈశ్వరుడే మొదట నిర్ణయించాడు. అనకాపల్లిలో ఉన్న నూకాలమ్మకు నూకలను ప్రసాదించేది. ప్రజల ఆకలిని తీర్చేటటువంటిది అని అర్థాన్ని చెప్పవచ్చును.

ఈ విధంగా పుట్టిన దేవత కాబట్టి నూకాలమ్మ శక్తిస్వరూపిణి అని చెప్పవచ్చు.

నూకాలమ్మ, మరిడమ్మ మొదలగు ఏడుగురు అక్కచెల్లెళ్లు. తమ రక్షణ కొరకు ఒక ెమ్మని ప్రసాదించమని శివుని అడుగుతారు. అప్పుడు శివుడు భూదేవి కంటి నుండి కారిన నీరు దోసిటితో పట్టి తాగమంటాడు. ఆమె ఆ విధంగా చేయగానే చేతిని ఉన్న ఒక్కచుక్క నీరు రాయిపై పడుతుంది. అపుడు అది పగిలి దానిలోంచి పోతురాజు జన్మిస్తాడు. ఆ పోతురాజును నూకాలమ్మ మొదలగు దేవతలకు కాపలా ఉంచుతారు. కొంతకాలమయ్యాక పోతురాజు ఎర్రమ్మను పెళ్లి చేసుకుంటాడు.

నూకాలతల్లి ఒకనాడు ఒక రాజుకి వరమివ్వబోవగా అతడు వరాలేమీ వద్దు నువ్వే కావాలి అంటాడు. అపుడు ఆమె అతడి నుంచి తప్పించుకోవడానికి అనేకరకాలుగా ప్రయత్నిస్తుంది. చివరికి రాజును శపించగా అతడు మరణిస్తాడు. తరువాత నూకాలమ్మ అనేక గ్రామాలకు వెళ్లి చివరకు ఓరుగల్లు తరువాత అనకాపల్లి వచ్చి స్థిరంగా నిలిచిపోయింది. ఆమెను అవహేళన చేసిన వారినందరినీ శపించి రకరకాల బాధలకు గురి చేసింది. నూకాలమ్మ అనకాపల్లిలో వెలసిన తరువాత అనకాపల్లి గ్రామం, పట్టణమై అన్ని రకాలుగా అభివృద్ధిని సాధించినది. సామాన్యులెందరో పురోభివృద్ధి సాధించారు. కొంతమంది కేవలం అనకాపల్లిలోనే కాకుండా దేశంలోనే ప్రముఖ వ్యక్తులుగా కీర్తి పొందేటట్లు ఆశీర్వదించింది. ఆ తల్లి సర్వ జనాళికి శుభాన్ని కలిగించి, కోరిన వరములనిచ్చే కల్పవల్లిగా నూకాలమ్మ పూజలందుకుంటున్నది.

# చల్లని తల్లి అనకాపల్లి నూకాలమ్మ

## కాకతంబికే నూకాంబిక :-

అనకాపల్లిలో గల కొబ్బరి తోటలో నూకాలమ్మ దేవాలయం నిర్మించబడింది. అనకాపల్లి నూకాలమ్మ మొదట 'కాకతంబిక'గా వెలిసింది. క్రీ.శ. 1450వ సం.లోనే కాకతంబిక అమ్మవారి విగ్రహ ప్రతిష్ట జరిగిందని తరువాత కాకతంబికనే నూకాంబిక, నూకాలమ్మ అను పేర్లతో పిలుస్తున్నారని స్థానికులు చెప్పారు.

1450లో ఆర్కాటు నవాబుల సైన్యాధిపతి కాకర్లపూడి అప్పలరాజు ఎంతో నైపుణ్యంతో యుద్ధాలు చేసి విశాఖజిల్లా ప్రాంతాన్ని గెలుచుకున్నాడు. నవాబు దానికి నజరానాగా అప్పలరాజుకే పాయకరావు'అనే బిరుదుతో సత్కరించడమే గాక 'సబ్బవరం' ప్రాంతానికి పాలకుడిగా చేశారు. దానితో ఆయన అనకాపల్లి కేంద్రంగా పాలన ప్రారంభించారు. అనకాపల్లిలో కోటకూడా కట్టారు. కోటకు దక్షిణంగా వారి ఇలవేల్పు కాకతంబికను నెలకొల్పారు. ఉత్తరాంధ్ర భోగలింగేశ్వర స్వామిని కూడ ప్రతిష్ఠించారు. అప్పటి నుండి కాకతమ్మ అమ్మవారు భక్తుల పూజలందుకొంటుంది.

అప్పలరాజు అనంతరం పాలకుడైన జగన్నాధరాజును బ్రిటీష్ వారు ఓడించి పాయకరావు పేటలో ఆయనను ఉరితీశారు. ఆ తరువాత ఈ ప్రాంతానికి విజయనగరం రాజులు పాలకులు అయ్యారు. అంతవరకు కాకతమ్మగా పూజలు అందుకుంటున్న

అమ్మవారి పేరును విజయనగరం రాజులు నూకాంబికగా మార్చారు. నూకాంబిక జానపదుల వ్యవహారంలో నూకాలమ్మగా మారింది. నూకాలమ్మను కేవలం అనకాపల్లిలోనే కాక అనకాపల్లి మండల పరిధిలోగల జగన్నాధపురం, మాకవరం, గ్రామాలలో కూడా ఆరాధిస్తారు.

**ఆలయ శాశ్వత ధర్మకర్తలు :-**

విజయనగర రాజుల అనంతరం బ్రిటీష్ పాలకులు ఒరిస్సాలోని రాయపూర్, రాయఘడ ప్రాంతానికి చెందిన గోడె జగన్నాధరాజును ఈ ప్రాంతానికి సామంతరాజుగా నియమించారు. అయితే ఆయన ఏళ్ల తరబడీ పాయకట్నం' (పన్ను చెల్లించక పోవడంతో ఆంగ్లేయులు ఆ కోటను స్వాధీనం చేసుకున్నారు. అప్పటి నుండి పైడిచర్ల వంశీయులు అమ్మవారి ఆలయానికి శాశ్వత ధర్మకర్తలుగా ఉంటూ వచ్చారు. వీరు కాక ట్రస్టుబోర్డు ఛైర్మన్‌లుగా శ్రీ దాడి భోగలింగం నాయుడు, శ్రీ బుద్దా అప్పారావు నాయుడు, శ్రీ బి.వి.ఎ.ఎస్.నాయుడు, శ్రీ కె.మనోహరరావు నాయుడు, శ్రీ పీలా వెంకట జగ్గారావు మొ॥వారు ఉన్నారు. వీరు కాకుండా దేవస్థాన కార్యనిర్వహణాధికారులుగా శ్రీ బుద్ధ నాగ జగదీశ్వరరావు (ఛైర్మన్) కొణతాల సత్యన్నారాయణ, బొడ్డేడ శంకరరావు, కాండ్రేగుల తాతారావు, మారిశెట్టి రామ ప్రసాదు, కర్రి శివాజీ, సరిసా నాగార్జునరావు, గోవాడ రాజు, శ్రీమతి బీసెట్టి వరలక్ష్మి, కడలి బాబూరావు మొదలైనవారు ఉన్నారు.

**ఉత్సవాలు :-**

నూకాలమ్మ అమ్మవారి ఆలయాన్ని 1953లో దేవాదాయ శాఖ తీసుకొంది. నూకాలమ్మ ఆలయం నిత్యం భక్తులతో అలరారుతూనే ఉంటుంది. అయితే మిగిలిన రోజులకంటే గురువారాల్లోను, ఆదివారాల్లోనూ ఆలయానికి వచ్చే భక్తుల రద్దీ మరీ ఎక్కువగా ఉంటుంది. ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ ఈ మూడు నెలలో భక్తుల సంఖ్య మరీ ఎక్కువగా ఉంటుంది. నూకాలమ్మ అమ్మవారి ఉత్సవాలు కొత్త అమావాస్య నాడు ప్రారంభమై మళ్లీ వచ్చే అమావాస్య అంటే ఛైత్రమాసం అంతా జరుగుతాయి. ప్రస్తుతం ఆలయ ఆసాధి (పూజారి)గా మళ్ల వీర వెంకట నూకరాజు వ్యవహరిస్తున్నారు. ఆయన తాత మల్లా తాతయ్య కూడా ఆసాధిగా వ్యవహరించారు. స్త్రీలు ఎవరూ ఈ దేవాలయంలో పూజారులుగా ఉండరు. పూజారి 'గవర' కులమునకు చెందినవాడై యుంటాడు. బ్రాహ్మణులను గానీ, ఇతర కులస్థులను గానీ ఎట్టి పరిస్థితులలోనూ పూజారులుగా నియమించరు.

**పూజా విధానం :-**

అమ్మవారికి ప్రతిరోజూ పూజా కార్యక్రమాలు నిర్వహిస్తారు. ఉదయం, సాయంత్రం కూడా పూజ చేస్తారు. పూజ చేయునపుడు ప్రత్యేకమైన మంత్రములు ఏమీ ఉండవు. ఉదయం పూట చేయు పూజను 'ఓంకార పూజ' అందురు. పూజ చేయునపుడు

"సర్వరూపే సర్వేసే

సర్వలోక నమస్తుతే

నూకాంబికా నమస్సులు"

"అమ్మల గన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల బెద్దమ్మ సురారులమ్మ కడుపారడి పుచ్చిన యమ్మ దన్నులో నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గమాయమ్మ కృపాబ్ధి యిచ్చుట మహత్వ కవిత్వ పటుత్వసంపదల్"

"చతుర్భుజే చంద్ర కళావతంసే !
కుచోన్నతే! కుంకుమ రాగ శోణే !
పుండ్రేక్షు పాశాంకుశ
పుష్ప బాణ హస్తే ! నమస్తే
జగదేక మాతః
"తల్లివి నిన్ను జేరి పరితాపము
జేసెటి నట్టి దుఃఖముల్
జెలదు విన్న వింపవిన జెల్లదు
బిడ్డల చెడ్డలన్
బిడ్డల పట్ల తల్లులకు
ప్రేమ విశేషము తండ్రి కన్న మా
తల్లి మదీయ పరితాపము మాన్పుము
శ్రీనూకాంబికా రో"

అను పద్యములను చదువుదురు. మరియు ఎవరైతే ప్రత్యేక పూజలు చేయించుకుందురో వారిని "అమ్మవారు కాపాడాలని, సకల శుభములు కలుగ జేయాలని పూజారులు దీవించి పంపుదురు.

## పూజా సమయంలో అమ్మవారి నైవేద్యం :-

అమ్మవారికి ప్రీతికరమయిన వంటకం తెలగపిండితో కలిపి వండిన మునగాకు కూర, అమ్మవారికి నైవేద్యంగా పెడతారు. తరువాత చలిమిడి, వడపప్పు, అరటిపళ్ళు, కొబ్బరికాయు, కల్లు, పంచదార పానకం మొ॥వి. ఇళ్లలో పూజలు చేసుకునేవారు అన్నం పెసర పప్పు, ముద్ద పప్పు, పులుసు, బూర్లు, తెలగపిండి మునగాకు కూర, అట్లు, సరిపెలు మొ॥వి నైవేద్యంగా పెడతారు. పూర్వకాలంలో ఎనుభోతును బలి ఇచ్చేవారని వినికిడి. కానీ ఇప్పుడది లేదు. మాంసాహారులైనచో మేక, కోడి వంటి వాటిని కూడా బలిచ్చి వాటిని వండి అమ్మవారికి నైవేద్యంగా పెట్టేవారు. కానీ ప్రభుత్వం బలి నిషేదాన్ని విధించడం వల్ల ప్రజలు ఆ ఆచారం పాటించ లేదు. అమ్మవారికి నైవేద్యంగా చద్ధన్నం (రాత్రి ఉంచిన అన్నం) ఉల్లిపాయ పెడతారు. చద్దన్నం చలువచేస్తుంది. చల్లని తల్లికి చద్ధన్నం ఇష్టం. దీనినే చల్దుపారం అంటారు.



## నూకాలమ్మ ప్రతిమ

**అమ్మవారి విగ్రహం :-**

చల్లని తల్లికి ప్రస్తుతం ఉన్న అమ్మవారి విగ్రహాన్ని 1969లో ప్రతిష్టించారు. చోడవరానికి చెందిన జి.ఎల్లయ్య అనే శిల్పి ఈ విగ్రహాన్ని రూపొందించారు. ఈ విగ్రహాన్ని 'నవతాళ విగ్రహం' అంటారు. అంటే ఈ విగ్రహాన్ని శిరస్సు నుండి పాదం వరకు 9 భాగాలుగా నిర్మిస్తారు. అమ్మవారి ముఖం కొలత 14 అంగుళాలు. మిగతా 8 భాగాలు కూడా 14 అంగుళాల ప్రమాణంలోనే ఉంటాయి. అంటే మొత్తం విగ్రహం 126 (14 9) అంగుళాలు.

పూర్వం ఆదిలో ప్రతిష్టించిన విగ్రహం శిథిలమైపోగా దాని స్థానే మరో విగ్రహాన్ని నిర్మించారు. అయితే ఆ విగ్రహం ఆగమ శాస్త్రం ప్రకారం కాకుండా అవయవాల పొందికలో క్రమపద్ధతి లేకుండా నిర్మించారని దీనివల్ల ఆ ప్రాంతంలో అరిష్టాలు వచ్చి పంటలు పాడైపోయాయని దానితో 1969లో కొత్త విగ్రహాన్ని నిర్మించారని అమ్మవారిని చాలాకాలంగా సేవించుకొంటున్న శ్రీ సంజీవరావు చెప్పారు. అమ్మవారి కొత్త విగ్రహం

ప్రతిష్ట జరిగిన తరువాత అనకాపల్లి ప్రాంతం సుభిక్షంగా ఉన్నది.

విగ్రహ నిర్మాణంలో జరిగిన ఒక సంఘటన :-

విగ్రహం నిర్మాణంలో జరిగిన ఆసక్తి కరమైన ఒక సంఘటనను పెద్దలు చెపుతారు. విగ్రహం పూర్తిఅయిన తరువాత అమ్మవారికి కనుగుడ్డు పెట్టడానికి శిల్పి యత్నిస్తుండగా మార్కెట్ నుండి ఒక భక్తుడు ఒంటి కాలుతో గెంతుకుంటూ వచ్చి "నల్ల గుడ్డు పెట్టే ముందు శాంతి చేయొద్దుట్రా" అంటూ ఊగిపోతూ శిల్పిని నిలదీశాడట. తను నల్లగుడ్డు పెట్టబోతున్నట్లు ఆ వ్యక్తికి తెలియడం పట్ల శిల్పి ఆశ్చర్యపోయాడు. ఇది అమ్మవారి మహత్యమేనని శిల్పి లెంపలు వేసుకొని తప్పు జరిగిపోయింది క్షమించు తల్లి అని వేడుకున్నాడు. శాంతి చేసిన తరువాత నల్లగుడ్డు పెట్టారట.

అమ్మవారి విగ్రహానికి ప్రతీ సంవత్సరం పండుగ ముందు రంగులు వేస్తారు. అలాచేసిన తరువాత కళ్లకు గంతలు కట్టుకొని నల్లగుడ్డు పెడతారని, అలా రూపొందించడంలో తల్లి ఒక్కొక్కసారి భీకరంగానూ, ఒక్కొక్కసారి ప్రశాంతంగానూ ఉంటుంది.



దీపాలతో అలంకరించిన దేవాలయం

**అలంకారములు :-**

అమ్మవారు భయంకర రూపిణి అయినప్పటికీ ప్రశాంతంగా కనిపించడానికి గులాబీ రంగు చీరను ధరింపచేస్తారు. నాలుగు చేతులకు ఎరుపు రంగు గాజులు ధరించి ఉంటుంది. శిరస్సు వెండి కిరీటము ధరించబడి మెడలో పగడాల హారము కాసులపేరు, నల్లపూసలు, నక్లెస్, కాలికి మట్టెలు, వడ్డాణము ధరించబడి ఉంటుంది. రెండు చేతులలో కుంకుమభరిణి, ఢమరుకం, పట్టుకొని ఉండగా దుష్టశిక్షణ శిష్టరక్షణ నిమిత్తం రెండు చేతులలో కత్తి, త్రిశూలం పట్టుకొని ఉంటుంది.



ఆలయ సమీపంలో వంటలు చేస్తున్న జనులు

**అమ్మవారికి మొక్కుబడులు :-**

నూకాలమ్మను పిలిస్తే పలికే దైవంగా భక్తులు నమ్ముతారు. ఆపదలకు ఆమె అనుగ్రహమే కారణమని, కలిమికి ఆమె కరుణే కారణమని భావిస్తారు. ఆపదలో ఉన్నవారు అమ్మవారికి మొక్కుబడులు ఇస్తానని అమ్మవారికి మొక్కు కుంటారు. ఆపద తొలగిన వెంటనే అమ్మవారికి మొక్కుబడులు చెల్లించు కుంటారు. కనుకనే నూకాలమ్మను ఆపదమొక్కుల తల్లి అంటారు భక్తులు.

అమ్మవారి పండుగ జరిగే కొత్త అమావాస్యకి 15 రోజుల ముందు పౌర్ణమినాడు ఉత్సవానికి నాంది పలుకుతారు. ఆనాటి నుండి ప్రతి రోజు పట్టణంలో రోజుకీ ప్రాంతంలో గరగలు, డప్పులు, డోళ్ళతో ఊరేగింపు జరుపుతూ ఉంటారు. ఈ 15 రోజులు అమ్మవారి పేరుతో పట్టణంలో ప్రతి ఇంటికి వెళ్లి జోగి అడుగుతారు. ఉత్సవం రోజుల్లో భక్తులు అమ్మవారికి మొక్కుబడులు చెల్లించుకుంటారు.

**వంట అక్కడే చేసుకోవాలి :-**

వివిధ ప్రాంతాల నుండి వచ్చిన భక్తులు అమ్మవారిని దర్శించుకొని అక్కడే వంటలు వండుకొని భోజనం చేసి వెళతారు. అది కూడా ఒక మొక్కుబడే. అందుకనే ఉత్సవం రోజుల్లో ఆలయ పరిసరాలలో ఉన్న కొబ్బరి తోటలు భక్తులతో నిండిపోయి ఉంటాయి.

**జాతర :-**

జాతర చేస్తామని మొక్కుకున్న వారు ముందురోజు రాత్రి జాగరణ చేస్తారు.

ఆ రోజు అమ్మవారి పుట్టుకథను వింటారు. జానపద కళాకారులు గానం చేస్తారు. ఇద్దరు డప్పులు వాయిస్తూ వంత పాడుతుండగా మరొకరు అమ్మవారి కథను శ్రావ్యంగా గానం చేస్తారు.

మరునాడు మేళతాళాలు డప్పలతో ఊరేగుతూ దారి పొడుగునా శిరస్నానం చేస్తూ పళ్లాలతో పళ్లు కాయలు చీరలు తీసుకొని వెళ్లి అమ్మవారికి సమర్పించుకుంటారు.



ఆలయములోగల ధర్మసత్రములు



అగ్నిగుండాలు ఉండు స్థలము

### అగ్ని గుండం :-

కొంతమంది భక్తులు అగ్నిగుండం తొక్కుతామని మొక్కుకుంటారు. అమ్మవారి గుడి ముందు రెండు అడుగుల వెడల్పు, ఆరు అడుగుల పొడవు గల గొయ్యి తవ్వి దానిలో మండుతున్న బొగ్గులు వేస్తారు. దీనినే అగ్ని గుండం అంటారు. మొక్కుకున్న భక్తులు ఈ అగ్ని గుండంలో బొగ్గులపై అటూ ఇటూ తిరుగుతారు. దీనికోసం ఆలయం వద్ద గుండాల దిబ్బను నిర్మించారు.

### చీరలపై నడక :-

కొంతమంది ఇంటి నుండి గుడి వరకు చీరలు పరిపించుకొని వాటిపై నడుచుకుంటూ వెళతారు.



అమ్మవారి సంబరం చేస్తున్న భక్తులు



నిప్పల గుండం త్రొక్కుట

### పూనకం :-

కొంతమందికి పూనకం వస్తుంది. అలా అమ్మవారు పూనిన వారు వేపమడలు చేత్తో పట్టుకొని ఇతర భక్తులు కూడా రాగా డప్పల వాయిద్యానికి అనుగుణంగా అడుగులు వేసుకుంటూ గుడికి వెళతారు. ఇలా పూనకంతో గుడికి వెళ్ళేవారినెత్తిపై చల్లని నీళ్లుపోసి శాంతించాలని వేడుకుంటారు. ఇలా దారిపొడుగునా చేస్తారు.

### ఘటాలతో ఊరేగింపు :-

ఆడపిల్లలకు పెళ్లిళ్ళు జరగాలని మొక్కుకున్న భక్తులు పిల్లల పెళ్లి అయిన

సంవత్సరం దాటకుండా అమ్మవారిని దర్శించుకుంటారు. వారు ఘటాలతో ఊరేగుతూ వచ్చి అమ్మని కొలుచుకుంటారు. నెలపండుగ ముందు రోజు మూడు ఘటాలను, పువ్వుల ఘటం పట్టుకుని ఊరంతా తిరిగి అమ్మవారి పసుపు కుంకుమలను పంచుతారు. భక్తులు తమకు తోచినంత బియ్యం, డబ్బు ఇస్తారు.

**తల నీలాలు :-**

తమ కోరికలు తీరిస్తే తలనీలాలు ఇస్తామని కొంతమంది భక్తులు మొక్కుకుంటారు. అటువంటివారు అమ్మవారి ఆలయానికి భక్తితో వచ్చి తలనీలాలు సమర్పించుకొంటారు. ఇలా తలనీలాలు సమర్పించుకొనే వారిలో స్త్రీలు కూడా గణనీయంగా ఉండటం విశేషం. భక్తులు తలనీలాలు సమర్పించుకోవడానికి అన్ని సౌకర్యాలు గల కళ్యాణకట్టను దేవస్థానం వారు ఈ సంవత్సరం నిర్మించారు.

**డప్పు వాయిద్యాలు :-**

నూకాలమ్మ పండుగకు నిండుదనం డప్పు వాయిద్యాలు. అమ్మవారి కథాగానం, నూకాలమ్మను వేడుకుంటే బాధలు గట్టెక్కుతాయని, కోర్కెలు నెరవేరుతాయని భక్తుల నమ్మకం. అందుకే ఈ అనకాపల్లి ప్రాంతంలో ఎవరికి ఏ బాధ కలిగినా, ఏ శుభ కార్యం చేసుకున్నా అమ్మవారికి పండుగ చేసుకుంటామని, మొక్కుకుంటారు. ముఖ్యంగా పెళ్లి అయిన తరువాత పండుగ చేసుకొని నూతన దంపతులతో మొక్కు తీర్చుతారు. దీని కోసం ఇంటి వద్ద ప్రత్యేకంగా పుట్టుక గాధ (కథా గానం) చెప్పించుకుంటారు. దీనిని 1, 13, 15 రోజులు చెపుతారు. వారి వారి ఆర్థిక స్థోమతను బట్టి ఎన్ని రోజులు అనేది ఆధారపడి ఉంటుంది. గతంలో మూడు లేక అయిదు రోజులు పుట్టుక కథ చెప్పించుకున్నా నేడు ఎక్కువ మంది ఒక్క రోజులోనే ముగిస్తున్నారు. దీన్ని కళాబృందాలు గానం చేస్తుంటాయి. బుర్రకథలో మాదిరిగానే ఈ పాటలో ముగ్గురు కళాకారులు ఉంటారు. ప్రధాన గాయకుడు “శరణం మాయమ్మ శరణం” అంటే సహాయకులు గొంతు కలుపుతారు. “జంగో జంగో వారనా” అమ్మవారిని మోద్దామన్న అంటూ కళాబృందాలు పాడేపాట అన్ని తరగతుల వారిని ఆకర్షిస్తాయి. పుట్టు కథ చెప్పే బృందాలు మునగపాక, తుమ్మపాల, హరిపాలెం, కశింకోట ప్రాంతాల్లో ఉన్నాయి. పండుగ చేసుకునే వారు కాని నడకన కోవెలకు చేరుకుంటారు. ముందు డప్పులు, డోలు మోగిస్తుంటే వెనుక భక్తులు నడుస్తారు.

**నూకాలమ్మ మాలధారణ :-**

ఈ ఏడాది నుంచి నూకాలమ్మ మాలధారణ ప్రారంభమయ్యింది. నాలుగు వందల సంవత్సరాల చరిత్ర గల అమ్మవారి దీక్షను 41 మంది భక్తులు 41 రోజులు చేపట్టారు. ఫిబ్రవరి 20వ తేదీన మాలధారణ కార్యక్రమం అమ్మవారి సన్నిధిలో ప్రారంభమయ్యింది.

**దీక్షా విధానం :-**

దీక్ష ముందు బ్రహ్మచర్య పాటించాలి. స్త్రీ పురుషులిరువురూ దీక్ష చేయవచ్చు. మధ్యాహ్నం మాత్రమే భోజనం చేయాలి. రాత్రి పండ్లు, ఫలహారం, పాలు తీసుకోవాలి. రెండు పూటలా చల్లని నీళ్లతో స్నానం చేసి దీపారాధన చేయాలి. శవాలను చూడరాదు. ఒకవేళ ప్రమాదవశాత్తు చూసిన తలస్నానం చేసి శరణం చేయాలి. మత్తు పదార్థాలు, మాంసాహారం చెక్కపొడి, కిళ్లీ వంటివి సేవించరాదు. దీక్షకు లేత గులాబీ రంగు బట్టలు ధరించాలి. క్షవరం గోళ్ళు తీయరాదు. ఎర్రని కుంకుమ, చందనం, అలంకరించుకోవాలి. నిత్యం అమ్మవారిని దర్శనం చేసుకోవాలి. నూకాంబికా అమ్మవారి మాలధారణ దేవాలయ సన్నిధిలో లేదా అర్చకునితో లేదా తల్లితో వేసుకోవాలి. స్త్రీలు 21 లేదా 11 రోజులు దీక్ష చేయాలి. పురుషులు 41 రోజులు నియమం పాటించాలి. అమ్మవారి ఆలయంలో దీక్ష విరమించాలి. నూకాంబికా లేదా శ్రీమాత నామం స్మరించాలి. ఈ మాలధారణ ఇప్పుడిప్పుడే ప్రాచుర్యం పొందుతుంది. అనకాపల్లి ప్రజలు ముఖ్యంగా యువకులు దీని పట్ల ఆకర్షితులవుతున్నారు.

**సర్వాపరాధ రక్షక :-**

పల్లవి : సర్వాపరాధ రక్షక అంబికా
అనాధ రక్షకా నూకమ్మ
చరణం : శరణం శరణం అంబికా
నీపాదమే శరణం నూకాంబికా
తల్లి వంటే నీవమ్మా
మము కరుణించి కాపాడరావమ్మా ॥శరణం॥
ఇరుముడితోనే నూకమ్మ
నీపాద సన్నిధి చేరాను నూకమ్మ ॥శరణం॥
నలుబది దినములు దీక్షతో నూకమ్మ
నేపరవశించి పోయాను నూకాలమ్మ. ॥శరణం॥
కుంకుమాభిషేకం తల్లికే
దూపాభిషేకం తల్లికే
విభూతాభిషేకం తల్లికే. ॥శరణం॥

**కోళ్ళ బలి :-**

కోళ్ళు కోస్తూ మాంసం తయారీ చేస్తూ కొందరు జీవనోపాధి పొందుతుంటారు. జాతరలో లక్షలకు పైగానే కోళ్లు కోస్తారు. కొందరు ఉద్యోగులు కోళ్లు కోసుకోవడం, వాటిని తయారు చేసుకోవడానికి ఇబ్బందులు పడుతుంటారు. ఇటువంటి వారికి సేవ చెయ్యడం కోసం 30 కుటుంబాల వరకూ ఇక్కడ ఉన్నారు. తగరపువలస, కళింగపట్నం, భీమవరం తదితర ప్రాంతాల నుంచి వీరంతా ఇక్కడకు వచ్చి ఈ పనుల్లో

నిమగ్నమైపోతారు. కోడిని మాత్రమే కొయ్యాలంటే కోడిబుర్ర కాళ్లు తీసుకుంటారు. మాంసం తయారు చెయ్యాలంటే 8 నుండి 12 రూపాయలు వసూలు చేస్తారు. జాతరలో 15 వేల కోళ్లు వరకు వీరు తయారు చేస్తుంటారు. గాజువాక, విశాఖ, శ్రీకాకుళం, విజయనగరం, తదితర దూర ప్రాంతాల నుంచి వచ్చే ఉద్యోగులు ఈ విధంగా తయారు చేయించుకొంటారు. కోళ్లు, గొర్రెలు, మేకలను అమ్మవారి గుడిలోకి అనుమతించరు. ఎవరైనా లోపలికి తీసుకువెళితే కొందరు మొక్కుకున్న వారి కోడి తాలూకా గోరు కోసి అమ్మవారి గోపురం పైకి విసిరేస్తారు. మొత్తం మీద ఈ విధంగా అమ్మ వారికి 2000కు పైగా కోళ్ళు 30 వరకు మేకలు వస్తాయి.

## నిషేధం కరపత్రాలకే పరిమితం :-

బలుల్ని నిషేధిస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించినా అవి కేవలం కరపత్రాలకే పరిమిత మవుతున్నాయి. నూకాలమ్మ ఉత్సవం సందర్భంగా ఇక్కడి అమ్మవారి కోవెల సమీపంలో ప్రతీ రోజు వేలాది కోళ్లు, వందలాది మేకలు పీకలు తెగుతూనే ఉంటాయి. జంతు బలులు నిషేదించాలని రెవెన్యూ, పోలీసు, మున్సిపల్, దేవాదాయ శాఖ అధికార్లను కోరుతూ జీవరక్ష సంక్షేమ సంఘ రాష్ట్ర కార్యదర్శి పీలా రామకృష్ణ చేస్తున్న విజ్ఞప్తులు ఫలించడం లేదు. అమ్మవారు జంతు బలులు కోరదని, జంతువులను బలివ్వడం చట్టరీత్యా నేరమని ఆయన అన్నారు. ఆంధ్రప్రదేశ్ 1950 చట్టం ప్రకారం జంతువులను బలి ఇచ్చినా ప్రోత్సహించినా నేరమే. ఇటువంటి వారికి 3 నెలలు జైలుశిక్ష, 300 రూపాయల జరిమానా విధిస్తారని చెప్పారు. అయినప్పటికీ బహిరంగంగా జంతుబలులు కోవెల సమీపంలో జరుగుతున్నా అధికార్లు ఏమీ చేయలేకపోతున్నారు.

## ప్రజలకు ఉపయోగకారి కుండ, కర్ర :-

అనకాపల్లి నూకాలమ్మ రమ్మనది. కుండ, కర్ర చేతికిచ్చి పొమ్మన్నది అనేది సామెత. అయితే అమ్మవారి ఉపదేశం మాత్రం కొత్త కుండలో పెట్టి, వెళ్లిపోయే సమయంలో ఒక కర్రను కొనుక్కొని పోవడం ఆనవాయితీ. ఉత్సవం జరిగినన్ని రోజులు కొత్త కుండలు అమ్మకం జరుగుతాయి. సాధారణంగా కోవెలకు వచ్చే భక్తులలో 90 శాతం ప్రజలు వంట చేసుకొని భోజనాలు చేసి వెళ్లడం ఆనవాయితీ. కుండకు పసుపు, కుంకుమ పెట్టి కొత్త చీరను సున్నంగా చుట్టి దానిపై కుండను ఒక చెట్టు క్రింద పెడతారు. ఆ కుండలో అమ్మవారి ఉపహారంగా బూరెలు, గారెలు వంటివి పెడతారు. వేసవి ప్రారంభం కావడంతో ఈ కొత్త కుండలను మంచినీటికి ఉపయోగిస్తారు. ఈ కుండలో నీరు తాగితే రోగాలు రావనేది నమ్మకం. రైతులు కర్రలు కొనుగోలు చేస్తారు. ప్రతి రైతూ వారి స్థోమతను బట్టి ఒకటి నుండి పది కర్రలు వరకు కొంటారు. కొయ్యలోని చివరి భాగాలు, పలవలను బాణా కర్రగా తయారు చేస్తారు. సైజులను బట్టి ధర ఉంటాయి. విశాఖ ఏజన్సీ ప్రాంతాలైన అరకు, చింతపల్లి, సీలేరు, పాడేరు, హుకుంపేట, డుబ్రిగడల నుంచి వీటిని తెస్తారు. పొలం పనులు ఇంటి అవసరాలకు వీటిని ఉపయోగిస్తారు.

# అమ్మవారిని దర్శించిన అనకాపల్లి ప్రముఖులు



శ్రీ చింతకాయల అయ్యన్నపాత్రుడు, రాష్ట్ర అటవీ శాఖామాత్యులు



శ్రీ దాడి వీరభద్రరావు, ఎమ్.ఎల్.ఎ.

## ఆలయాభివృద్ధికి విశేష కృషి :- (బుద్ధ నాగ జగదీశ్వరరావు)

అనకాపల్లి నూకాలమ్మ గుడి మొదట కొబ్బరితోటల మధ్య చాలా చిన్నదిగ ఉండేది. ఆ తోటల మధ్య నుండి దేవాలయానికి వెళ్లి అమ్మవారిని దర్శించుకోవడానికి ప్రజలు భయపడేవారు. అటువంటి దేవాలయాన్ని అభివృద్ధి చేయడానికి పాలకవర్గం ఎంతో కృషిచేసి ఆ ప్రాంతాన్ని దీపాల వెలుగుతో కాంతివంతం చేయడమే కాకుండ నిత్య యాత్రా స్థలంగా దానిని రూపొందించారు. దేవస్థానం తరపున రెండు బస్సులు నడుపడానికి చర్యలు తీసుకుంటున్నారు. అవి అనకాపల్లి నూకాలమ్మ కోవెల నుంచి సింహాచలం మీదుగా కనక మహాలక్ష్మి (విశాఖపట్నం) గుడికి ఒక బస్సు, అన్నవరం నుంచి నూకాలమ్మ గుడి మీదుగా సింహాచలానికి మరొక బస్సు నడుపుతారు. ఎమ్.ఎల్.ఎ. దాడి వీరభద్రరావు గారి సహకారంతో దేవస్థానాన్ని మరింత అభివృద్ధి చేయడానికి చర్యలు తీసుకుంటున్నారు. 3.5 లక్షల రూపాయలతో శాఖాహారం, 3 లక్షల రూపాయలతో పాలరాతితో పూజా మందిరం నిర్మించారు. దీనిలో కుంకుమ పూజలు జరుగుతాయి. ఇంతవరకు ప్రైవేటు వ్యక్తుల చేతిలో గల పోతురాజు కోవెలను ఈ ఏటి నుండి దేవస్థానం స్వాధీనం చేసుకున్నది. దీనికి లక్ష రూపాయలు వెచ్చించి కోవెల నిర్మాణం చేపడతారు. ఇకపై భక్తుల అమ్మవారి దర్శనం అనంతరం పోతురాజు దర్శనం, తర్వాత పూజామందిరానికి వెళ్లే విధంగా ఏర్పాటు చేస్తారు.

ఆలయంలో ఆరు లక్షల రూపాయలతో ఎనిమిది కాటేజీలను నిర్మిస్తారు. అంతకు పూర్వం గుడి ఉన్న స్థలం మినహా ఒక గజం స్థలం కూడా దేవాలయానికి లేకపోవడం వలన అభివృద్ధి కార్యక్రమాలకు ఇబ్బంది కలిగింది. పది లక్షల రూపాయలతో స్థల సేకరణ చేశారు. అమ్మవారి గర్భగుడిని పాలరాతితో తయారు చేయాలనే సంకల్పంతో ఉన్నారు. అమ్మవారిని దర్శించుకునే భక్తుల సౌకర్యార్థం తోటాడ బైపాస్ రోడ్డు జంక్షన్ వద్ద బస్ షెల్టర్‌ను నిర్మిస్తారు. ఎమ్.ఎల్.ఎ. దాడి వీరభద్రరావు నిధుల నుండి అయిదు లక్షల రూపాయలతో బైపాస్ రోడ్డు నుండి సంత బయలు వరకు సిమ్మెంటు రోడ్డు నిర్మించారు. త్వరలో అక్కడి నుండి భక్తులు సులభంగా అమ్మవారి దేవాలయాన్ని చేరుకొనుటకు సిమెంటు రోడ్డు వేయిస్తారు.

దేవాలయానికి ఎటువంటి స్థిరాస్థులు లేవు. కేవలం దాతల విరాళాలు, భక్తులు ఇచ్చే కానుకలతోనే ఆలయాన్ని అభివృద్ధి చేస్తున్నారు. అనకాపల్లి పట్టణంలో గల కొంతమంది ధనికులు, భక్తులు, దాతలు అమ్మవారి ఆలయ అభివృద్ధికి విశేషంగా సహకరించారు. వారిలో కొణతాల ఆదినారాయణ జ్ఞాపకార్థం వారి కుమారులు కీ॥శే॥ కొణతాల సుబ్రహ్మణ్యం సింహద్వారం నిర్మించారు. కొణతాల లక్ష్మీనారాయణ, కొణతాల రామకృష్ణ, కొణతాల రఘులు, రాజగోపురం నిర్మాణానికి సహకరించారు. కొణతాల మనోహరనాయుడు, బుద్ధ అప్పారావులు కలిసి అమ్మవారి సత్రం నిర్మాణానికి రు. 70,000 లు విలువైన స్థలం బహుకరించారు. మాజీ ట్రస్టుబోర్డు చైర్మన్ కొణతాల మనోహరనాయుడు 20 వేల రూపాయల వెండి కిరీటం బహుకరించారు. శరగడం

నూకరత్నం 5 తులాల వెండి ఆభరణాలు, డా॥ యల్లపు సూరిబాబు, యల్లపు వెంకట రమణ కలిసి 60 తులాల వెండితో త్రిశూలం చేయించారు. మాజీ ఛైర్మన్ పీలా వెంకట జగ్గారావు కళ్యాణకట్ట కాంప్లెక్సు నిర్మాణానికి 75 వేల రూపాయల విలువైన స్థలం ఇచ్చారు. కొణతాల మనోహరనాయుడు, పీలా వెంకట జగ్గారావు, బోడా సుబ్రహ్మణ్య గుప్తాలు కలిసి వి.ఐ.పి. సూట్సు నిర్మించారు. ప్రతి ఏటా పొలమరశెట్టి చిన సన్యాశినాయుడు కొత్త అమావాస్య రోజున పేదలకు అన్న సంతర్పణ చేస్తారు. కాటేజీల నిర్మాణానికి దాడి సూరిబాబు, దాడి వెంకట రమణ బ్రదర్స్ స్థలాన్ని విరాళంగా ఇచ్చారు. పోతురాజు దేవాలయ నిర్మాణం నిమిత్తం అప్పలనాయుడు కుమారులు ధర్మారావు, హరినాథ్, నాగేంద్రరావులు స్థలం ఇచ్చారు. ప్రస్తుతం అమ్మవారి కోవెలకు ఒకవైపు మాత్రమే రహదారి ఉంది. వెనుక వైపునుంచి రహదారి నిర్మించడానికి చర్యలు తీసుకుంటున్నారు. నూతన రోడ్డు నిర్మాణానికి అవసరమయిన స్థలాన్ని దాడి జగన్నాధం ఇవ్వడానికి హామీ ఇచ్చారు. కోవెల ముందు గల ఆక్రమణలను తొలగించామని ఉత్సవ కమిటీ ఛైర్మన్ బుద్ధ నాగజగదీశ్వరరావు తెలిపారు.

**ఆలయాభివృద్ధికి పాలకవర్గం కృషి :-**

అనకాపల్లి నూకాలమ్మకు నాలుగు శతాబ్దాల చరిత్ర ఉన్నా నాలుగు దశాబ్దాల నుంచే ఆలయం అభివృద్ధి చెందింది. గతంలో పూరిపాకలో కోవెల ఉండేది. నేడు ఆ ప్రాంత పరిస్థితులే మారిపోయాయి. పక్కా భవనాలు వెలిశాయి. అందమైన కోవెల, పాలరాతి గచ్చులు తయారు అయినాయి. రంగురంగుల బొమ్మలు చోటు చేసుకున్నాయి. తలనీలాలకు ప్రత్యేకంగా గదులు కట్టారు. భోజనాలు చేయడానికి కాటేజీలు, క్యూ కాంప్లెక్సులు నిర్మించారు. ఇవన్నీ గత కాలంలో పనిచేసిన ఛైర్మన్‌ల కృషేనని చెప్పక తప్పదు. దేవాలయం ఆదాయం కూడా బాగా పెరిగింది. గతంలో 3 లక్షల రూపాయలు ఉండే అమ్మవారి ఆదాయం నేడు 15 లక్షల రూపాయలకు పెరిగింది. దేవస్థానానికి తొలి ఛైర్మన్‌గా దాడి భోగలింగం నాయుడు వ్యవహరించారు. తరువాత 1960 నుండి 1973 వరకు బుద్ధ అప్పారావు నాయుడు, 1984 వరకు బి.వి.ఎ.ఎస్. నాయుడు, 1991 వరకు కొణతాల మనోహరనాయుడు, 1995 వరకు పీలా వెంకట జగ్గారావు, ఆ తర్వాత ఇప్పటి వరకు బుద్ధ, నాగజగదీశ్వరరావులు ఛైర్మన్‌లుగా వ్యవహరించారు. వీరిలో బి.వి.ఎ.నాయుడు దేవాలయ అభివృద్ధికి శ్రీకారం చుట్టగా తర్వాత వచ్చిన మనోహరరావు నాయుడు, పీలా జగ్గారావు, నాగ జగదీశ్వర రావులు ఎన్నో నూతన నిర్మాణాలు చేపట్టారు. ఆలయ అభివృద్ధికి ఎమ్.ఎల్.ఎ. దాడి వీరభద్రరావు ప్రత్యేక శ్రద్ధవహిస్తున్నారు. వంశపారంపర్య ధర్మకర్తలుగా చెముడు ఎస్టేటుకు చెందిన శ్రీమతి రుక్మిణీ దేవి, శ్రీమతి కమలాదేవి వ్యవహరిస్తున్నారు.

# అమ్మవారి మహాత్మ్యాలు

నూకాలమ్మ వారి మహిమలను భక్తులు కథలు కథలుగా చెపుతారు. అమ్మవారి కరుణా కటాక్షాలను గురించిన అనుభవాలను, అనుభూతులను భక్తులు వివిధములుగా వివరించారు.

**దేవాలయ నిర్మాణంలో సహకరించిన అమ్మవారు :-**

పూర్వం కోట శక్తిగా నిల్చిన నూకాలమ్మ నేడు ఉత్తరాంధ్రకు ఆరాధ్యదైవం అయిందని దేవస్థానం మాజీ ఛైర్మన్ జీ.వి..ఎస్.నాయుడు అన్నారు. ఆలయ కమిటీ అధ్యక్షునిగా శ్రీ నాయుడు తన అనుభవాన్ని వివరించారు. అమ్మవారి ఆలయ గర్భ గుడిలోనికి వెళితే ఒక దివ్యానుభూతి కలుగుతుందని, అమ్మవారి కోరిక ప్రకారమే గుడి అభివృద్ధి జరిగిందని ఆయన చెప్పారు.

దీనికి ఉదాహరణగా ఆయన ఒక జరిగిన సంఘటన చెప్పారు.' ఆలయ సింహాదేవుడి' నిర్మిస్తుండగా అమ్మవారి దర్శనానికి వచ్చిన ఒక భక్తురాలు పూనకంలో వచ్చి ఇంకా మూడు గోపురాలు కట్టాలని కోరింది. వెంటనే ఆమెను శాంతింపచేసి ఆ వచ్చినది అమ్మవారే తమకు స్వయంగా చెప్పారని ఆ సంఘటన చూచిన వారంతా ఎంతో ఆనందం పొందారు. ఆ విధంగా మూడు గోపురాలు నిర్మించారు.

ఒక్కొక్కప్పుడు అమ్మవారి విగ్రహం చూసే వారికి ఒళ్ళు జలదరిస్తుందని, అది భయమో, భక్తో తెలియదని అన్నారు. శిల్పి స్వర్గీయ ఎల్లయ్య అమ్మవారి కనుగుడ్డు దిద్దేటప్పుడు ఆలయ తలుపులు మూసివేసి, సాంబ్రాణి ధూపం వేసి కళ్ళకు గంతలు కట్టుకుని కనుగుడ్లు దిద్దేవారని శ్రీ నాయుడు వివరించారు. ఒక్కొక్కప్పుడు అమ్మవారి ముఖంలో రౌద్రాకారం మరొకప్పుడు సౌమ్యం వచ్చేవని అన్నారు. ఇతను ఛైర్మన్‌గా ఉన్న కాలంలో బేడా మండపం, సింహదేవుడి నిర్మాణం చేపట్టారు. ఆలయానికి రహదారిని ఏర్పాటు చేశారు.

**అమ్మవారు వచ్చుట :-**

ఒకసారి విశాఖపట్నం షిప్‌యార్డ్ ప్రాంతంలో మశూచికం (అమ్మవారు) బాగా ప్రబలిందట. అమ్మవారు సాధారణంగా వేసవి కాలంలో వస్తుంది. ఒళ్ళు అంతా వేడిగా అయిపోయి శరీరం అంతటా చిన్న చిన్న కురుపులు వలే పొక్కులు వస్తాయి. వీటిని కుండలు అంటారు. అమ్మవారు సోకిన వాళ్ళు ఆ నాళ్ళలో ఇల్లుదాటి బయటకు వెళ్ళకూడదు. అమ్మవారు సోకిన వ్యక్తిని చాలా జాగ్రత్తగా చూస్తారు. వాళ్లు ఏది కోరితే అది వాళ్లకు ఇస్తారు. ఆ విధంగా వారి కోరికలు తీర్చకపోతే అమ్మవారికి కోపం వస్తుందని భయపడతారు. దీనికి ఇంగ్లీషు మందులు వాడరు. 3 జాలకాలు చేయిస్తారు. జాలకం అనగా అమ్మవారు బాగా తగ్గిన తరువాత ఒంటి నిండా పసుపురాసి లక్ష్మివారం కానీ ఆదివారం నాడు గానీ వేపాకు వేసి మరిగించిన వేడి నీళ్ళతో స్నానం చేయిస్తారు. ఈ

విధంగా మూడు స్నానాలు అయిన తరువాత వాళ్ళకు అమ్మవారు పూర్తిగా తగ్గిపోయినట్లే. తరువాత వాళ్లు నూకాలమ్మ గుడికి వచ్చి అక్కడ పూజలు నిర్వహిస్తారు. దీనినే జాలకం అంటారు.

ఇటువంటి అమ్మవారు ఒకసారి షిప్‌యార్డ్ ప్రాంతంలో వచ్చింది. అప్పడు నూకాలమ్మ అమ్మవారికి మొక్కుకుని ఈ మశూచికం తగ్గిపోతే అమ్మని దర్శించుకుంటామని అక్కడివారు మొక్కుకుని పసుపు చల్లినారట. వెంటనే ఉపశమనం కలిగిందట. పూర్తిగా తగ్గిన తరువాత ఆ ప్రాంతంలోని చాలా మంది అమ్మవారిని దర్శించుకున్నారు. ఈ ప్రాంతంలో ప్రజలు ఏ పని తలపెట్టినా ముందు అమ్మవారిని దర్శించుకుంటారు. తమ కార్యక్రమాలను విజయవంతం చేయమని వేడుకుంటారు. పనులు పూర్తయిన తరువాత అమ్మవారిని దర్శించుకుంటారు. అనకాపల్లికి ఏప్రముఖుడు వచ్చినా అమ్మవారిని దర్శించుకోకుండా వెళ్లరని శ్రీ కొణతాల సంజీవరావు అనే భక్తుడు ఈ విషయం అంతా తెలియచేశారు.

## విగ్రహ నిర్మాణంలో జరిగిన సంఘటన :-

1929లో విగ్రహం తయారు చేసేటప్పడు పొందిన అనుభూతిని చాలామంది వివరించారు.

విగ్రహం పూర్తి కావస్తున్న తరుణంలో రెండు చేతులు మినహా విగ్రహం పూర్తికావస్తున్నపుడు ఒక గురువారం రాత్రి ఒంటి గంటకు కిటికీ ప్రక్కన ఆడ గొంతులు వినిపించుతాయట, "ఇన్నాళ్లకు శక్తి స్వరూపానికి అసలు రూపం కలుగుతోంది చూద్దాం ఎలా చేస్తాడో అని తెల్లని వస్త్రాలు ధరించిన ఆ స్త్రీలు ఆకాశ మార్గంలో వెళ్ళి పోయారట. ఈ దృశ్యం అందరూ చూశామని అక్కడి వారు చెప్పారు.

చాలా సంవత్సరాల క్రితం దేవస్థాన కార్యనిర్వహణాధికారి ఒకరు అమ్మవారి ఉత్సవంలో చనిపోయారట. ఆ అధికారి ఉత్సవ సమయంలో అమ్మవారికి నగలు పెట్టకుండా అ జవహరీని దాచి వేచి జాగ్రత్త కోసం సీలు వేశాడట.

ఆ అధికారి వెళుతూ ఉంటే వెనుక నుండి ఎవరో కొట్టినట్లు అయిందట. వెనక్కి తిరిగి చూసే సరికి ఎవరూ లేరు. ఎవరు అయి ఉంటారా అని అతడు ఆలోచించినాడు. కానీ అతని ఆలోచనకు రాలేదు. సరికదా ఆ దెబ్బతిన్న అనంతరం ఆ అధికారి చనిపోయాడు. అతడు ఆ విధంగా జవహరీలు దాచి ఉంచిన సంగతిని ఎంత రహస్యంగా ఉంచినా జరుగుతున్న సంఘటనలన్నీ చూస్తున్న అమ్మవారు అతనిని ఆ విధంగా శిక్షించినది.

## ఆస్తికుడైన నాస్తికుడు :-

ఆలయంలో జరిగిన ఒక సంఘటనను గురించి శ్రీ నగేష్ అనే భక్తుడు ఈ విధంగా తెలియ జేసారు.

ఒక రోజు సాయంకాలం అర్చకుడు రోజూలాగే అమ్మవారికి పూజచేసి శంఖం పూరించి అనంతరం ఆలయానికి తాళం వేసి వెళ్లిపోయాడు. ఆయన గోపుర ద్వారం వద్ద కూర్చున్న తనకే కాకుండా అక్కడ కూర్చున్న ఇతరులకు కూడా ఆశంఖనాదం వినిపించడంతో అందరూ ఆశ్చర్య పోయామని శ్రీ నగేష్ చెప్పారు. ఆ శంఖానాదం వినేసరికి ఒళ్ళు జలదరించిందని భయంతో అందరం వణికి పోయామని ఆయన తన అనుభూతిని వివరించారు. అమ్మవారి మహిమకు ఆశ్చర్యపోయి భక్తి ప్రపత్తులతో అక్కడ నుండే అమ్మ వారికి వారు సాగిల పడ్డారట.

ఈ సంఘటనకు ముందు తనకు దేవుడు మీదా, ఆధ్యాత్మిక విషయాల మీదా తనకు నమ్మకం ఉండేదికాదని నాస్తికత్వ ఆలోచనలు తనలో ఉండేవని అయితే ఈ సంఘటనలో తనకు అమ్మవారిపై గురి కుదిరిందని ఆ తరువాత అమ్మవారి మహత్యాన్ని తెలిపే అనేక సంఘటనలు విన్నాక, కన్నాక నూకాలమ్మ అమ్మవారిపై భక్తి ప్రపత్తులు ఎక్కువైనాయని తాను ఇప్పుడు దేవస్థానం ఉద్యోగి అయినప్పటికీ కేవలం ఉద్యోగిగా కాక అమ్మవారి మహత్యాన్ని అనుభూతి చెందిన భక్తుడిగా సేవ చేస్తున్నానని యువకుడైన శ్రీ నగేష్ తన్మయత్వంతో చెప్పారు.

## క్రిందకు పడిన అప్పారావు :-

రాత్రి సమయంలో అమ్మవారి ఆలయ సమీపంలో ఎవరూ ఉండకూడదు. ఆవిధంగా అక్కడ ఉంటే అమ్మవారికి కోపం వస్తుంది. అయితే అక్కడికి అప్పారావు అనే వ్యక్తి గుడికి 9 గం.ల సమయంలో వెళుతున్నాడట. అక్కడికి సమీపంలో ఉన్నవాళ్ళు దేవాలయ గుమ్మం వద్దకు వెళ్ళకూడదని చెప్పినా సరే నాస్తికుడయిన అప్పారావు వాళ్ళమాటలు పట్టించుకోకుండా గుడి దగ్గరకు వెళ్ళి అక్కడ అరుగుమీద పడుకున్నాడట. అంతే తెల్లవారే సరికి అతడు క్రింద పడి ఉన్నాడట. అంటే ఆ సమయంలో అతడు అక్కడ పడుకొని ఉన్నందుకు అమ్మవారికి కోపం వచ్చి అతనిని క్రిందికి త్రోసివేసిందట. ఈ సంఘటన జరిగిన వెంటనే అతను తెల్లవారేక క్రిందపడి ఉన్నానని, రాత్రి సమయంలో ఎవరో స్త్రీ నన్ను ఈ విధంగా క్రిందకి త్రోసివేసిందని చెప్పాడు. ఆ స్త్రీ అమ్మవారే అని చెప్పి ఆ నాటి నుండి అతడు తను అంతవరకు అమ్మవారిని నమ్మలేదని, ఎవరినీ నమ్మవద్దనీ ప్రచారం చేశానని ఇకపై అటువంటి దురభిప్రాయాన్ని వదిలిపెట్టి నేను మంచి ప్రవర్తనను కలిగి అమ్మవారి సేవ చేసుకుంటానని చెప్పి ఆనాటి నుండి అతడు అమ్మవారి భక్తుడైనాడు.

## అమ్మవారు నగర సంచారం చేయుట :-

నూకరాజు అనే వ్యక్తి అమ్మవారి నూతన దేవాలయం నిర్మించక పూర్వం జరిగిన సంఘటనను ఈ విధంగా వివరించారు. ఒకనాడు తను ఊరు వెళ్లి తిరిగి వచ్చే సరికి రాత్రి 12 దాటింది. తన యింటికి కొబ్బరి తోటలలో నుంచి అమ్మవారి దేవాలయం దాటి వెళ్లాలి. ఆ సమయంలో జనసంచారం లేదు. అతడు ఉన్న ఊరే కాబట్టి మామూలుగా అటువైపు నడుస్తుండగా అతనికి గజ్జల శబ్దం వినిపించిందట.

ఇదేమిటా అని వెనక్కి తిరిగి చూసే సరికి ఎవరూ కనిపించలేదట. అతడు నూకాలమ్మ భక్తుడు అయినందువల్ల దేవాలయం సమీపానికి వచ్చి అమ్మవారికి నమస్కారం చేసి మళ్ళీ నడవడం ప్రారంభించాడట. అప్పుడు అతనికి చాలా దూరంలో ఉన్నట్లుగా గజ్జెల శబ్దం వినిపించిందట. అప్పడతను ఇంటికి వచ్చి జరిగిన సంఘటన పెద్దలతో చెప్పగా వారు'నీకు వినిపించిన గజ్జెల శబ్దం ఎవరిదో కాదు. మనందరినీ చల్లగా కాపాడేటటువంటి నూకాలమ్మ వారిది. అమ్మవారు ప్రజలను ఎల్లవేళలా కాపాడుతూనే ఉంటుంది. అందుకే రాత్రివేళలందు ఆలయ సమీపంలో గజ్జెల శబ్దం వినిపిస్తుంటుంది. అంటే అమ్మవారు రాత్రివేళలందు నగర సంచారం చేస్తూ ప్రజలను రక్షిస్తుంది. అందుకే ఆ సమయంలో ఆలయం వైపు ఎవరూ వెళ్ళరాదను నియమం ఉంది. నువ్వు అమ్మవారి భక్తుడవు కాబట్టి నీవు క్షేమంగా ఇల్లు చేరగలిగావు. నీవు ఎంతో అదృష్టవంతుడివి అని పెద్దలు చెప్పారట. ఆనాటి నుండి అతడు ప్రతి ఆదివారం కుటుంబ సమేతంగా వచ్చి అమ్మవారి దర్శనం చేసుకుంటున్నాడు.

**నాగుపాము ఆడుకొనుట :-**

స్థానికులు అమ్మవారి చేతిలో గల నాగాభరణ ఢమరుకు ఒక విశిష్టత వున్నదట. రాత్రి సమయంలో ఢమరుకు గల నాగుపాము క్రిందికి వచ్చి ఆడుకుంటుందట. దానిని పరీక్షించుటకు ఒక పద్ధతి కలదు. అది

అమ్మవారి గుడి వెనుక రెండు గమేలాలలో ఇసుక క్రిందపోసి ఉంచి మరునాడు దానిని చూసినట్లయితే దానిపై పాముప్రాకిన ఆనవాలు ఉంటుంది. అంటే పాము అక్కడ ఆడుకుంటుందని తెల్లవారే సరికి యథాస్థానంలోకి వస్తుందని చెపుతున్నారు.

**మొక్కిన మొక్కులు తీర్చకపోతే అమ్మవారు వారిని కష్టాలపాలు చేస్తుంది :-**

అమ్మవారికి ఎవరు అయినా పూజలు చేస్తానని, మొక్కుకుని ఆ విధంగా పూజ చేయుట మానివేసినచో ఆ కుటుంబంపై అమ్మవారు ఆగ్రహించి, వారిని అనేక కష్టములకు గురిచేయును. ఆయింట పిల్లలకు అమ్మవారు పూనుట జరుగును. ఆ విధంగా కాకుండా అనుకున్న ప్రకారం అమ్మవారికి మొక్కి పూజించినట్లయితే ఆ కుటుంబము వారికి సకల శుభములు కలుగజేసి వారిని ఆపదల నుండి కాపాడును. దీనికి జరిగిన సంఘటన వివరిస్తాను.

అనకాపల్లి పట్టణవాసి అయిన నానాజీ అనే వ్యక్తి తన కుమార్తెను ఒకసారి అమ్మవారు సోకగా గుడికి వచ్చి వంటలు వండుకుని అమ్మవారికి చీరపెడతామని మొక్కుకున్నారు. కొన్నాళ్లకు ఆ బాలికకు స్వస్థత చేకూరినది. అయితే అతను తన పనులలో పడి అమ్మవారి మొక్కును తీర్చడం అశ్రద్ధ చేశాడు. ఆ విధంగా కొన్నేళ్లు గడిచాయి. తరువాత ఆమెకు వివాహం నిశ్చయించారు. అన్ని సక్రమంగానే చేస్తున్నాడు. కానీ అమ్మవారి మొక్కును మాత్రం అతడు మరచిపోయాడు. అతని ఆర్థిక స్థోమత

అంతగా బాగోలేకపోయిన ఎక్కడో డబ్బు అప్పగా తెచ్చి అన్నీ సమకూర్చుకున్నాడు కానీ అతడు అమ్మవారి ఆగ్రహానికి గురి అయ్యి వివాహం ఇంకా 5 రోజులు ఉందనగా అతడు మరణించాడు. తరువాత కొంతకాలానికి అతని భార్య జరిగిన సంఘటనకు ఎంత బాధపడిననూ ప్రయోజనం లేదు. అమ్మవారి మొక్కుతీర్చక పోవడం వలన ఈ విధంగా జరిగింది. అమ్మవారికి మా మీద ఆగ్రహం కలిగింది. ఆమెను శాంతింపచేయాలని తెలిసికొని ఒకనాటి ఆదివారం గుడికి వెళ్లి ఉపారం పెట్టింది. ఉపారం అనగా అమ్మవారికి పెట్టే ఆహారం. గుడి దగ్గర గల ఒక చెట్టుకు గుండ్రని ఆకారంలో పసుపు రాసి దానికి పైన కుంకుమతో మూడు గీతల వలె పెడతారు. అంటే అవి మూడు బొట్లు ముగ్గురికి. ఒకటి అమ్మవారికి, ఒకటి పోతురాజుకి, ఒకటి గ్రామ దేవతకు. ఈ విధంగా అమ్మవారి రూపం ఏర్పరచి అన్నం, పప్పు, తెలగపిండి, మునగాకుతో కలిపినకూర, పులుసు, అట్లు, బూరెలు మొ॥వి వండుతారు. మాంసాహారులయితే కోడిని, మేకను గానీ బలి యిచ్చి దానిని కూరగావండి పెడతారు. ఈ వంటకాలుకాక కొబ్బరికాయ, అరటిపళ్ళు, చనిమిడి, వడపప్పు, పంచదార పానకం పెడతారు. కొంతమంది అమ్మవారికి కల్లు ఇష్టమని కల్లుపెడతారు. (మరి కొంతమంది ఈ వంటకాలు ఏమీ చేయకుండా 'చల్దుపారం' పెడతారు. అంటే చద్దన్నం (నిన్న వండి నిలువ ఉంచిన అన్నం) ఉల్లిపాయ నైవేద్యం పెడతారు. అమ్మవారు చల్లని తల్లి అని, చలువ చేయుటకై ఈ విధమయిన చల్దుపారం డతారు. అమ్మవారికి ఎక్కువగా అంటే పాత్రలలో పదార్థం అంతా నైవేద్యంగా పెడతారు. ఇతర దేవతలకు పెట్టినట్లుగా కొంచెం ఆకులలో పెట్టరు. పాత్రలన్ని అమ్మవారి ముందు నైవేద్యంగా స్వీకరించమని పెడతారు. పూజ అయిన తరువాత అమ్మవారికి గుగ్గిలం పొగ ధూపం వేస్తారు. ఇలా గుడి దగ్గర కాకుండా ఇంటి దగ్గర ఉపారం పెట్టిన వాళ్లు స్తరాకులలో అన్నీ వడ్డించి వాటిని చాకలి వానికి ఇచ్చి వేస్తారు. కొంతమంది దేవాలయంలో దొండకాయలు, కర్రలతో చేసిన ఎరుపు రంగు వస్తువులు కుంకుమ బరిణి, ఇస్తామని మొక్కుకుంటారు. మరికొంతమంది చీర పెడతామని మొక్కుకుంటారు. కొత్త చీరను కొని దానిని సుమ్మలాగ గుండ్రంగా చుట్టి దానిపై కొత్త కుండను కొనిపెట్టి దానిలో పళ్ళుపూలు ఉంచుతారు. ఆ కుండకు పసుపురాసి బియ్యపు పిండి కుంకుమబొట్లు పెట్టి దాని చుట్టూరా వేప ఆకులు కడతారు. ఈ విధంగా చీర ఇస్తామని మొక్కుకున్న వారు చీర ఇస్తారు.

ఈ విధంగా నానాజీ భార్య పేదరాలు అగుట వలన ఏదో విధంగా మొక్కు తీర్చాలి అన్న ఉద్దేశ్యంతో తన స్థోమతకు తగిన విధంగా ఉపారం పెట్టి అమ్మవారిని శాంతింపచేసింది. నూకాలమ్మ ఆమెను అనుగ్రహించింది. మొక్కు తీర్చిన రెండు నెలల్లో ఆమె కుమార్తె వివాహం ఆనందోత్సాహాల మధ్య అమ్మవారి అనుగ్రహంతో జరిగింది. ఆ నూతన దంపతులు ప్రతి ఆదివారం, అమ్మవారిని దర్శించుకొని ప్రతియేడాది ఉపారం తప్పని సరిగా పెట్టి అమ్మవారి అనుగ్రహం పొంది ఆనందంగా ఉన్నారు.

**నూకాలమ్మ అప్పారావు కథ :-**

కొన్నేళ్ళ క్రితం అనకాపల్లిలో కాపురం ఉన్న కీ॥శే అప్పారావు చాలా

విద్యావంతుడు. అప్పట్లో ఎం.ఏ. వరకు చదివారు. పెద్దలను గౌరవించేవాడు. చాలా ఉదారుడు. అన్నిట అతడు గొప్పవాడు, యోగ్యుడే కానీ దైవం విషయంలో మాత్రం అందరినీ వ్యతిరేకించేవాడు. దైవాన్ని అస్సలు నమ్మేవాడు కాదు. అతడు చాలా ఆస్తిపరుడే కానీ విధికృతం వల్ల అతడు తాగుడుకు బానిస అయ్యి ఆస్తినంతా పోగొట్టుకున్నాడు. అతను ముగ్గురు కన్యలను వివాహం చేసికొని కాపురం పెట్టాడు. అతని ఆస్తి తరిగి పోయిన తరువాత తాగుడుకు మరింత బానిసై రోడ్లపై తిరిగేవాడు. దేవాలయానికి ఎవరైనా వెళుతున్నట్లు అతనికి కనబడితే తన ఇష్టం వచ్చినట్లుగా తిట్టేవాడు. దేవుడు, దేవాలయం, అన్న పదం ఎక్కడ ఎవరి నోట విన్నా వారు ఎంతటి వారైనా స్త్రీయా, పురుషుడా, చిన్నా, పెద్దా, గొప్ప, పేదా అనే తారతమ్యం లేకుండా నోటికి వచ్చినట్లు తిట్టేవాడు చివరకు ఒకసారి చీకటి పడిన తరువాత నూకాలమ్మ గుడికి వెళ్లి ఆ అమ్మవారి విగ్రహాన్ని త్రవ్వినాడు. వెంటనే ఆకాశంలో పెద్ద మెరుపు మెరిసింది. అది ఆనాటి కాలంలో రెండవఆట సినిమాకు వెళ్లే సమయం. అంటే ఇంచుమించు 10 గంటల ప్రాంతం. ఆ సమయంలో ఆదృశ్యాన్ని తన స్నేహితులతో కలసి కాఫీ తాగుతూ నేను కూడా చూశాను అని శ్రీ కడలి బ్రహ్మేశ్వరం గారు తెలిపారు. ఆ మెరుపు కశింకోట వైపు వెళ్లింది ఆనాటి నుండి అక్కడ కూడా నూకాలమ్మ వెలిసిందని అక్కడ అమ్మవారి దేవాలయం నిర్మించారు.

ఈ సంఘటన జరిగిన మరునాడు ఆ విగ్రహాన్ని త్రవ్విన అప్పారావు అనేక రోగాలకు గురి అయినాడు. అతనిని అమ్మవారు అనేక విధాలుగా శిక్షించినది. అతని భార్యలు అతనిని చీదరించుకున్నారు. పిల్లలు కూడా అతన్ని ఆదరించలేదు. చివరికి అతడు రోగగ్రస్థుడై దుర్భరమైన మరణాన్ని పొందాడు. ఆనాటి నుండి అతని గాథను అనకాపల్లి ప్రజలంతా కథలుకథలుగా చెప్పకున్నారు. అతనిని అప్పారావు అని కాకుండా చాలామంది "నూకాలమ్మ అప్పారావు" అని చెపుతారు.

## అమ్మవారి పాటలు - పద్యాలు

**నూకేశ్వరీ స్తోత్రము :- డా॥ పింజర్ల రామమోహన్‌రావు, రాజమండ్రి**

1. శారదానదీ పరీ వాహక ప్రాంతమున
ప్రమద గణంబులు నిను సేవింప
పార్వతికి ప్రతి రూపమై విలసిన
నూకేశ్వరీ దేవి నీకు వందనంబు.

2. వందనంబు వసుధైక జననీ
జంబూ ద్వీప వాసినీ, జనపదము
తెల్లనీ చల్లని చూపుల నాశీర్వ
దించవే, నూకేశ్వరీ నీకు వందనంబు.

3. త్రికాల దర్శినీ, త్రిశూల పాణీ
మాతృరూపిణీ, త్రిలింగ
వాసినీ, వందే సర్వ దుష్ట భయంకరీ
నమస్తే నూకేశ్వరీ దేవి నీకు వందనంబు.

4. ఇల కనకాపురాధీశురాలవై
అలవోక కనుల జనుల నాదరించు
అనకాపల్లి వాసినీ, సుహాసినీ
సౌందర్యధామినీ నూకేశ్వరీ నీకు వందనంబు.

5. నిత్య నూతన తేజో విలాసినీ
శుభంకరీ, సర్వార్థ కామమోక్ష
ప్రదాయినీ, పరాశక్తి రూపిణీ
పరమేశ్వరీ నీకు వందనంబు.

6. సర్వ మంగళ ప్రదాయినీ
సర్వభూత, ప్రేత, పిశాచ వినాశనీ
విశ్వ కళ్యాణీ ధాత్రీ విజయతే
విశాఖ ప్రాంత పరిపాలినీ నీకు వందనంబు.

7. సర్వసిద్ధి మావాప్నోతి వరదే
మహాపాప వినాశినీ, మానవ
మానస విహారిణీ మదీయ
హృదయ నివాసినీ నూకేశ్వరీ నీకు వందనంబు.

8. రుద్ర, రౌద్రాణి త్రినేత్రి
మాం, భగవతీ మనసా స్మరామి
నూకేశ్వరీ అంగరంగ వైభోగేశ్వరీ
అందుకోనా నమఃస్సుమాంజలులు దేవీ
మాంపాహి, పాహిమాం.

**రచయిత :- ఉచ్చింతల గాంధీ**

సాకి : గణ గణ గణ ఘంటానాదం
తకదిమి తకదిమి తప్పెట తాళం

పల్లవి : అమ్మమ్మ శక్తి వో మాంకాలమ్మ వో

మా ఊరేలేటి నూకాలమ్మవో

కనికరించి మమ్మేలవే (2)

చనివిడి పానకాలు పళ్ళూ పలహారాలు

భక్తులంత నీకు తెచ్చి

ముంగిట నిలిచినారమ్మో ||కనిక||

మా బిడ్డ పాప చల్ల గుండ

మొక్కులిస్తాము

ఊరు వాడచల్ల గుండ

ఊరేగిస్తాము. ||కనిక||

ఏ సిరులు మాకొద్దు నూకాలమ్మ :

నీ చల్లని దయుంటే చాలోయమ్మ :

జగాలన్నీ ఏలే జగన్మాత నీవే :

చూడనీ కళ్ళెందుకు నీ దివ్య సుందర విగ్రహం

పాడనీ గళమెందుకు నీ మధుర కీర్తి స్తోత్రం

చల్లని నీ చూపులే ఈ ఇలకు వెన్నలలు

మాకొక పెన్నిధి నూకాంబిక !

మధురము నీ నామము నూకాంబికా !

మరువక ప్రతి నిత్యము పాడెదము

మా తల్లి అనకాపల్లి నూకాలమ్మ :

నిను చూస్తే పాపాలు చెల్లేనమ్మా !

# పోతురాజు



గ్రామ దేవతలలో కనిపించే ఒక పురుష దేవత "పోతురాజు". ఈ పోతురాజు అనే పదం విజయనగర సాశనాలలో కనిపిస్తుంది.

"బోదువాని సల్లె పోతురాజు రాతికి ఉత్తరాన ... (ఐ.ఎ.పి.ఎస్. 2। సి 6) పోతురాజు రాయి అనే దానివల్ల నిలువుగా పాతిన ఒక రాయి పోతురాజు రూపంగా తెలుస్తుంది. గ్రామదేవత నూకాలమ్మ గ్రామరక్షణ కోసం బయలు దేరినపుడు పోతలింగన్న పొలిమేర కాపలా కాస్తాడు. అంతేకాక ధన, ధాన్య, పశుసంపదలకు రక్షణగా ఉంటాడు. తనకు బలిచ్చే వరకు సంపదలను పొలిమేర దాటనీయడు. గ్రామదేవతలందరు ఈ పోతురాజుకు అక్కలని జానపద గేయాలు చెబుతాయి.

గ్రామ దేవతల రక్షకుడిగా, సోదరుడిగా వివిధ కథల యందు చిత్రింపబడినవాడు పోతురాజు. గానీ ఈతని గురించి ప్రత్యేకమయిన కధలు గానీ, స్థల పురాణములు గానీ ప్రత్యేకముగా ఎక్కడనూ లేవు. గుడులు, సంబరములు జాతరలు ప్రత్యేకముగా జరుపరు గానీ నెల్లూరు జిల్లా యందు, అదిలాబాదు నందు, తూర్పు గోదావరి జిల్లా మారేడుమిల్లి నందు, అనకాపల్లిలో నూకాలమ్మ జాతర జరిపేటప్పుడు పోతురాజు పండుగ చేస్తారు.

పోతురాజుది కొయ్యతో చేయబడిన విగ్రహము గానీ, లేదా 2-3 అడుగుల రాతితో చేసిన విగ్రహముంటుంది. ఈ విగ్రహము ప్రతీ గ్రామదేవత ఆలయమునందును ఉండును. విగ్రహము నందు ఒక చేతితో కత్తి, మరొక చేతితో నిమ్మకాయ ఉంటాయి.

చేతిలో ఉన్న కత్తికి గాజులుండును. పాదముల వద్ద కోడిపుంజు బొమ్మలుండును. కొన్ని ఆలయముల నందు విగ్రహమునకు బదులుగా సన్నటి పొడవైన కర్రను పాతుదురు. అదియే పోతురాజు అందురు. అమ్మవార్ల ఉత్సవము నందు ముందుగా పోతురాజు విగ్రహమే బయలుదేరును.

పోతురాజు గురించి జానపద పురాణముల యందు చిత్ర విచిత్రమయిన కథలున్నవి. పోలేరమ్మ, నూకాలమ్మ, మరిడమ్మ, పోచమ్మ, ఎల్లమ్మ, రేణుక, అంకమ్మ మొదలగు వారి కథలయందు పోతురాజు వారికి సోదరుడుగ, సహాయకునిగ వ్యవహరింపబడుచున్నాడు. మరియొక జానపద పురాణము నందు పార్వతి దేవికి వరుసగా మగసంతానము కొరకు ఆమె పరమేశ్వరుని ప్రార్థించెను. అంత అతడు ప్రసన్నుడై ఆమెకు మగ సంతానము ప్రసాదించెను. అతడే పోతురాజు అని తెలియచేయుచున్నారు. మరొక్క కథ యందు పాండవులు అరణ్య వాసము చేయుచున్నప్పడు తమ కోటలను రక్షించుటకు ఒక మనిషి కావలసి వచ్చెను. అంత నతడు కొండ అంతటి అన్నపురాసిని, తాటి చెట్టంత పోతును కోరెను. పాండవులు అరణ్యవాసము పూర్తి అయిన తరువాత అన్నపురాశిని తాటి చెట్టంత పోతును ఇచ్చిరి. పోతును, రాశిని పొందినవాడు గావున పోతురాజుగ పిలిచిరి.

నెల్లూరు నగరమున ధర్మరాజునకు, ద్రౌపదికిని గుళ్ళు కలవు. ఆ గుడిని పంచములు ఆరాధించెదరు. ఆ గుడి యందు పోతురాజు విగ్రహము కలదు. అనకాపల్లి నూకాలమ్మ దేవాలయములో గల పోతురాజు గుడి క్రిందటి యేడాది వరకు దేవాలయమునకు సంబంధించిన స్థలములో లేకపోయినందు వలన దాని అభివృద్ధి జరుగలేదు. ఇప్పడు ఆ స్థలమునకు నూకాలమ్మ కార్యనిర్వాహక వర్గం స్వాధీనం చేసుకొని పోతురాజు గుడి నిర్మాణము చేపట్టుటకు చర్యలు తీసుకుంటున్నారు.

## VI అనకాపల్లి - ఇతర గ్రామ దేవతలు

1. **గంగపరదేశమ్మ**
2. **సత్తెమ్మ**
3. **పోలమాంబ**
4. **మరిడమ్మ**
5. **దుర్గాలమ్మ**
6. **కుంచావారి వీధి గౌరమ్మ**
7. **వేల్పుల వీధి గౌరమ్మ**
8. **గవరపాలెం గౌరమ్మ.**

# ఇతర గ్రామ దేవతలు

## గంగ పరదేశమ్మ



గంగపరదేశమ్మ పుట్టుకథ జరిగి కొన్ని అంకసర్లు (కొన్ని తరాలు) అయ్యింది. ఒకనాడు పొలిమేర, భీమరశెట్టి, బుద్ధ వంశాలకు చెందిన ముగ్గురు వ్యక్తులు ఎదురుకంచి, పత్తి వ్యాపారాలకై పడమర వైపుకి వెళ్లారు. ఆ రోజు రాత్రి హఠాత్తుగా గాలి, వాన పుట్టు కొచ్చింది. మూడురోజులు ముసురు పట్టింది. దానికి తట్టుకోలేక ఈ ముగ్గురూ పలవల్లోకి పోయి ఒక పెద్ద చెట్టు ఎక్కారు. అది గంగిరేయి చెట్టు. ఆ రాత్రి అంతా దానిపైనే గడిపారు. ఆ వరదలో కొన్ని గ్రామాలు కొట్టుకొని పోయాయి. దానితో పాటూ ఒక చిన్న పెట్టెలాంటిది ఆ వరదలోంచి కొట్టుకొని రావడం వీరి కంటబడింది. వీరు ముగ్గురూ చెట్టుపై నుండే ఆ పెట్టిని కర్రల సహాయంతో దానిని తమ వద్దకు తీసుకున్నారు. అది చాలా బరువుగా ఉందట. వర్షం తగ్గగానే దానిని కావిడి కట్టి ఈ ముగ్గురూ మోసుకొని పొలిమేరశెట్టి వారి ఇంటివద్దకు తీసుకొని వచ్చారు. దానిలో ఏమి ఉందో చూసి దానిని ముగ్గురూ పంచుకుందామని ఒప్పందం చేసుకొని దానిపై చేత్తో తడమగా ఒక వ్యక్తి మూర్ఛపోయాడు. వెంటనే ఆకాశవాణి ఈ విధంగా పలికింది. నేను పరదేశమ్మని గంగలో ఒక యింటి నుండి కొట్టుకుని వచ్చాను. ఇప్పుడు నేను ఎక్కడయితే ఉన్నానో అక్కడ నన్ను ఉంచండి. ఆ యింటిలోనే నన్ను గద్దెకి కట్టెయ్యండి అని చెప్పినది. అది పొలిమేర వాళ్ల ఇల్లు అవ్వడం వల్ల సంవత్సరం అంతా వాళ్లే పూజలు

చేస్తారు. అయితే ఒప్పందం ప్రకారం దొరికిన వస్తువును ముగ్గురూ పంచుకోవాలి కాబట్టి మూడువంశాల వాళ్ళు జాతరను ఘనంగా చేస్తారు. పరదేశమ్మ దేవాలయాన్ని భీమరశెట్టి, బుద్ధ వంశీయులు కట్టించారు.

అనకాపల్లి చినరామస్వామి కోవెల వద్ద భీమరశెట్టి వారు దేవాలయం కట్టించారు. జాతరలో భీమరశెట్టి, పొలిమేర శెట్టి వాళ్ళు కలసి పండుగ 20 రోజులు చేస్తారు. ఇది పోలాల అమావాస్య మరునాడు ప్రారంభమవుతుంది. అనగా భాద్రపద మాసంలో శుద్ధపాడ్యమినాడు ప్రారంభమవుతుంది. ఆ రోజు పొలిమేర శెట్టివాళ్ళు ఊరేగింపుతో భీమరశెట్టి వాళ్ల ఇంటికి సంబరం తెమ్మని చాటింపు వేస్తారు. అమావాస్య మరునాడు చినరామస్వామి గుడి దగ్గర గల గంగపరదేశమ్మ గుడిలో ఉన్న పుట్ట ఒక చోట మెరుస్తుంది. ఆ మెరిసిన భాగం మట్టిని తీసి ఈ పొలిమేర వాళ్లు కట్టిన దేవాలయానికి తీసుకువస్తారు. ఈ మట్టినే పుట్టక్కు (పుట్ట బంగారం) అంటారు. అలా తీసుకొని రావడాన్నే పుట్టక తేవడం అంటారు. ఆ పుట్టక తీసుకువచ్చేటపుడు భజనతో ఊరంతా ఊరేగి వచ్చి తిరిగి రెండు గంటలకు ఇక్కడకు వస్తుంది. అపుడు మడప (ఉపారం)గా అన్నం పప్పు, కూర, పులుసు, సరిపెల, బూర్లు అట్లు మొదలయిన వాటితో మూడు అరిటాకులు వేసి మూలన (దేవుడి మూల ఆగరిస్తారు) నైవేద్యం పెడతారు. గుమ్మం దగ్గరకు అందరూ వెళ్లి మూకుళ్ళతో అగ్ని తెచ్చి గుగ్గిలం ధూపం వేస్తారు. ముత్తైదువులు ఒక చెక్క భరిణలో పూజచేసిన పూవులు వేసి వస్తారు. వాటిని ఎవరూ చూడకూడదు. ముగ్గురు స్త్రీలు దగ్గరగా కూర్చుని ఎవరికీ కనబడకుండా వారిపై వస్త్రం కప్పుకొని దానిలో తెచ్చిన పూలు అక్కడ ఉన్న భరిణలో వేస్తారు. తరువాత 3 కొత్త కుండలను (పత్తేలు) కొని తెచ్చి వాటికి పసుపురాసి, వరిపిండి, కుంకం బొట్లు పెట్టి దాని చుట్టూరా తులసి ఆకులు దండ కడతారు. సాధారణంగా గ్రామదేవతలకు వేపకొమ్మలు కడతారు. కానీ ఈ తల్లి చల్లని తల్లి అని చెప్పి తులసి కొమ్మలు కడతారు. వడ్రంగి వాళ్లను తీసుకొని వచ్చి దండకం చేస్తారు. (దండకం అనగా అమ్మ నీవు వీధులకు వెళ్లి కోరికలు కోరుకో అవి తీరుస్తాము అని చెప్పి హారతి ఇస్తారు) ఈ కుండలపై భరిణలు ఉంచి దానిపై ప్రమిదల దీపం పెట్టి 15 రోజులు పూజలు చేస్తారు.

సంబరం రోజు రాత్రి పెరుగు, క్రొత్త బియ్యం వేసి కిచ్చినం వండుతారు. బ్యాండు, టోకోలి, చిటికెలు, గొల్లభజన, పులివేషం, విచిత్ర వేషాలు మొ॥వి అన్నింటితో ఘటాలు ఊరేగింపుగా ఊరంతా తిరిగి అగ్గి మర్రిచెట్టు దగ్గరకు వెళతారు. అక్కడ బుద్ధ వంశానికి చెందిన వారు బాణా కర్రలతో (అనగా ఏర్లు పొలం దున్నేటు వంటి కర్ర) కట్టి వాళ్ళు లాగుతారు. ఏర్లు దున్ని ఈ విధంగా పాట పాడుతారు.

"పరమటికి గజ్జెల్లి తూరుపుకి దున్ని
తూరుపుకి గజ్జెల్లి పరమటికి దున్ని
ఆ చిన్న చిన్న మేఘాల చిన్నన్నలాల
పెద్ద పెద్ద మేఘాలు పెద్దన్నలాల
ఏరు బూసినాడు ఎటెల్లి నాడు
ఈనాడు ఈ మొక్క మేము జల్లాము

ఈనాడు మానేసి మరునాడు పొద్దు
మొలిసింది లేదని మేమొచ్చినాము
గజ్జెల్ని ఆ మొక్కపై కొచ్చినాది
మూన్నాల కామొక్క ముదిమొసముతోడై"

అని పాట పాడి విత్తనాలు చల్లుతారు. ఆడవాళ్ళు పొలంలో మాదిరిగా దేవుడి మూల ముందుగ వారు వండి ఉంచిన కిచిడీ (పెరుగన్నం) వాళ్ల చేతుల్లో ఒక్కో ముద్ద పెట్టగా దాన్ని వాళ్ళు తింటారు. ఆ విధంగా వాళ్లు అగ్గిమర్రి చెట్టు చుట్టూరా తిరుగుతారు. అది అయిపోగానే సంబరం తిరిగి ఇంటికి వస్తుంది. మరునాడు మంగళవారం బూర్లు వండి, కోళ్ళు కోసి చుట్టాలందరినీ పిలిచి భోజనం పెడతారు. ఆ మూడు ఘటాల్లో రెండు ఘటాలను వడ్రంగి వాళ్ళు తీసుకొని పోతారు. ఒక ఘటాన్ని దేవుడి మూల ఉంచి దానికి మంగళవారం నుండీ మళ్లీ మంగళవారం వరకు 8 రోజులు ఉపారంతో పూజ చేస్తారు. మంగళవారం నాడు 3 ఇత్తడి ముంతలకు పసుపురాసి వాటిని దారాలతో కట్టి వుంచుతారు. మరలా అందరినీ ఇళ్లకు ఆహ్వానించి బూర్లు, పులిహోర మొ. పిండివంటలతో భోజనాలు పెడతారు. ఆ నాటితో ఆ సంబరం ముగిసినట్లుగా భావిస్తారు.

# సత్తెమ్మ



ఈ దేవత నూకాలమ్మ చెల్లెళ్ళలో ఒక చెల్లిగా గ్రామ దేవతగా పూజలందు కొంటున్నది. అనకాపల్లిలో సుంకరమెట్ట వద్ద గల దాసరిగెడ్డ రోడ్డులో ఒక మదుం ఉండేది. ఆ మదుంకింద ఈ సత్తెమ్మ తల్లి వెలిసింది. అప్పటిలో ఆ రోడ్డు సమీపంలో గల ఒక యింటిలో ఉన్న ఒక వృద్ధురాలికి కలలో కనిపించి నేను ఇక్కడ గల మదుం క్రింద ఉన్నాను. నన్ను అక్కడ నుండి తీసుకువచ్చి దేవాలయం నిర్మించండి. అని సత్తెమ్మతల్లి చెప్పిందట. మరునాడు ఉదయముననే ఆమె లేచి అక్కడ గల పెద్దలందరితో జరిగిన

సంఘటన చెప్పగా వారందరూ మదుం క్రింద చూడగా ఆ విధంగా అమ్మవారి రాతి విగ్రహం అక్కడ ఉందట. దానిని పైకి తీసి ఇప్పుడు దేవాలయం ఉన్న ప్రదేశంలో పెట్టారు. చాలాకాలం ఆ తల్లి గుడి లేకుండానే ఉంది. అయితే కొంతమంది వ్యక్తులు కలుగ చేసుకొని దేవాలయం నిర్మించడానికి చర్యలు చేపట్టారు. ఈ ఆలయ నిర్మాణానికి 27-12-1991 సం.లో శంకుస్థాపన చేశారు. ఆ తరువాత 3-8-1992 సం.లో ఆలయం నిర్మించినారు. ఇప్పటికీ ఈ దేవాలయాన్ని అభివృద్ధి చేస్తూనే ఉన్నారు. దాసరి గెడ్డ రోడ్డులో గల దేవాలయానికి సులభంగా వెళ్ళి అమ్మవారిని దర్శించుకోవడానికి వీలుగా సిమ్మెంటు రోడ్డు వేయించారు. ఆలయ సింహద్వారాన్ని నిర్మిస్తున్నారు. ఈ ఆలయానికి శంకుస్థాపన జరిగిన తేదీన ప్రతి సంవత్సరం ఘనంగా ఉత్సవాన్ని నిర్వహిస్తారు. ఈ గ్రామదేవతకు ప్రతి బుధవారం పూజలు జరిపిస్తారు. ఉదయం సాధారణ పూజలు జరిపిస్తారు. అనగా అరటిపండ్లు, కొబ్బరికాయ, పూలతో పూజచేసి, అమ్మవారికి హారతి ఇస్తారు. సాయంత్రం పూజలో అమ్మవారికి ఉపారం పెడతారు. అనగా అన్నం, పప్పు, పులుసు, అట్లు, బూరెలు, బోడిపిండి, సరిపెలు, తెలగపిండి మునగాకు కూర మొదలయిన వాటితో అమ్మవారికి నైవేద్యం పెడతారు. అమ్మవారు చల్లని తల్లి. ఆమెను నమ్మిన వారందరికీ కోరిన కోరికలు తీర్చుతుంది. ప్రతి బుధవారం రాత్రి తొమ్మిది లేక పదిగంటల వరకు అమ్మవారికి భజనలు చేస్తూ భక్తి గీతాలాపన చేస్తారు. దేవాలయ స్థాపన రోజుకూడా చాలా ఘనంగా సత్తెమ్మ సంబరాన్ని జరుపుతారు. ప్రతి సంవత్సరం ఆగష్టు రెండు, మూడు తారీఖులలో చేస్తారు. ఆనాడు హరికథలు, బుర్రకథలు, చెప్పించుట, నాటకాలు, సినిమాలు ప్రదర్శించుట అర్కెస్ట్రా మొదలగు సాంస్కృతిక కార్యక్రమాలతో ఘనంగా సంబరాన్ని జరిపిస్తారు.

## పోలమాంబ



ఈ పోలమాంబ దేవాలయం అనకాపల్లి బస్ కాంప్లెక్సు సమీపంలో కలదు. ఈ దేవతను రెల్లి కులస్థులు పూజిస్తారు. ఈ దేవత కొన్నేళ్ళ క్రితం ఇక్కడ వెలిసింది. అప్పట్లో ఈ పోలమాంబకు దేవాలయం నిర్మించబడలేదు. ఆ తరువాత కాలంలో రెల్లికులస్థులు అంతా కలసి చందాలు వసూలు చేసి దేవాలయం నిర్మించినారు. ఆలయ ధర్మకర్తగా సంవత్సరానికి ఒక్కొక్కరు ఉంటారు. ప్రతి సంవత్సరం మారుతుంటారు. ఈ సంవత్సరం ఆలయ ధర్మకర్తగా నూకరాజు వ్యవహరిస్తున్నారు.

పోలమాంబకు ఫిబ్రవరి మొదటి వారంలో సంబరం చేస్తారు. ముందుగ అమ్మవారి ఆలయాన్ని రంగులతో అలంకరించి వేపతోరణాలు కడతారు. ఆనాడు అనేక మంది భక్తులు అమ్మవారిని దర్శించి తమ మొక్కులు తీర్చుకుంటారు. అమ్మవారికి నైవేద్యంగా ఉపారం పెడతారు. ఉపారం అనగా అన్నం, పప్పు, పులుసు, బూరెలు, గారెలు మొదలగునవి. పోలమాంబకు చీర, జాకెట్టు పెడతానని మొక్కుకున్నవారు ఆ రోజు ఇంటిలో పోలమాంబకు ఉపారం పెట్టి సాయంత్రం దేవాలయానికి వచ్చి చీరను అమ్మవారికి ఇచ్చివేస్తారు. ఆ రోజు రాత్రి సంబరాన్ని ఘనంగా నిర్వహిస్తారు. వివిధ రకాల సినిమాలు, బుర్రకథలు, హరికథలు చెప్పట, ఆర్కెస్ట్రా మొ॥ వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు.

**పోలమాంబ మహత్తు :-**

వీరబ్రహ్మం అనే యువకుడు ఆరోజు జరిగే పోలమాంబ సంబరం చూడడానికని ప్రక్కనున్న గ్రామం నుంచి తన స్నేహితులు కొందరితో బయలుదేరాడు. అయితే వాళ్ళ దగ్గర ఉన్న డబ్బును వీరబ్రహ్మందగ్గరే ఉంచమని ఇచ్చారు. అందరూ పోలమాంబ దర్శనం చేసుకొని రాత్రి ఏర్పాటు చేసిన వినోద కార్యక్రమాలు అన్నీ చూస్తూ ఎంతో ఆనందంగా గడిపారు. అయితే అంతా అయిపోయిన తరువాత వీరబ్రహ్మం జేబులో డబ్బు కనబడలేదు. అతడు చాలా భయపడ్డాడు. స్నేహితులకు ఏమి సమాధానం చెప్పాలో తెలియక చాలా బాధపడిమళ్ళీ పోలమాంబ దర్శనం చేసుకుని "తల్లీ ఈ ఆపద నుండి నువ్వే నన్ను కాపాడాలి" అని ఆ దేవతను వేడుకుని స్నేహితుల వద్దకు వెళ్ళాడు. ఇంతలో ఒక బంగారు బరిణ వంటి బాలిక వచ్చి "ఏవండీ మీడబ్బు" అని చేతిలో పెట్టింది. వెంటనే వీరబ్రహ్మం కళ్ళు నీళ్ళతో నిండాయి. ఆ ధనం అందుకొని కళ్ళు తుడుచుకునే సరికి ఆ పాప కనిపించలేదు. అప్పుడు తన స్నేహితులందరూ ఏమైంది? విషయం ఏమిటి అని అడుగగా జరిగిన సంగతి అంతా వీరభద్రం తన స్నేహితులకు చెప్పాడు. వాళ్లంతా అమ్మవారి మహత్తు విని, చూసి అందరికీ జరిగిన విషయం చెప్పి పోలమాంబ తమకు ఏవిధంగా సహాయం చేసినదో వివరించారు. ఆనాటి నుండి వారు పోలమాంబ భక్తులయినారు. అప్పటి నుండీ ప్రతీ సంవత్సరం ఎన్ని ఆటంకాలు వచ్చినా అమ్మవారి దర్శనం కోసం వస్తూనే ఉన్నారు.

# మరిడమ్మ



అనకాపల్లిలో మరిడమ్మ కోవెల కొట్నివీధిలో గలదు. ప్రజలందరినీ నిత్యం కాపాడే ఆ తల్లిని ఆ వీధి ప్రజలే కాకుండా అనకాపల్లి ప్రజలంతా భయము, భక్తి శ్రద్ధలతో నిత్యం కొలుస్తుంటారు. ఈ దేవాలయం మొదట అనకాపల్లి గవరపాలెంలో ఉండేది. మరిడమ్మ సంబరాన్ని అక్కడే చేసేవారు. గవరపాలెం అంతటా గవర కులస్థులు ఎక్కువగా ఉంటారు. సంబరం నాడు లక్ష్మీదేవి పేట, మళ్లవీధి, కోట్నివీధికి చెందిన వాళ్లందరూ ఇతర ప్రజలూ గవరపాలెం వెళ్లి సంబరం జరిపించేవారు. అయితే కోట్ని వీధికి చెందిన వాళ్లంతా కాపులు కావటం వలన గవర కులస్థులకు, కాపు కులస్థులకు అభిప్రాయ బేధాలు వచ్చి, కలహానికి దారి తీసింది. చివరకు కాపు కులస్థులు అమ్మవారి ప్రతిమను, పోతురాజు ప్రతిమను కోట్ని వీధికి తెచ్చి ప్రతిష్టించి నిత్యం కొలుచుట ప్రారంభించినారు. మొదట దానికి దేవాలయం లేదు. ఈ సంఘటనలో 100 సం.ల క్రితం జరిగిందని కోట్ని రామస్వామి గారు చెప్పారు. తరువాత శ్రీ కోట్ని మహాలక్ష్మి దొర గారు చింతల వారి వద్దను ఒక మండి (భూమిని) కొని తన స్వంత ఖర్చులతో అమ్మవారికి గుడి కట్టించారు. అమ్మవారి విగ్రహాన్ని చోడవరం వాస్తవ్యులైన జి.ఎల్లయ్యగారు కట్టారు. మరిడమ్మ దేవాలయంలో ఒక స్త్రీ పూజారిగా ఉంటుంది. ఆమె పేరు రమణమ్మ. ఇది వంశపారంపర్యంగా వస్తున్నటువంటి ఆచారం. కోట్ని వారి కుటుంబంలో మొదట కోట్ని కనకమ్మ పూజారమ్మగా ఉండేవారు. ఆమె మరణానంతరం కోట్ని సత్యారావు అతని మరణానంతరం కోట్ని రమణమ్మ పూజారిగా ఉన్నారు. ఆమెను పూజారమ్మ అని అంటారు. అమ్మవారి దేవాలయంలో రెండు పూటలా దీపారాధన

చేస్తారు. దేవాలయానికి వేపకొమ్మలు తోరణాలుగా కడతారు. అమ్మవారికి నైవేద్యంగా కొబ్బరికాయ, అరటిపండ్లు, చనిమిడి, వడపప్పు పెడతారు. ఉపాహారంగా అన్నం, పప్పు, పులుసు, బూర్లు, పరమాన్నం, మొదలైనవి వండి పెడతారు. అనకాపల్లిలో మరిడమ్మ సంబరాన్ని శ్రావణమాసంలో జరిగే వరలక్ష్మీ వ్రతం ముందు రోజు జరిపిస్తారు. ఆగష్టు నెలలో నెల పండుగ జరుగుతుంది. నెల రోజులు అమ్మ వారికి దర్శనం కోసం జనులంతా వస్తారు. ఈ నెలా జనులతో ఆలయ ప్రాంగణం అంతా కిటకిట లాడుతుంది. భక్తులు అమ్మవారికి కొబ్బరికాయ, అరటిపళ్ళతో పాటు చీర, జాకెట్టు ముక్కలను కూడ సమర్పిస్తారు. మరిడమ్మ సంబరాన్ని చాలా వైభవంగా చేస్తారు. ఆ రోజు రాత్రి పెద్ద ఊరేగింపుగా జరుగుతుంది. వివిధ రకాల వేషాల బండ్లు, బ్యాండు మొ॥ వాటితో పాటూ చాలా పెద్ద ప్రభలు (పెద్ద భయంకర రూపంలో ఉన్న అట్ట బొమ్మలను) ఊరేగించి ఒకరిపై ఒకరు రంగులను చల్లుకుంటూ ఊరేగింపుగా ఆనందోత్సాహాలతో ఆ ప్రభలను అమ్మవారి వద్దకు తెచ్చి నిలుపుతారు. ఆ రోజు రాత్రి అనేక వినోద ప్రదర్శనలు అనగా సినిమాలు, ప్రదర్శించుట ఆర్కెస్ట్రా మొ॥ కార్యక్రమాలను ఏర్పాటు చేసి ఎంతో సంతోషంగా అమ్మవారి జాతరను ముగిస్తారు.

మరిడమ్మ ఎంతో మేలు చేస్తుందని, రాత్రి పూట తెల్లచీర ధరించి సంచరిస్తూ ప్రజలను కాపాడుతుందని గొర్ల అప్పారావు గారు చెప్పారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 1948లో అనకాపల్లిలో పెద్ద కలరా వ్యాపించింది. దాని మూలంగా అనేక మంది మరణించారు. అపుడు కోట్ని వీధి ప్రజలందరూ మరిడమ్మ వద్దకు వెళ్లి అమ్మా మమ్మల్ని రక్షించు నీ జాతర ఘనంగా జరిపిస్తాము. అని అమ్మను వేడుకొనగా వెంటనే కలరా తగ్గిపోవటంతో పాటూ మళ్లీ ఎప్పడూ కలరా రానే లేదు.

# దుర్గాలమ్మ

దుర్గాలమ్మ దేవాలయం అనకాపల్లి నూకాలమ్మ దేవాలయం సమీపంలో ఉంది. ఈమె నూకాలమ్మ చెల్లెలుగా భక్తుల పూజలు అందుకొంటూఉంది. ఈ దేవాలయాన్ని కిచ్చ నాయుడు కట్టించారు. ఈ అమ్మవారికి ప్రజలు నిత్యం దీపారాధన చేస్తారు. అమ్మవారి సంబరాన్ని వినాయక చవితి వెళ్లిన మాఘకార్తినాడు అతి వైభవంగా జరిపిస్తారు. ఈ అమ్మవారి పుట్టుకను గురించి బుద్ధ గోపీనాయుడు ఈ విధంగా చెప్పారు. ఓరుగంటి రాజు విజయనగర రాజుని నీ పాలన ఎలా సాగుతుంది అని అడిగారు. అపుడతడు దేవుని దయవలన ఏ విధమైన కష్టము మా పాలనలో ప్రజలకు గానీ మాకు గానీ రావని చెప్పారట. ఈ సంఘటన జరిగిన కొన్నాళ్లకు విజయనగర రాజు ఆస్థానంలో ఉండే కొందరు దుండగులు తన రాజ్యాన్ని అపహరించి అతనిని తరుముకొని రాగా అతని గుర్రం శివలింగం తన్నుకొని పడింది. తరువాత ఆ ప్రాంతంలో కాశీవిశ్వేశ్వర ఆలయాన్ని నిర్మించారు. తరువాత మరియొక చోట ఒక పెద్ద రాయిని తన్నుకొని పడిపోగా దానిని రాజు చూచి అమ్మ వారని గ్రహించి ఆమెను శరణు వేడగా

దుండగులు ఆ ప్రాంతం ప్రవేశించే సరికి వారంతా అగ్నికి ఆహుతి అయ్యారు. ఈ విధంగా దుర్గాలమ్మ అమ్మవారు తనను తన రాజ్యాన్ని రక్షించిందని ఆమెనే తన ఆరాధ్య దైవంగా భావించి కోవెల నిర్మించి పూజాది కార్యక్రమాలు ఘనంగా నిర్వహించేవారు. ఆ విధంగా దుర్గాలమ్మ అనకాపల్లి ప్రాంతాన్ని నిత్యం దుండగుల బారి నుండి కాపాడుతూనే ఉందని చెప్పారు.

అమ్మ వారికి నైవేద్యంగా ఉపారాన్ని పెడతారు. భక్తులు తమ స్థోమతను బట్టి అమ్మవారి సంబరాన్ని జరిపిస్తారు. చీర జాకెట్లు, పళ్లు, పూలు అమ్మవారికి సమర్పించుకుంటారు. మాఘకార్తినాడు అమ్మవారి సంబరాన్ని అనేక సాంస్కృతిక కార్యక్రమాలు, వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేసి ఆనందోత్సాహాలతో జరిపిస్తారు.

## కుంచావారి వీధి గౌరమ్మ



గౌరమ్మ పార్వతీ ప్రతి రూపము. అనకాపల్లిలో గౌరమ్మ దేవాలయం మెయిన్‌రోడ్డులో ఉన్నది. ఇది కుంచా వారి వీధి కాబట్టి కుంచావారి వీధి గౌరమ్మ దేవాలయం అని వ్యవహరిస్తుంటారు. మొదట గౌరమ్మ 1811 సం.లో అనగా ఇప్పటికి 5 తరాల వెనుక పుట్టినది. ఈమె కుంచావారి వీధి ఇంటిలో అద్దం, బరిణను కూలగొట్టి మీ యింట గౌరి పార్వతిగా పుడతాను అని చెప్పినది. వెంటనే కుంచావారు గౌరీ

పార్వతి ఈ విధంగా మనయింట ఈ విధంగా పుడతానని చెప్పడం తమ పూర్వ జన్మ సుకృతంగా భావించి అందరికీ ఆ వార్తను తెలిపి, తమ బంధువులందరినీ పిలిచి ఆరోజే పెద్ద పండుగ చేసుకొన్నారు. కొన్ని నెలల తరువాత కుంచావారి యింట పైడిబొమ్మ లాంటి పాప వెలిసింది. తన ముద్దు ముద్దు మాటలతో, మంచి పనులతో అందరినీ ఆకర్షించేది. నిత్యం శివుని ఆరాధిస్తూ అందరినీ ఆ విధంగా ఆరాధించమని చెప్తుండేది. అయితే ఆ పాప కొంతకాలమే బ్రతికి తరువాత మరణించినది. ఆనాటి నుండి కుంచావారు ఆమెను గౌరమ్మగా భావించి ఆరాధిస్తారు.

దేవాలయంలో రెండుపూటలా డప్పువాయిద్యాలతో మేలు కొలుపు పాడి కొబ్బరికాయ, అరటి పండ్లు, చనిమిడి, వడపప్పు, నైవేద్యంగా పెడతారు. ఈ గౌరమ్మ మొదట కాపుకులస్థుల ఇంటిలో వెలసింది కాబట్టి ఈమెను కాపులు ఎక్కువగా ఆరాధిస్తారు. తరువాత గవర, ఇతర కులస్థులు కూడ ఈమెను భక్తి శ్రద్ధలతో పూజిస్తారు.

ఈ గౌరమ్మను దీపావళి ముందు శనివారం నిలుపుతారు. డిసెంబరులో అనగా మార్గశిరమాసం మొదటి వారంలో అమ్మవారిని అణుపుతారు. ఆనాడు పెద్ద సంబరం జరిపిస్తారు. శనివారం సాయంత్రం ఆరు గంటల నుండి ఆదివారం సాయంత్రం ఆరు గంటల వరకు గౌరమ్మను ఊరంతా త్రిప్పి మంగళ వాయిద్యాలతో ఊరేగించిన తరువాత కొంతమంది పేరంటాళ్ళు అమ్మవారిని అణుపుతారు. అమ్మవారిని అణుపుతామని మొక్కువాళ్ళు అమ్మవారిని అణుపుతారు. అణుపు అనగా అమ్మవారి ప్రతిమను 3 సార్లు నీటిలో ముంచి తీసుకువస్తారు. అమ్మవారిని నీటిలో ముంచే ముందు గౌరమ్మ ముఖం రంగు చెరిపివేస్తారు. ఈ అణుపు కార్యక్రమం పూర్తి అయిన తరువాత అమ్మవారిని యధావిధిగా రంగులు వేసి అలంకరిస్తారు. గౌరమ్మ సంబరాన్ని అనకాపల్లి ప్రజలు పోటీలు పడి మరీ జరిపిస్తారు. కుంచావారి వీధి గౌరమ్మ, వేల్పుల వీధి గౌరమ్మ, గవరపాలెం గౌరమ్మ అని మూడు వీధులలోనూ అవతరించిన గౌరమ్మ అనకాపల్లి ప్రజలను తన బిడ్డల వలే చూసుకుంటుంది. కుంచావారి గౌరమ్మ సంబరాన్ని పీలా వెంకట జగన్నాథ నాయుడు గారు జరిపించేవారు. ప్రస్తుతం ఆలయ ధర్మకర్తగా కుంచా నూకరాజు వ్యవహరిస్తున్నారు. కుంచా చిన్నయ్య, సాంబయ్య మొ॥ వారు కార్యకర్తలుగా ఉన్నారు. అమ్మవారిని అనేకమంది భక్తులు సేవిస్తుంటారు. తన సేవ చేస్తూ మధ్యలో మానివేసిన పాండ్రి సత్యారావు అనే భక్తుడ్ని అమ్మవారు జుట్టు పట్టుకొని తన దేవాలయానికి తీసుకువచ్చిందట. వేంటనే అతడు లెంపలేసుకొని నేను మామూలుగా వస్తాను. బంగారు శతమానాలు నీకు చేయిస్తాను అని చెప్పి అమ్మవారిని శరణు వేడు కున్నాడట. అప్పటి నుండి గౌరమ్మను తన కుటుంబ సభ్యులంతా నిత్యం సేవించు కుంటారు.

# వేల్పుల వారి వీధి గౌరమ్మ



ఈ గౌరమ్మ వేల్పుల వీధిలో మొదట వెలయుట వలన వేల్పుల వీధి గౌరమ్మ అని జనవ్యవహారం. ఈ గౌరమ్మ దేవాలయం అనకాపల్లి మెయిన్‌రోడ్డులో వేల్పుల వీధి వద్ద ఉన్నది. దాని వివరాలను వేల్పుల రామారావు గారు ఈ విధంగా చెప్పారు.

రమారమి 135 సం. క్రిందట వేల్పుల గౌరమ్మ అను పాప తన (వేల్పుల రామారావుగారి) స్థలంలో ఒక రాయికి గౌరీ పరమేశవరి అను పేరు పెట్టి ఆడుకుంటూ, ఉండేది. దరిమిల వివాహం అయిన పిమ్మట వేల్పుల వీధిలో ఉన్న పెద్దలు కొందరు అనగా మద్దాల ఆదినారాయణ, బాపనయ్య, రౌతు సంగమయ్య మొదలగు వారు ఇప్పడు దేవాలయం ఉన్న స్థలం వద్ద చిన్న పూరి పాకను వేసి ఆ రాయిని గౌరమ్మగా ఉంచి వేడుకలు చేసేవారు. వివాహం అయ్యి అత్తవారింటికి వెళ్లిన గౌరమ్మ తను ఆడుకున్న ప్రతిమ ఈ విధంగా పూజలందుకొనుట చూసి ఎంతో సంతోషించింది. ఆమె స్వయంగా పూజా కార్యక్రమాలలో పాల్గొని మిక్కిలి భక్తి శ్రద్ధలతో గౌరమ్మను సేవించేది. ఆమె సేవించడమే కాకుండా అందరికీ గౌరమ్మను సేవించమని, ఆ విధంగ సేవించిన వారికి సకల సౌభాగ్యాలు చేకూరుతాయని చెప్పేది. ఆమె ప్రభావం వల్లనే అనేకమంది స్త్రీలు గౌరమ్మను తమ ఇలవేల్పుగా భావించి నిత్యం ఆరాధిస్తూ సుఖసంతోషాలతో ఉండేవారు. 1935 సం. నుండీ గౌరమ్మను సేవించే భక్తుల సంఖ్య పెరగ నారంభించింది. ఆ కాలంలో

వాకాడ దాలప్ప గాని నేతృత్వంలో పూజలు ఘనంగా నిర్వహించేవారు. అయితే భక్తురాలైన వేల్పుల గౌరమ్మ కొంత కాలానికి గౌరీ పరమేశ్వరిలో ఐక్యం అయిపోయింది. తరువాత డాక్టర్ కొమ్మ నరసింహనాయుడు తన భార్య జ్ఞాపకార్థం దేవాలయాన్ని కట్టించారు. ఇది వేల్పుల వీథిలో ఉండుట వలన ఆనాటి నుండి దీనిని వేల్పుల వీథి గౌరమ్మ గుడి అని అంటున్నారు.

వేల్పుల వీథి గౌరమ్మ సంబరాన్ని చాలా ఘనంగా చేస్తారు. ఈ సంబరం ప్రతి ఏడాది జనవరి నెలలో ఏదో ఒక శనివారం చేస్తారు. కార్తీకమాసం అంతా భక్తులు విశేషంగా దర్శిస్తారు. ప్రతి కార్తీక సోమవారం నాడు సూర్యోదయమునకు ముందుగానే అనకాపల్లిలోని చాలామంది స్త్రీలు, పిల్లలు శారదానదిలో స్నానం చేసి ఆ నదిలో దీపాలను వదిలి తిరిగి తమ ఇళ్లకు వెళ్లేటప్పుడు తప్పని సరిగా వేల్పులవీథి, కుంచావారి వీథి, గవరపాలెం గౌరమ్మలను ఎవరికి దగ్గరగా ఉన్న చోట వారు దర్శించి పూజలు చేస్తారు.

సంబరం నాటి పీఠానికి (గౌరమ్మ) ఒక ప్రత్యేకత ఉంది. గౌరమ్మ పీఠం వేల్పుల వారి కుటుంబంలోనే ఉంటుంది. ఆ పీఠాన్ని సంబరం ముందురోజు శుభ్రం చేసి పసుపు కుంకుమలతో అలంకరించి ఉంచుతారు. దానిని వేల్పుల రామారావు గారి కుమారుడు గణేష్ దానిని తన తలపై పెట్టుకుని ఊరేగింపుగా పొలాల్లోకి వెళ్లి అక్కడ గల దుబ్బుపై పెట్టి దానికి మూడుసార్లు ప్రదక్షిణలు చేసి మరల దానిని గుడిలోకి తెచ్చి ఉంచుతారు. తరువాత గౌరమ్మను ఊరంతా డప్పు వాద్యాలతో మంగళవాయిద్యాలతో వసంతాల చల్లుకుంటూ ఊరంతా ఊరేగించి తిరిగి దేవాలయానికి తీసుకుని వచ్చి ఆ పీఠంపై ఉంచుతారు. అపుడు వేల్పుల వారి ఇంటికి వెళ్లి గౌరమ్మను నిలిపాము వీరు రండి అని చెప్పి కొంతమంది పేరంటాళ్లు బొట్టుపెట్టి పిలువగా వేల్పుల వారింటి కోడలికి 'ఓరిగం' పట్టుకొస్తారు. ఓరిగం అనగా పెరుగన్నం మరియు ఉల్లిపాయ మరియు అరటిపళ్లు మొదలగునవి. సంబరం అయిన తరువాత తెల్లవారు ఝామున గౌరమ్మకి నైవేద్యంగా బూర్లు, గారెలు, పరమాన్నం చేసి పెడతారు. సంబరం అయిన తరువాత అణుపు కార్యక్రమం ఉంటుంది. ఇద్దరు పేరంటాళ్లు 3 సార్లు నీట ముంచి తిరిగి కోవెలకు తీసుకుని వస్తారు. 3వ రోజున పీఠమీద అరటిపళ్లు, కొబ్బరికాయలు పెట్టి పీఠాన్ని వేల్పుల వారి యింటికి పంపిస్తారు. ఈ పీఠాన్ని గురించి జనులు ఈ విధంగా చెప్పకుంటారు. ఈ పీఠాన్ని వేల్పుల వారింటి కోడలు ఎవరికీ కనిపించకుండా అటుకపై ఉంచిందట. ఒకసారి ఆమె అటక ఎక్కి తిరిగి రావడం చూసిన తోడి కోడళ్లు వాళ్ల అత్త ఏదో వండి దానిని అక్కడ దాచుకుంది అని భావించి ఒక నిచ్చెన వేసుకొని పెద్ద కోడలు ముందు ఎక్కుతుండగా రెండవ కోడలు కూడా ఆమెను అనుసరించినదట. అయితే ఆవిడ ఆ సమయమున మైల కలిగి ఉందట (ఇంట్లోకి రాకూడదు) అప్పడు ఆ సంగతి గ్రహించిన గౌరమ్మ ఆమెను క్రిందకు త్రోసివేసిందట. పెద్ద కోడలు పైకి ఎక్కి అక్కడ పీఠ ఉండటాన్ని చూసి వెంటనే తను తప్పగా ఆలోచించినందుకు క్షమించమని గౌరమ్మను వేడుకొని, తిరిగి క్రిందకు వచ్చి ఆ అత్తగారికి తాము చేసిన పని అనుకున్న విషయం చెప్పి క్షమించమని కోరినదట.

అపుడా అత్తగారు నిత్యం గౌరీపూజ చెయ్యమని, ఆవిధంగా చేస్తే తనకు మేలు జరుగుతుందని చెప్పింది. అపుడా ఇద్దరు కోడళ్లు దీక్షగా గౌరమ్మ పూజ చేయగా ఏడాది తిరుగ కుండానే ఇద్దరికీ చక్కని చిన్నారులు గౌరీ అంశలో పుట్టారు అని చెప్పకుంటారు.

మరొక సంఘటన ఏమిటంటే వేల్పుల రామారావు గారు ఎప్పడూ గౌరమ్మ సంబరాన్ని జరిపిస్తారు. అయితే ఒకనాడు తన భార్య మనసు బాగుండక పోవడం వల్ల పొరపాటున నేను ఈ ఏడాది సంబరం చేయలేను అని తన మనసులో అనుకున్నదట. వెంటనే ఉయ్యాలలో ఆడుకుంటున్న తన కుమారుడు దూరంగా ఉన్న బీరువా దగ్గర పడినాడట. అదే సమంలో తన భర్త విశాఖపట్టణంలోని బావగారి ఇంటిలో ఉండగా వెనకాల వీపుపై గట్టిగా ఎవరో కొట్టినట్లు అనిపించినదట. ఇంకా ఇక్కడే ఉన్నావా? ఇంటికి పోవేమిరా? అని స్త్రీ కంఠం వినిపించినదట. వెంటనే అతడు ఆ చెప్పినది గౌరమ్మ అని భావించి వెంటనే బయలుదేరి అనకాపల్లి చేరుకున్నారట. ఇక్కడ ఇంటివద్ద బీరువా దగ్గర ఉన్న చాలని చూసి అపుడు ఆమె తన మనసులో ఈ విధంగా అనుకున్నావని అందుకే ఈ విధంగా జరిగిందని అనుకుంటుండగానే వాళ్ల ఇంటి ప్రక్కన అద్దెకి ఉంటున్న 70 ఏళ్ల ఉపాధ్యాయురాలు పూనకంలో వచ్చీ నీవు వేల్పుల వారి కోడలివి కాదే? సంబరం చెయ్యవే? అని అడిగిందట. వెంటనే ఆమెతన తప్పను తెలుసుకొని నేను పొరపాటు చేశాను. యథా ప్రకారమే సంబరం చేయిస్తాము. అని అనగానే ఆమె శాంతించినది. లోపలికి వెళ్లి బీరువా ప్రక్కన ఉన్న తన కుమారుడిని చూడగా హాయిగా నవ్వుతూ ఆడుకుంటున్నాడట. ఈ విధంగా గౌరమ్మ తన భక్తులను నిత్యం కాపాడుతూనే ఉంటుంది. అన్న మాట ప్రకారము వేల్పుల వారు ఆ యేడాది ఘనంగా సంబరాన్ని జరిపించారు. గౌరమ్మ సంబరం అనకాపల్లిలో కీ.శే. స్వారంగి బ్రదర్స్, మాదాల అప్పలస్వామి బళ్లవేషాలు కట్టి టౌన్‌లో ఆ దేవుడు బొమ్మని చాలా ఘనంగా చేస్తారు. 1948 నుండి వాకాడ సత్యారావు, (ఎక్స్.ఎమ్.సి.) వేల్పుల రామారావు గారు కార్యదర్శులుగా ఒక 3 సంవత్సరాలు ఘనంగా సంబరాన్ని జరిపించారు. ఇప్పటికీ అంతే ఘనంగా జరుగుతున్నాయి. తరువాత 4 సం.కి కమిటీలన్నీ రద్దు అయిపోయాయి. సంబరం నాడు రాత్రి అనేక వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేయడమే కాకుండా భారీగా మందుగుండు సామాగ్రిని కాలుస్తారు. శ్రీ రౌతు ఆదినారాయణగారి పర్యవేక్షణలో భారీ నాటకాలు అనగా కురుక్షేత్రము, గయోపాఖ్యానము, రామాంజనేయ యుద్ధం, చింతామణి నాటకం, బుర్రకథలు (కుమ్మరి మాష్టారు బుర్రకథ) గరివిడి లక్ష్మి కామిక్స్, ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి గాంచిన పెద్ద నటులచే అనగా షణ్ముఖి ఆంజనేయరాజు, ఎ.వి.సుబ్బారావు, ఎ.కోటేశ్వరరావు బి.ఎ., ఎ.వెంకటేశ్వరరావు బి.ఎస్.సి. మొదలగు వారిచే నాటకాలు, రోషన్‌లాల్ ఆర్కెస్ట్రా మొదలగు వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేసి వేల్పుల వీధి సంబరం మించిన సంబరం లేదని పేరు తెచ్చుకున్నారు.

# గవరపాలెం గౌరమ్మ



గవరపాలెం గౌరమ్మ దేవాలయం అనకాపల్లి నూకాలమ్మ గుడి సమీపంలో ఉంది. ఈ గౌరమ్మ గుడి 100 ఏళ్ళ క్రితమే కట్టబడింది. ఈమెను ఎక్కువగా గౌరీ కులస్థులు ఆరాధిస్తారు. కార్తీకమాసం నెల రోజులు గౌరమ్మకు పూజాది కార్యక్రమాలు నిర్వహిస్తారు. మొదట కొణతాల జగన్నాధం, వీరాస్వామి, కొణతాల రమణ, కోరిబిల్లి మాణిక్యాలరావు, కిళ్ళీల అప్పన్న, మద్దుల అప్పన్న, కొణతాల నాగన్న, మొదలగు గౌరీ కులస్థులంతా కలిసి గౌరమ్మ గుడి నిర్మాణం జరిపించారు.

ప్రతిరోజూ ఉదయం సాయంత్రం గౌరమ్మకు పూజలు చేస్తారు. కొబ్బరికాయ, అరటిపండ్లు, చలిమిడి, మొ॥నవి నైవేద్యంగా సమర్పిస్తారు. గవరపాలెం గౌరమ్మ సంబరాన్ని ప్రతియేటా జనవరి నెలలో ఒక శనివారం నాడు ఘనంగా జరిపిస్తారు. అనకాపల్లిలో మొదట కుంచావారి వీధి గౌరమ్మ, తరువాత వేల్పులవీధి గౌరమ్మ, ఆ తరువాత గవరపాలెం గౌరమ్మ ఉత్సవాలను జరిపిస్తారు. ఈ సంబరాలకు మధ్య ఒకవారం రోజుల తేడా ఉంటుంది. సంబరం నాడు ఉదయం గౌరమ్మకు మంగళ వాయిద్యాలతో దీపారాధన చేసి, నైవేద్యం సమర్పించి ఊరంతా గౌరమ్మ ప్రతిమను ఊరేగిస్తారు. ఆ రాత్రి దేవాలయానికి వచ్చిన తరువాత భక్తులు తమ స్తోమతకు తగిన విధంగా అమ్మవారికి కానుకలు, నైవేద్యాలు సమర్పించి తమ కోర్కెలు తీర్చమని వేడుకుంటారు.

ఆ రోజు అనగా సంబరం నాటి శనివారం రాత్రి అనేక వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు. ఆ రాత్రి గవరపాలెం అంతటా దీపాల వెలుగుతో జన సంచారంతో అది రాత్రా? లేక పగలా? అని అనిపిస్తుంది. అడుగడుగునా సినిమాలు ప్రదర్శించుట, నాటకాలు వేయుట, రికార్డింగు డ్యాన్సులు, విచిత్ర వేషధారణ ఆర్కెస్ట్రా మొదలగు ఎన్నో రకాల వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు. గవరపాలెం గౌరమ్మ సంబరం ప్రత్యేకత మందుగుండు. ఆ రోజు కొన్ని వేల రూపాయలు ఖర్చుపెట్టి పొన్నచెట్టు, గ్లోబు, మల్లెపందిరి, నాగుపాము (పది అడుగులు) మొదలగు వివిధ రకాల పేర్లతో ఆకర్షణీయమయిన ఆకారాలు ఏర్పాటు చేసి మందుగుండు కాల్చుతారు. ఈ విధంగా అనకాపల్లిలో గవరపాలెం గౌరమ్మ సంబరం జరిపించినంత గొప్పగా మరే సంబరం, జరగదన్న గొప్పపేరు సంపాదించారు. గౌరీ కులస్థులు వీరి భక్తి ప్రపత్తులు ఈ విధంగా చాటుకుంటే గౌరమ్మ అనకాపల్లి ప్రజలకు ఏ కష్టాలు రాకుండా కాపాడుతుంది.

# VII ) పేరంటాళ్ళు

## 1) దుడ్డచ్చమ్మ

## 2) మల్లమ్మ

## 3) నాగయ్యమ్మ

## 4) అమ్మాజమ్మ

## 5) అచ్చమ్మ

## పేరంటాండ్రు

గ్రామదేవలతో బాటూ పేరంటాండ్రుకు కూడా ఘనమైన ఉత్సవములు జరుపు చున్నారు. కులదేవతలు ఆయా కులములకే పరిమితము గానీ ఉత్సవముల యందును గ్రామ ప్రజలందరును ఉత్సాహముతో భక్తి ప్రపత్తులతో పాల్గొనెదరు. ఉత్సవ సమయమున ఆయా కులములు, కుటుంబములవారే ముందుగా పాల్గొనెదరు. వైశ్యులకు కన్యకాపరమేశ్వరి, దేవాంగులకు చౌడేశ్వరీదేవి, చీరప్పమల్లన్నలు, కురుమ, గొల్ల కాపులకు గంగాదేవి కుల దైవముగా పాటించుచున్నారు. కులదైవములకు పూజా విధానము అంతా సాత్వికమే ఆమెకు చీర, జాకెట్టు, చలిమిడి, వడపప్పు, బూరెలు,

అన్నము, పాలు, పిండివంటలు ఉపాహారంగా నైవేద్యమును చెల్లింతురు. ఇందు బలి నిషేధము. మాంసాహారము ముట్టరు. పూజారిగా కులపెద్దలు ఉందురు.

పురాణముల యందు పతివ్రతలు తమ మానసిక అతీత శక్తులచే దేవతలను, మానవులను కూడ పరాజితులను గావించిరి. అనసూయ, అరుంధతి ఈ కోవకు చెందిన వారే. జానపద సాహిత్యము నందు పేరంటాండ్రు పురాణ పతివ్రతలతో బాటు సమానమయిన ప్రతిపత్తిని కలిగి తమ జీవిత కాలములోనే తమ పాతివ్రత్య మహత్యమును ప్రదర్శించి పురాణస్థాయినకు ఎదిగారు. వీరు తమ మరణమునకు కారణభూతులయిన వారిని సర్వనాశనం గావించి దేవతలుగ వెలిసి ప్రజలచేత పూజింపబడుచున్నారు. అత్తల ఆరళ్లను భరించలేనివారు, తోడికోడళ్ళ ఈర్ష్యాసూయలకు బలి అయినవారు భర్తలచే సహగమనము చేసినవారు, కాముకుల చేత బలాత్కరింపబడినవారు మరణానంతరము పేరంటాండ్రుగా వెలసినారు. అయితే అనకాపల్లిలో గల దుడ్డచ్చమ్మ అను పేరంటాలు ఈ విధమయిన మోసాలకు గురి కాలేదు కానీ ప్రజలచేత మంచి అనిపించుకొని తన మహత్యాన్ని చూపి ఎంతమంది వద్దని చెప్పిననూ వినకుండా సహగమనం చేసి పేరంటాలు అయినది. మరణానంతరము పేరంటాళ్ళ విగ్రహములు శిలలుగా, వృక్షములుగా, ఫల వృక్షములుగా భూమిపైన నిలిచిపోయినట్లు వర్ణింపబడినారు. అనకాపల్లిలో గల దుడ్డచ్చమ్మ పేరంటాలు వృక్ష రూపంలో ఈనాటికీ నిలిచి ఉన్నది.

మరణానంతరము పేరంటాండ్రు తమకత్యంత సన్నిహితులైన వారి స్వప్నములో కనబడి గుడులు కావలయునని, పూజలు జరిపించుమని ఆదేశించెదరు. కానీ అనకాపల్లిలో ఉన్న దుడ్డచ్చమ్మ తన ఆప్తులకు కలలో కనిపిస్తుంది. కానీ ఎప్పుడూ గుడి కట్టించమని కానీ, అది కావాలి, ఇది కావాలి అని గానీ కోరలేదట. ప్రజలు వాళ్ళ స్తోమతకు తగినట్లుగ పూజిస్తారు. కొందరు పేరంటాండ్రు మరణానికి పూర్వము, అనంతరము నిస్సంతులకు సంతు కలుగునట్లుగా ఆశీర్వదించెదరు. వారి ఆశీర్వాద ఫలితము చేత సంతానము కలిగిన యెడల తమ బిడ్డలకు పేరంటాండ్రు పేర్లనే పెట్టుకొందురు. పేరంటాండ్రు అభిమతము కూడా అదే.

గ్రామదేవతల వలే పేరంటాండ్రు కూడా శక్తి స్వరూపిణిలు. వీరు ఆగ్రహించినచో పశునాశనము, ప్రాణ నష్టములు సంభవించును. భీతి చేత అత్యంత భక్తి శ్రద్ధలతో వారికి ఉత్సవములను జరిపించెదరు. అనకాపల్లిలో ఉన్న దుడ్డచ్చమ్మ, పేరంటాలు, మండపేటనందున్న పాపమ్మ పేరంటాలు ఉత్సవము, పాయకరావుపేటనందున్న పేరంటాలమ్మ ఉత్సవములు ఈ కోవకు చెందినవి.

మానవులకు మరణము సహజము అయినప్పటికీ కొంతమంది ప్రత్యేక వ్యక్తులే దేవతలుగా, పేరంటాండ్రుగా వెలయుటకు పరిస్థితులే కారణము. వీరు మరణించగానే పశు నష్టము, ప్రాణ నష్టము, అద్భుత సంఘటనలుగానీ సంభవించిన అవి మరణించిన వారి ఆగ్రహం, అనుగ్రహము వల్లనే సంభవించినవి అని నమ్మి వారికి పూజచేయుదురు.

1) పరుల దౌర్జన్యమునకు, ఈర్ష్యా అసూయలకు మరణించిన పేరంటాండ్రు వారి కథలు మనకు గలవు. ఉదా:- చీరమ్మ, చితుకమ్మ, తిరపతమ్మ మొ॥వారు.

2) పర పురుషుల చేత బలాత్కరింపబడి మరణించిన వారు. ఉదా:- బయ్యమ్మ.

3) భర్తల సంశయ స్వభావము చేతను, సాటిస్త్రీల అసూయవలనను, లోకుల చేత నిందించబడి శీలమును శంకించబడుట వలనను మరణించి, మరణాంతరము పేరంటాండ్రుగా పూజలందుకొనినవారు. ఉదా:- నాగమ్మ, రాములమ్మ, లక్ష్మమ్మ.

4) మరణించిన భర్తతో సహగమనము చేసినారు. ఉదా:- కాకమ్మ, పాపమ్మ, దుడ్డచ్చియ్యమ్మ.

5) బలిగా నాపంగ బడిన వారు సంఘ సంక్షేమమునకు ఆత్మార్ఫణము చేసుకొన్నవారు. ఉదా: నాంచారమ్మ, ముసలమ్మ, నలజారమ్మ మొ॥వారు.

ఈ విధంగా పేరంటాండ్రుకు తలొక ప్రత్యేకమయిన ఇతివృత్తముతో కూడిన కథలు కలవు. ఇప్పడు పతితో పాటూ సహగమనము చేసిన అనకాపల్లికి చెందిన దుడ్డచ్చియ్యమ్మ గురించి వివరిస్తాను.

## పేరంటాలు దుడ్డచ్చమ్మ - దుడ్డచ్చమ్మ గుండం



అచ్చమ్మ అనే బాలికకు 10 సం. ప్రాయంలోనే వివాహం జరిగింది ఆమె చిన్నతనంలోనే పెద్ద తరహాగా ఉండేది. ఒంటినిండా పసుపు రాసుకొని పెద్దబొట్టు పెట్టుకునేది. చీరలు కట్టుకునేది. ఆమెకు ఎరుపు రంగు అంటే ఎంతో యిష్టము. ఇంటి

పనులన్నీ చక్కగా చేసేది. అందరి మన్ననలు పొందేది. అయితే ఒకనాడు తన భర్త వ్యాపార నిమిత్తం పాడేరు వెళ్లి వచ్చి జబ్బు పడిపోయారు. కొన్నాళ్లకు మరణించగా అచ్చమ్మ నూకాలమ్మ గుడికి వెళ్లి అమ్మవారిని పిలిచినది. అపుడు అమ్మవారు బయటకి వచ్చి ఎందుకు వచ్చావు? ఏమిటి కావాలి అని అడిగినదట. వెంటనే అచ్చమ్మ జరిగిన సంఘటన చెప్పి నా భర్త మరణించినాడు. నేను కూడా ఆయనతో కలసి చనిపోతాను. నాకు నీ పక్కన కొంచెం స్థలం ఇవ్వవలెను అని అడిగిందట. అప్పుడు అమ్మవారు ఆ విధంగా నువ్వు నాపక్కన ఉంటే నీకు నాతో కలసి పండుగ చేస్తారు. నీకు ప్రత్యేకమయిన గుర్తింపు రావలెనంటే నువ్వు తుంపాల వెళ్లి అక్కడ మహారాజు గార్ని కాస్త స్థలం ఇవ్వమను, ఆ స్థలాన్ని బట్టి నువ్వు గుండాల్ని తవ్వించుకో అని అమ్మవారు చెప్పిందట. ఆ విధంగానే అచ్చమ్మ తుంపాల రాజుగారి వద్దకు వచ్చి నేను నా భర్తతో పాటు సహగమనం చేస్తాను. అందుకు గుండం ఏర్పాటు చేసుకోవడానికి స్థలం కావాలి అని అడిగిందట. అందుకు రాజు ఈ విధంగా ఎంతో మంది వస్తారు ఎంత మందికని స్థలం ఇస్తాం. అయినా నువ్వు చిన్న పిల్లవి. నీకేం వయస్సు ముదిరిందని, నువ్వు ఎంతో కాలం బ్రతకవలసి ఉంది. కాబట్టి ఇటువంటి కార్యం నీవంటివారు చేయకూడదు. నీవు ఇంకా కొంత కాలం బ్రతకాలి. నీకు స్థలం ఇవ్వను అని చెప్పగానే, ఆమె వెనక్కు తిరిగి వెళిపోతుండగా రాజుగారికి భయానుభూతి కలిగింది. ఏదో తప్పు చేస్తున్నాను అని తన మనస్సుకు తోచింది. అతనిలో ఒక విధమయిన మార్పువచ్చినట్లు అనిపించింది. వెంటనే ఆమెను వెనక్కి రప్పించి నీకు ఎక్కడ స్థలం కావాలి అని అడిగి ఆవిడ ఇష్ట పూర్వకంగా తుంపాల సెంటరులో స్థలం ఇచ్చారట. అయితే ఆ రాజుతో అచ్చమ్మ నా సత్య నిదర్శనం చూపిస్తాను. దీనికి ఏం కావాలో కోరుకో అని రాజును అడిగిందట. వెంటనే రాజు ఈ విధంగా కోరుకున్నాడు. నువ్వు గుండాన పడిన వెంటనే పసుపుముద్ద, పువ్వులు, గాజులు ఎలా ఉండేవి అలాగే మంటలో కొంచెం కూడా కలిసిపోకుండా నాకు అందించాలి." అని కోరుకున్నాడట. అచ్చమ్మ తల్లి ఆవిధంగానే చేస్తారు. అని ఒప్పుకున్నదట. ఆమె చెప్పిన రోజు ఆమె కోరుకున్న స్థలంలో గుండం ఏర్పాటు చేశారు. ఆ సమయంలో రాజుగారు అక్కడే ఉన్నారు. అచ్చమ్మ మంటల్లో నిలుచుని పువ్వుల, పసుపు, గాజులు కొంచెం కూడా కాలిపోకుండా రాజుగారి చేతులకు అందించి ముఖంలో ఏవిధమయిన బాధ కనబడకుండా సంతోషంతో అగ్నికి ఆహుతి అయిపోయిందట. ఆమెకు 10వ ఏట వివాహం జరిగితే 12వ ఏట ఈ సంఘటన జరిగింది. ఇది నాలుగు తరాల నాటి సంఘటన. తల్లి గుండాన పడి ఇప్పటికి 347 సంవత్సరాలు అయ్యింది. ఆమె గుండాన పడినప్పటి నుండి ఆ తుంపాల సెంటరుకు గుండాలవీధి, అని పేరు వచ్చింది. అచ్చమ్మ సహగమనం చేసిన తరువాత ఆ స్థలంలో ఒక "కానుగ" చెట్టు రూపంలో పేరంటాలుగా అవతరించింది. ఆ చెట్టు ఏడు పలవలతో ఉంటుంది.

## సంబరం జరుపుట :-

అచ్చమ్మ పేరంటాలు ఆలయ ధర్మకర్తలుగ దుడ్డు వంశీయులు ఉన్నారు. వారు ప్రతి యేటా ఉత్సవం (సంబరం) నిర్వహిస్తారు. ఉగాది నాడు ఈ సంబరాన్ని జరుపుతారు. ఉగాది నాడు ఉదయం పేరంటాలికి పప్ప అన్నం, బూరెలు, పళ్లు, కాయలు మొ॥వి నైవేద్యంగా పెడతారు. భక్తులు అందరూ పేరంటాలిని దర్శించుకుని వారి ఆర్థిక స్థోమతకు తగినట్లుగా పళ్లు కాయలు పెడతారు.

భక్తులు అందరూ పేరంటాలిని దర్శించుకొని వారి ఆర్థిక స్థోమతకు తగినట్లుగా పళ్ళుకాయలు, చీర జాకెట్టును పెడతారు. సాయంత్రం ఆ గుండం దగ్గర పెద్ద తీర్థం జరుగుతుంది. వివిధ రకాల వస్తువులు, ఆట వస్తువులు, గాజులు మొ॥వి విక్రయిస్తారు. చిన్న పిల్లల కోసం రంగులరాట్నం, జెయింట్‌వీల్, మొదలగునవి అక్కడ నిలిపి కొంత డబ్బు వసూలు చేసి తిప్పుతారు. ఆ సంబరం రోజు పిల్లలు, పెద్దవాళ్ళు అనే భేదం లేకుండా అందరూ వినోదంగా గడుపుతారు. పేరంటాలిని తమ కుటుంబాన్ని చల్లగా చూడమని కోరుకుంటారు.

## మహాత్యాలు :-

దుడ్డచ్చమ్మ భక్తురాలయిన "శరగడం నూకరత్నం" ఈ పేరంటాలి యొక్క మహాత్యాలను వివరించారు. గుండాలవీధిలో గుండానికి సమీపంలో ఉన్న స్థలం అంతా పేరంటాలిదేనని అక్కడ దుకాణాలు పెట్టుకుని కొంతమంది జీవనం సాగిస్తారని చెప్పారు. పేరంటాలి దయవల్ల గుండం సమీపంలో అంటే ఆ వీధిలో ఎప్పడూ ఏ ప్రమాదము సంభవించలేదని చెప్పారు. పేరంటాలు పిలిస్తే పలుకుతుందని ఎవరికీ ఏ కష్టం రాకుండా చూస్తుందని చెప్పారు. ఒకసారి తన భర్తను ఆపద నుండి కాపాడిందట. వ్యాపారంలో ఎప్పడూ నష్టాలు రాకుండా ఈ పేరంటాలే కాపాడుతూ వచ్చింది. ఆమెకు చాలా కాలం వరకు పిల్లలు లేకపోవడంతో ఒకనాడు పేరంటాలికి తన మనసులోని కోరికను తెలియజేయగా ఆ సంవత్సరంలోనే తనకు కుమారుడు కలిగినాడు. ఈ అచ్చమ్మ పేరంటాలు ప్రజలందరినీ ఒక తల్లి తన పిల్లలను ఏ విధంగా ఆదరిస్తుందో ఆ విధంగా ఆదరిస్తుంది. ప్రతి శివరాత్రికి నూకరత్నం పేరంటాలికి ఘనంగా పూజ చేస్తారు. ఆ రోజు కోసం ప్రత్యేకంగా పసుపు దంచుతారు. ముందురోజు యధాప్రకారంగా పసుపు దంచి ఉంచగా రాత్రి కలలోకి పేరంటాలు వచ్చి "అమ్మా ! పసుపు చాలా బాగుంది. మంచి రంగు వచ్చింది అని చెప్పిందట. అమ్మ అని ఎంతో ఆప్యాయతతో పిలుస్తుందట. శివరాత్రినాడు ఇంటిల్లిపాది ఆ సంబరంలో పాల్గొంటారు. ఆ రోజు భర్తకు, పిల్లలకు కావిడిలు కడుతారు. ఒక దానిలో పానకం, ఒక దానిలో చీరలు వేసి కావిడిలు పట్టుకెళతారు. వెనకాల మరికొంత మంది ముత్తైదువులు పళ్లాలతో పళ్ళు, కాయలు, పిండివంటకాలను పట్టుకొని డప్పుల వాయిద్యాలతో దివిటీల కాంతిలో ఊరేగింపుగా

వెళ్లి పేరంటాలి గుండం వద్ద రాత్రి అంతా జాగరణ చేస్తారు. ఆ రోజు నూకరత్నం పేరంటాలికి పరమాన్నం, పప్పు అన్నం, బూర్లు, ఇంకా ఇతర పిండివంటలు నైవేద్యంగా పెడతారు. 100 కొబ్బరికాయలు కొట్టి, 11 జాకెట్టు ముక్కలను ముత్తైదువులకు పంచుతారు. ఈ విధంగా పేరంటాలికి పండుగ చేస్తారు. ఈ పేరంటాలు చాల చల్లని తల్లి. ఎవరి మీదైనా పూనడం తనకు కావలసిన కోరికలు అడగడం అటువంటివి ఏమీ ఉండవు. ఈ పేరంటాలి మీద ప్రజలకు భయంకన్నా భక్తి ఎక్కువ. అందరూ ఈమెను భక్తితో కొలుస్తారు. భక్తితో పూజించిన వారికి ఈ పేరంటాలు సకల సుభాలు కలుగచేస్తుందని శరగడం నూకరత్నం చెప్తారు.

## పేరంటాలు మల్లమ్మ - మల్లమ్మ గుండం



మల్లమ్మ చోడవరం నివాసిని. అయితే ఆమెకు వివాహం కాకుండానే చిన్న తనంలోనే సహగమనం చేసుకుంటానని చెప్పి లక్ష్మీదేవిపేట వచ్చి గుండం ఏర్పాటు చేసుకొని ఆ మంటల్లో దూకి మరణించిందట. ఆనాటి నుండి ఈ లక్ష్మీదేవి పేట ప్రజలను కాపాడుతూ వస్తుంది. రాత్రివేళల ఆ వీధి అంతా తిరుగుతూ ఆ పేట ప్రజలను కాపాడుతుంది. రాత్రి వేళలో ఒంటరిగా నడిచేవారికి తోడుగా వచ్చి వాళ్లను ఇంటి వరకూ దిగబెడుతుంది.

మల్లమ్మకు ప్రతి సంవత్సరం కొత్త అమావాస్య ముందు రోజు పండుగ చేస్తారు. ప్రతి సోమవారం పళ్లు పూలతో మల్లమ్మను పూజిస్తారు. శివరాత్రి నాడు రాత్రి ఆ పేట ప్రజలంతా జాగరం చేసి మల్లమ్మ గుండం వద్దకు వచ్చి, మేళ తాళాలతో ప్రదక్షిణ చేసి ఆ రాత్రి అంతా ఆనందంగా గడుపుతారు. కార్తీకమాసం రోజుల్లో ఆ నెల రోజులు రోజుకు కనీసం 5 కుటుంబాలవారైన మల్లమ్మ గుండం వద్దకు వచ్చి వంటలూ అవీ అక్కడే చేసుకుని మల్లమ్మకు పిండివంటలుతో నైవేద్యం సమర్పించి సాయంత్రం వరకూ ఆ

తల్లి సమీపంలో ఉండి ఆనందంగా గడిపి ఇళ్ళకు చేరుకుంటారు. ఈ విధంగా కార్తీకమాసం నెల రోజులూ మల్లమ్మ గుండం వద్ద నిత్యపండుగే.

కొత్త అమావాస్య ముందురోజు మల్లమ్మ సంబరాన్ని చాలా ఘనంగా పెద్దలందరూ జరుపుతారు. ఆనాడు లక్ష్మీదేవిపేటలోని పెద్దలందరూ సమావేశమై తమ స్థోమతకు తగినంత ధనాన్ని ఇచ్చి అంతా కలసి ఆనందోత్సాహాలతో సంబరం జరిపిస్తారు. ఆనాడు ఉదయం పేరంటాళ్లందరూ మల్లమ్మకు పిండివంటలతో నైవేద్యం సమర్పిస్తారు. సాయంత్రం హరికథ, బుర్రకథలు, మొదలగునవే కాకుండా ఆనక వినోద కార్యక్రమములు ఏర్పాటు చేస్తారు.

# 3. శ్రీ నాగయ్యమ్మ

కొణతల దర్గినాయుడు గారి అమ్మాయి అయిన శ్రీ నాగయ్యమ్మకు ఏడవ ఏటనే శ్రీ కాండ్రేగుల బలతాతగారి అప్పలనాయుడుగారితో వివాహం జరిపించారు. ఈమె రజస్వల కాకుండానే తనువు చాలించినది. చనిపోయిన పిదప నాకు గుండాలు కట్టి పేరంటాలుగా కొలవండని చెప్పినది. ప్రతీ సంవత్సరం ముక్కనుమ మరునాడు ఈమెను ఈ ప్రాంత ప్రజలు భక్తి శ్రద్ధలతో కొలుస్తారు. శ్రీ నాగయ్యమ్మ ప్రతీ వత్సరమూ ఆమెకు కోడలు వరుసదైన శ్రీమతి నారాయణమ్మ గార్కి చిన్నపిల్ల రూపమున గానీ లేదా చిలుక రూపమున గాని కలలో సాక్ష్యాత్కరించి నా సంబరమును జరుపవలెనని వారిని ఆదేసిస్తుంది. ఆమె ఆదేశం అయిన తరువాత ముక్కనుమ వెళ్ళిన మరునాడు నాగయ్యమ్మ పేరంటాలు తీర్థం భక్తి శ్రద్ధలతో జరుపుతారు.

నాగయ్యమ్మ పేరంటాలు పూజ కొరకు పసుపు, కుంకుమ, పళ్ళు, పూలు, ప్రసాదములు మొదలగు పూజా సామాగ్రి మొత్తము నాగయ్యమ్మగారి పుట్టింటి వారైన కొణతాల వారు నాగయ్యమ్మ అత్తవారింటి వారైన కాండ్రేగుల వారింటికి తీసుకువచ్చి మొత్తం అందరూ కలిసి ఆమెను భక్తి శ్రద్ధలతో కొలుస్తారు. అంతియే గాక ఆమెను భక్తి శ్రద్ధలతో కొలిచినవారిని ఆ తల్లి కరుణగా చూచి కోరిన కోర్కెలు తీర్చుతుందని నాగయ్యమ్మ భర్తగారైన బలతాతగారి అప్పలనాయుడు కుమారుడు (ద్వితీయ వివాహం ద్వారా జన్మించినారు) శ్రీ కాండ్రేగుల కొండబాబు చెప్పారు.

# 4. అమ్మాజమ్మ

పీలా అప్పలనాయుడు రాముడమ్మల ముద్దుల పుత్రిక శ్రీ అమ్మాజమ్మ. ఈమె 1930వ దశకంలో జన్మించినది. ఈమెకు బాల్య వయస్సులోనే శ్రీ బుద్ధ కృష్ణారావు నాయుడుగారితో వివాహం జరిగింది. ఈమె 15వత్సరాల వయస్సులోనే కన్నుమూసినది.

ఆమె తనువు చాలిస్తూ నాకు కోట కట్టించి పూజలు చేయవలెనని చెప్పినదట. కాని ఆమె మాటలు లక్ష్యపెట్టకుండా ఆమె తండ్రిగారు ఆమెకు ఏవిధమైన కోట (గుడి)ని కట్టించలేదు. అలా కట్టించని కారణంగా అమ్మజమ్మ తండ్రికి కాళ్ళు చేతులు చచ్చుబడిపోయినవట. తప్పను తెలుసుకున్న అమ్మాజమ్మ తండ్రి పిదప కొంత కాలానికి అమ్మాజమ్మకు కోట కట్టించినారు. ఇది అనకాపల్లి గవరపాలెంలో గల చినరామస్వామి కోవెల దగ్గరలో కలదు. ఆ కోట కట్టిన తర్వాత అమ్మాజమ్మ తండ్రికి పూర్తిగా నయమయినది. అప్పటి నుండి ప్రతీ సం॥ము బోగి పండుగ వెళ్ళిన 6వ రోజున అమ్మాజమ్మ కోట వద్ద వేడుకలు ఇక్కడ స్థానికులు ఆమె కుటుంబ సభ్యులు భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తున్నారు. ఈ వేడుకనాడు భజనలు, గంగిరెద్దు సేవలు మొదలగునవి విధిగా నిర్వహిస్తారు.

# 5. అచ్చమ్మ

శ్రీ అచ్చమ్మ పేరంటాలు అనకాపల్లి పెదరామస్వామి కోవెల దగ్గర వెలసియుంది. ఈమె బొడ్డేడవారి ఇంట జన్మించింది. ఈమెకు చిన్న వయస్సులోనే దాడి సీతయ్యగారి కుమారుడైన దాడి నూకరాజుతో వివాహం జరిగింది. పెళ్ళి జరిగిన కొద్ది కాలానికే అచ్చమ్మ మరణించినది. ఈమె చనిపోయిన పిదప పేరంటాలుగా కొలవబడుతుంది. గత మూడు తరాలుగా ఈమె పేరంటాలుగా పూజలందుకొంటున్నప్పటికి ఈమె పుట్టింటి వారు కాల గర్భంలో కలిసిపోవడమో మరి ఏ కారణం వలనో ఈమెను మధ్యలో కొంత కాలం పూజించడం మానివేసారు. కాని తర్వాత ఆమె అత్తింటి వారైన దాడివారు ఈమెను పేరంటాలుగా గత 50 సం॥లుగా ప్రతీ సం॥ భోగీ వెళ్ళిన 7వ రోజున సంబరం నిర్వహిస్తున్నారు.

అచ్చమ్మ తన సంబరానికి ముందుగానే ఎవరో ఒకరు ఆమె కుటుంబ సభ్యులపై వాలి పండుగ చేయవలసిందిగా చెపుతుంది. ఆ విధంగా ఆమె చెప్పిన ప్రకారం వారు పండుగ చేస్తారు. ఈ అచ్చమ్మ పేరంటాలు కోరిన కోర్కెలు తీరుస్తుందని ఈమెను ఆరాదిస్తున్న భక్తుల ప్రగాఢ విశ్వాసం. ఈమె సంబరం రోజున పసుపు, కుంకుమలను, పూలు, ఫలాలను సమర్పించి ఈ ప్రాంత ప్రజలు ఆమె కుటుంబ సభ్యులు అందరూ ఆమెను కొలుస్తారు. ఈ అచ్చమ్మ పేరంటాలు పండుగ నిర్వాహకులుగా దాడి నాగేశ్వరరావు, దాడి జగన్నాథరావులు వ్యవహరిస్తున్నారు.

# సంతోషిమాత



సంతోషిమాత దేవాలయం 1978లో గవరపాలెంలో నిర్మించారు. మొదట ఇప్పుడు సంతోషిమాత గుడిఉన్న స్థలంలో ఒక చిన్న పాక ఉండేది. అందులో విఘ్నేశ్వర స్వామిని పూజించేవారు. ఒకనాడు స్త్రీలంతా భజన చేయుచుండగా అప్పలనరసమ్మ అను ఆవిడ బిగ్గరగా నవ్వడం ప్రారంభించింది. అందరూ ఆశ్చర్యపడి భజనను ఆపి వేశారు. అప్పల నరసమ్మ ఆవిధంగా చాలాసేపు నవ్వుతూ గిర్రున గుండ్రంగా తిరిగేది. ఈ విధంగా రెండు నెలలపాటు భజన సమయంలో ఆవిడ నవ్వడం గిర్రున తిరగడం చేసింది. అపుడు ఏమిటి నవ్వడం గిర్రున తిరగడం ఈ విధంగా నవ్వుతూఉందని చెప్పి ఆవిడను పదే పదే ప్రశ్నించగా నేను సంతోషిమాతను, ఇక్కడ ఉండి మీ కోర్కెలు తీర్చుదామని అనుకుంటున్నాను. నన్ను ఇక్కడ నిలపండి అని చెప్పిందట. అప్పటికి అనకాపల్లిలో సంతోషిమాతను గురించి ఎక్కువ మందికి తెలియదు. ఒక రూపాయికి సంతోషిమాత ఉన్న అట్ట ఫొటోను తెచ్చి ఆ పాకలో ఉంచి మామూలుగా పూజలు చేసేవారు. సంతోషిమాత ఫోటో పెట్టి పూజలు మొదలు పెట్టిన తరువాత అచ్చియ్యమ్మ నవ్వడం ఆపివేసి నిత్యం సంతోషిమాత పూజలు జరిపేది. కొన్ని సంవత్సరాల తరువాత భక్తులవద్ద నుండి విరాళాలతో, కొంతమంది పెద్దల ధన సహాయంతో సంతోషిమాత

ఆలయ నిర్మాణాన్ని ప్రారంభించారు. ఆలయ నిర్మాణానికి మద్దాల అప్పలనాయుడు గారు శంఖుస్థాపన చేశారు. 1978లో గుడి నిర్మించారు. విగ్రహం జి.ఎల్లయ్యగారు తయారు చేశారు. సంతోషిమాతను దర్శించుకోవడానికి సుమారు రెండువేల మంది ప్రజలు వస్తారు.

మొదట సంతోషిమాత వ్రత విధానాన్ని పెంటకోట సన్నమ్మ చెప్పారు. కొమ్ముశెనగలు, బెల్లం, పచ్చిముకిరీలు, నైవేద్యంగా పెడతారని ఆమె చెప్పారు. సంతోషిమాతకు ప్రతిరోజూ రెండు పూటలా పూజలే కాకుండా ప్రతి శుక్రవారం ప్రత్యేక పూజలు జరుగుతాయి. కొంతమంది స్త్రీలు శుక్రవారం వ్రతం చేపడతారు. తాము ఎన్ని వారాలు మొక్కుకుంటే అన్ని వారాలు వ్రతం చేస్తారు. వ్రతం పాటించేవారు శుక్రవారాల్లో నిష్టగా ఉండాలి ముఖ్యంగా పులుపు అస్సలు ముట్టుకొనకూడదు. ఉప్పకారాలు తక్కువగా వేసుకోవాలి. ఆకుపచ్చని అరటిపండ్లే తినాలి. మాతకు కూడా ఆకుపచ్చని అరటిపండ్లే నైవేద్యంగా పెట్టాలి. కొబ్బరికాయను కూడా నైవేద్యంగా పెడతారు. తమకు సంతానం కావాలి అని కోరుకున్న స్త్రీలు కొన్ని వారాలు సంతోషిమాత వ్రతం ఆచరించి చివరి రోజు కొంతమంది పిల్లలకు పిండివంటలతో భోజనం పెడతారు. తమ పిల్లలకు వివాహం కావాలి అని మొక్కుకున్న స్త్రీలు కొన్ని వారాల వ్రతం పాటించి చివరి రోజున కొంతమంది కన్నె పిల్లలను పిలిచి తాంబూలం ఇస్తారు. ఈ విధంగా భక్తులు సంతోషిమాతను తమ కోరికలు తీర్చమని వేడుకుంటారు. ఆ విధంగా సంతోషిమాత భక్తుల కోరికలను తీరుస్తూ నమ్మిన వారికి సకల ఆపదల నుండి కాపాడుతుంది.



సంతోషిమాతకు శ్రావణ పౌర్ణమికి 3 రోజులు ఉత్సవాలు చేస్తామని ఆలయ ప్రారంభం నుంచీ పూజారిగా ఉంటున్న శ్రీ కామేష్‌గారు చెప్పారు. మొదట తండ్రిగారు

ఇక్కడ అర్చకులుగా నిర్వహించారు. తరువాత కామేష్‌గారు ఉత్సవ సమయంలో వారి సోదరులు రవి, లక్ష్మీ నారాయణ గార్లు కూడా సంతోషిమాత పూజా కార్యక్రమములు నిర్వహిస్తుంటారు. శ్రావణ పౌర్ణమి నాడు పేరంటాళ్ళు చేతికి రాఖీలు కట్టుకుని మాతకు కుంకుమ పూజ చేస్తారు. ప్రతి శుక్రవారం అనేక మంది స్త్రీలు సంతోషిమాతకు కుంకుమపూజ చేస్తారు. సంతోషిమాత ఆలయ వార్షికోత్సవం ప్రతి ఏడాది డిసెంబరు నెల చివరి వారంలో జరిపిస్తారు. ఆనాడు ప్రత్యేక పూజలు జరిపిస్తారు. ఆనాడు నగర ప్రముఖులు కూడా మాతను దర్శించుకోవడానికి వస్తారు. వార్షికోత్సవము నాడు అనేక ఆధ్యాత్మిక, వినోద కార్యక్రమాలే కాకుండా పేద ప్రజలకు అన్నదానం కూడా జరిపిస్తారు. ఈ విధంగా సంతోషిమాత పై భక్తులు తమ భక్తిని ప్రదర్శిస్తారు. నమ్మిన వారికి సంతోషిమాత ఆయురారోగ్య ఐశ్వర్యాలను ఇస్తుంది.

సంతోషిమాత గ్రామదేవత కాదు. ఈమె భారతదేశమంతటా ఆరాధింపబడుచున్నది. గ్రామదేవతల వలే ఈమెకు జాతరలు మొదలగు ఉత్సవములు నిర్వహింపరు. కానీ ఈమెకు అనకాపల్లి ప్రజలు 1978లో దేవాలయం నిర్మించి ఆరాధించుట వలన ఇందు చేర్చితిని.

# ముగింపు

'అనకాపల్లి పట్టణ గ్రామదేవతలు - ఒక పరిశీలన' అను విషయముపైన పరిశోధన కావించి రూపొందించిన ఈ లఘు సిద్ధాంత వ్యాసము ఎం.ఫిల్ పట్టము కొరకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సమర్పించినది. ఈ లఘు సిద్ధాంత వ్యాసమునకు పర్యవేక్షకురాలు సహృదయులు డా॥ శ్రీమతి కోలవెన్ను మలయవాసిని గారు.

మన ఆంధ్రప్రదేశము పల్లెసీమలకు పుట్టినిల్లు. అటువంటి పల్లెలు ఎల్లప్పుడూ సంస్కృతీ సంప్రదాయాలతో కళకళలాడుతుంటాయి. వారి ఆచారాలు, నమ్మకాలు మిక్కిలి బలీయమైనది. ప్రతి గ్రామీణుడు వారి గ్రామం ఈ విధంగా సకల శుభాలతో వర్ధిల్లడానికి వారి గ్రామ దేవతలే కారణమని భావిస్తారు. అందుకే తమ తమ గ్రామ దేవతలు వారి గ్రామంపై ఆగ్రహం వహించకుండా ఉండేందుకు ఆమెకు నిత్యం కానుకలు సమర్పిస్తూ ఘనంగా జాతరలు, ఉత్సవాలు జరిపిస్తూ వారి గ్రామ దేవతల అనుగ్రహం పొందుతారు. ఈ విధంగా ప్రతి గ్రామంలోని గ్రామదేవతలు ఉంటారు. గ్రామ దేవతలు లేని గ్రామం ఉండదు. గ్రామదేవతారాధన ప్రాచీనకాలం నుండి వచ్చుచున్న ఆచారము. అయితే గ్రామీణులు ఎక్కువగా నిరక్షరాస్యులుగా ఉంటారు. అందుకే వారు దేవతలను పూజించే విధానం, ఆ దేవతలు వారిపై ఏ విధంగా అనుగ్రహం కలిగి వుంటుంది. తమ కోరికలను ఏవిధంగా తీర్చుతుంది? అసలు ఆయా గ్రామ దేవతలు ఎలా ఆవిర్భవించారు? అనేటువంటి విషయాలను ఒకరు చెప్పగా మరియొకరు తెలుసుకొనుటయే కానీ లిఖిత పూర్వక ఆధారాలు ఏమీ లేవు. అందుచేతనే నేను పుట్టి పెరిగి, విద్యాభ్యాసం గరపినటు వంటి మా అనకాపల్లిలో గల గ్రామ దేవతలు గురించి మా తరం వారికే కాకుండా

తరువాతి తరాలకు తెలియ జేయుటకు గాను నాకు సాధ్యమయినంత వరకు విషయ సేకరణ చేసి అక్షర రూపం కల్పించాను.

మా అనకాపల్లి పట్టణంలో నూకాలమ్మ, మరిడమ్మ, నత్తెమ్మ, పోలమాంబ, గంగపరదేశమ్మ, గవరపాలెం గౌరమ్మ, కుంచావారివీధి గౌరమ్మ, వేల్పులవీధి గౌరమ్మ, సంతోషిమాత మొదలగు గ్రామదేవతలే కాకుండా దుర్గచ్చమ్మ, మల్లమ్మ మొదలగు పేరంటాళ్లు కూడా ఉన్నారు.

ఈ నాటికే అనేకమంది గ్రామదేవతల మీద పరిశోధన చేసి ఉన్నారు. కానీ అనకాపల్లి గ్రామదేవత మీద ముఖ్యంగా ఆంధ్రప్రదేశంలో ప్రసిద్ధి గన్న నూకాలమ్మను గురించి ఎవరూ పరిశోధన చేయకుండా ఉండటమూ, ఆ సదవకాశము నాకు లభించడమూ నా పూర్వజన్మ సుకృతముగా భావిస్తున్నాను. నా యీ స్వల్ప పరిజ్ఞానము, కృషితో కొంత వరకూ విషయ సేకరణ చేయగలిగినాను. ఇంకా ఏమైనా వ్రాయవలసి ఉండి దానిని వ్రాయలేకపోయినట్లయితే పెద్దలు నన్ను సహృదయంతో మన్నించాలని సవినయ పూర్వకముగా ప్రార్థిస్తున్నాను.

# అధ : సూచికలు

**అధ్యాయము I :**

అనకాపల్లి మండల చరిత్ర - ఆంధ్రప్రభ అనకాపల్లి నూకాలమ్మ జాతర ప్రత్యేక అనుబంధము, తేది : ౹౨౨౩

**అధ్యాయము II :**

అనకాపల్లి డైరెక్టరీ :

ఉష్ణోగ్రత, శీతోష్ణస్థితి, వర్షపాతం, జనాభా మొదలగు వివరములు అనకాపల్లి మునిసిపాలిటీ అధికారుల వద్ద నుండి సేకరించితిని.

**అధ్యాయము III :**

ఈ గ్రామదేవతారాధన ప్రారంభదశ - వికాసము అను ఈ విభాగమునందలి విషయములు - ఆచార్య నాయని కృష్ణకుమారి గారి జానపద గేయగాథలు-సాంఘిక చరిత్ర, డా. రావి ప్రేమలతగారి జానపద సాహిత్యము-పురాణగాథలు అను గ్రంథములను ఆధారముగా చేసికొని రచించితిని.

**అధ్యాయము IV :**

గ్రామదేవతల ఆరాధనా విధానము - మతాతీతమైనట్టిది గ్రామదేవతారాధన అను ఈ విభాగమందలి విషయములు - ఆచార్య నాయని కృష్ణకుమారి గారి జానపద

గేయగాథలు అను గ్రంథమునుండి ఎల్దండ రఘుమారెడ్డి గారి పల్లెపదాల్లో ప్రజా జీవనము అను గ్రంథము నుండియు, మరికొన్ని యితర విషయములను అనకాపల్లి ప్రజల వద్ద నుండియు సేకరించితిని.

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. అనకాపల్లి డైరెక్టరీ - జూన్ 1972.

2. ఆంధ్ర మహాభారతము - ఉద్యోగ పర్వము - తిక్కన సోమయాజి.

3. ఆంధ్రుల జానపద విజ్ఞానము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1983

4. జానపద గేయ గాథలు - సాంఘిక చరిత్ర - డా. బి.రామరాజు, డా॥ నాయని కృష్ణకుమారి.

5. తెలుగు జానపద గేయగాథలు - డా. నాయని కృష్ణకుమారి.

6. తెలుగు జానపద సాహిత్యం - పురాణగాథలు - డా. రావి ప్రేమలత.

7. పరిశీలన - డా. నాయని కృష్ణకుమారి, 1977.

8. పల్లెపదాల్లో ప్రజాజీవనము - యెల్దెండ రఘుమారెడ్డి.

9. పాండురంగ మహాత్మ్యము - తెనాలి రామకృష్ణుడు.

10. బసవ పురాణము - పాల్కురికి సోమన.

11. వీరవాసరం మండల గ్రామదేవతల జానపద విజ్ఞాన విశ్లేషణ - సిద్ధాంత వ్యాసము.

12. వేద వాఙ్మయము - శ్రీ తిరుమల శ్రీనివాస శర్మ.

13. శాలివాహన గాథాసప్తశతీసారం - రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, 1964.

# అనుబంధం - I

## నూకాలమ్మ పుట్టుకథ



కలియుగం రాక ముందే కేతరం పుట్టింది తరువాత దీపారం పుట్టింది తరువాత ఓంకారం పుట్టింది తరువాత మయోకారం పుట్టింది. తరువాత కలియుగం పుట్టింది. చెట్టులేదు చేమలేదు కొండలు లేవు, పర్వతాలు లేవు కల్పకృక్షం లేదు, కామివృక్షం లేదు ధరణి లేదు ఆకాశం లేదు సంద్రాలు లేవు, నరమానవుడు లేడు ఆదిశక్తో ఓం' అను శబ్దంతో పుడుతుంది అది చిన్నది అలా పెద్దదవుతుంది. దానికి 12 సం.ల ప్రాయం వచ్చింది. దీనికి మదమత్సరాలు, కళ్ళకావరాలు ఎక్కువయ్యి అది కొవ్వుగొట్టంపై పాడుతుంది. ఎలుగుబంటి వర్ణమున్న కురులు విస్తరించి, తరచురొక పాడ జూస్తుంది. ప్రపంచంలో ఎవరూ లేరు. పైరుగాలి తగిలి పుల బారింది. కొద్ది రోజులకై మూడు నెలల నాడు ఆడరూపు ఏర్పడినది. ఆరు నెలల నాటికి బారు ఏర్పడింది తొమ్మిది నెలల నాటికి ఆడరూపు ఏర్పడింది. చెట్టు లేదు, చేమ లేదు, కొండలు లేవు, పర్వతాలు లేవు కల్పకృక్షం లేదు, కామి వృక్షం లేదు ధరణి లేదు, ఆకాశం లేదు చెట్టైనా పెడుదును పుట్టైనా పెడుదును, గూడైనా కడుదును కొండుంటె లాండైనా చేయుదురు మీది రెప్ప గుడి గడుతుంది. కింది రెప్ప పట్టు గడుతుంది. కొంత దినం వెల్లనిచ్చాక మూడు గుడ్లెడుతుంది కండెకోడిపెట్ట ఏ మాదిరి పెట్టిన శక్తి ఆ విధంగా గుడ్లు పెట్టింది. అందున ఒక గుడ్డు కాలు తగిలి పగిలి పోయింది. ఇంక రెండు గుడ్లు ఉన్నాయి. తిరు మూడు లోకాలు పారజూస్తుంది ఎలుగువంటి వర్ణాన కురులిప్ప జూస్తుంది రెండు గుడ్లపై అడుగుపెడుతుంది కొంత కాలానికి జోడు గుడ్డులోని పాకానికి వచ్చిన గుడ్డు పగిలి పోతుంది. మీది పెంకు ఆకాశంగా కింది పెంకు భూలోకం అయినది. అటు నిటు ఉన్న

చిన్న పెంకులు చిన్న కొండలు, పెద్ద పెంకులు పెద్ద కొండలూ ఆ పాటి పెంకులూ మామూలు పర్వతాలు, దానిమయాన్న పుల్లాటు సప్త సముద్రాలుగా ఏర్పడింది. నూటతొంబై కోట్ల జీవరాశులూ, చెట్టూ చేమా, పుట్ట, నక్షత్రాలు, సూర్య చంద్రాదులు ఏర్పడ్డాయి. ఇంకా ఒక గుడ్డుంటాది ఆ ఒంటి గుడ్డు మీద ప్రాణం పెడుతుంది. ఆ ఒంటి గుడ్డు కూడ కొంత కాలానికి పగులుతుంది. అందువల్లని ముగ్గురు రాజులు పుడతారు. వారే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కొంతకాలం ఎల్లనిచ్చాక ఊరు లేని పాథి మీన పన్నెండు సీరల పంకటుయ్యాల కడుతుంది ముప్షై అయిదు సీర్ల మువ్వలుయ్యాల, నలభై సీర్ల తొడుయ్యాల, యాభై సీర్ల ఎండుయ్యాల ఏభై సీర్ల తొంటియ్యాల కడుతోంది. ఈ ఉయ్యాలలో పసిబాలున్నేస్తుంది.

ఇంట్నించి ఊగితే తూరుపు మోస్తది

అట్నుంచి ఊపితే పడమర మోస్తది

ఒక పక్క ఊపితే ఉత్తరం మోస్తది

మరో పక్క ఊపితే దక్షిణం మోస్తది.

పన్నెండు సీర్ల పంకటుయ్యాలలో ఆదిశక్తి జోలపాడుతూ ఊపుతాది. తోడి ఉయ్యాలల్లో బాలు నిద్ర పోతారు నాకు కడుపార అన్నం లేదు. కంటార కునుకు లేదు. బండెడు పేగుల బైటేసి కన్నాను. పుట్టెడు నెత్తురు భూమిపాల చేసాను. యాపుచ్చేలు ఆహారాన్ని కని పోతది. ఆయాబుయపేల కోరకుంబాలు సేమకూర కుంబాలు సదిరి మెట్టలు ఓరి కూర కుంబాలు గడ్డిమెట్ట పాడుగు కొర్రకూర కుంబాలు కొండల పాడుగు అది కూర కుంబాలు వడ్లిమెట్ట పొడుగు కుంబాలు పనద్దార పర్వతం, మాడుగుల పర్వతం అంత తొలి బుక్క తీస్తది, రెండో బుక్క తీస్తది మూడు బుక్క తీయబోవు సరికి గోలగోలమని గోరపెట్టలా ఏడుస్తారు. వాలల ఆందోళన తల్లి ఆలకించింది. వచ్చిన తోవన మళ్లీ ఎల్లింది. ఆ గోల పెట్టిన బాలల్ని హస్తమున చెంగుమని అందుకుంటుంది. తల్లి సంకపాలు తనువుగా పెడతాది ఈ బాలల చెక్కిళ్లు చేరి ముద్దాడుతుంది. అక్కున చేర్చి పూలు ముద్దాడుతుంది.

ఆ తల్లి చీపురు పట్టుకొని కోట తుడుస్తాది ఈ బాలలు మోకాలు మో చేతులతో తల్లి చుట్టూ బంగురుతారు. ఈ బాలలకు తల్లి ఆదిశక్తి యెండి గిన్నెలో యెన్న పెడుతాది. పైడి గిన్నెలో పాలు పోస్తాది గుండ్రపు గిన్నెలో అన్నం పెడతాయి బొజ్జల మోయ కొడుకులు భోం చేస్తారు చేయికడుక్కుని కోటలోనికి ఎలతారు. కొంతకాలం ఎల్లనిచ్చాక ఆ తల్లి ఆదిశక్తి సదువుకు పట్నం పంపుతాది. ఆ బాలలు గురువుగారు ఈడకూకోండి సదువు సెపుతానంటాడు. అలగురువు ఒకటి సెపితే ఆ రోజులు తిరగేసి మూడు సెపుతారు. అపుడు ఆ గురువుగారు మీ తల్లి ఎవరు తండ్రి ఎవరు అని అడుగుతారు అపుడు ఆ బాలలు మా తండ్రి ఎవరో తెలియదు తల్లి ఆదిశక్తి అని చెపుతారు అయితే అపుడు ఆ గురువుగారు బాబూ మీకు నేను సదువు సెప్పలేనని అంటారు. అపుడు కొడుకులు ముగ్గురూ తల్లి కాడికి ఎలతారు. కొంత దూరం వచ్చాక ఆలోచన చేస్తారు. అమ్మా నీ

పానం ఉన్నపుడే మా ముగ్గురు అన్నదమ్ములకు మూడు భాగాలు చెయ్యమని అడగాలని ఆలోచన చేసికొని తల్లి దగ్గరకి వస్తారు ఆదిశక్తి వచ్చిన కొడుకుల కన్నులను చూస్తది నల్లకూరలు నవకాయ పిండివంటలతో కొడుకులు ముగ్గురికీ అన్నం పెడుతుంది. అమ్మ నీ ప్రాణం ఉన్నపుడే నీ చేతితో మూడు భాగాలు చెయ్యమని తల్లికి చెబుతారు. అపుడు ఆదిశక్తి బాబూ మీకు భాగాలు చేస్తాను. కానీ మీ విద్యా చదువు బుద్ధి నా దగ్గర చెప్పండి మీకు భాగాలు సేత్తాను అని తల్లి చెపుతుంది. అపుడు తల్లి భూమి, భూలోకం, బ్రహ్మకి, కొండలు పెండలు కొర్రగిరి పర్వతాలు విష్ణువికి బురపాడ సంద్రం ఈశ్వరునికి ఇస్తుంది. ఎవరి భాగం పట్టుకు వారు వెళతారు. అయితే శక్తి కొంతకాలం వెళ్లనిచ్చాక కొవ్వి గొబ్బురై పాడతాది. తిరు మూడు లోకాలు తిరిగి చూస్తది మూడోనేత్రంతో తిరిగి సూస్తది తిన్నగా బ్రహ్మ వద్దకు ఎల్తాది బ్రహ్మ వచ్చిన తల్లిని చూసి చెంబుతో నీళ్ళు తల్లికిస్తాడు తల్లి అను మాట త్వరలో మాను అని తల్లి అంటుంది. అమ్మ అను మాట నీ జిమ్మంటమాను. నా తోటకేళీ విలాసాలు, వ్రతకాలందు అమ్మా నీతోటి కల్యాణం అందనందుకు నావల్లకాదు. నాపైనాడి పెక్కులు పేలిపోతుంది నీతోటి కేళీ విలాసాలు వృతకాలు అందలేను నన్ను ఉండిస్తే ఉండీ లేకుంటే తీసుకుపో అంటాడు మూడో నేత్రంతో తీక్షణంగా చూస్తది ఆ బ్రహ్మ బుగ్గనిస్వర్ణం అయిపోతాడు తిన్నగా విష్ణువు కాడికెల్లది దండి గుమ్మం కాడ దర్బారు కొడదరి చేరుకుంటాది. అమ్మనువ్వు ప్రేమతో గన్నావు. ఎండతో వచ్చావు ఆ కారణాలేటమ్మ చెప్ప అంటాడు తల్లి అను మాట త్వరలో మాను. అమ్మ అనుమాట నీ జిమ్మందుమాను నీకు తల్లిని గాను తగిన భార్యను నీకు అమ్మను గాను నీ యింటికి ఇల్లాలిని నీపెల్లి భార్యని అని ఆదిశక్తి అంది ఆమాట ఆ మారుమాను అని విష్ణువు అంటాడు. అపుడు శక్తి ఉంటుంటీ. కోడిపెట్టెడు గుడ్లెడతది అందులో పెట్టలెన్ని? పుంజులెన్ని? అందులో పుంజు ఒకటి లేలతాది. ఆ పుంజు ఈ పెట్టని ఏమి చేస్తాది? అయితే అమ్మ అవి నోరు లేనివి. అంత మాటనకు ముందు కోడి నెరతాడు కుట్టనై కున్నాది. ఇంత మాటనకమ్మ. కల్యాణం అందితే ఉండిస్తాను. లేకుంటే తీసుకుపోతాను చంద్రవరాల పేరు చేతబట్టుకుని మూడో నేత్రంతో దేటి చూసింది. నాగబత్తి చేత బట్టింది. ఈ దేటి చూడబోయినప్పటికీ విష్ణువు కూడ భస్మమయ్యాడు అపుడు శక్తి ఈశ్వరుడు కాడికెల్లాది. అమ్మ నువు ప్రేమతో గన్నావు ఎండతో వచ్చావు ఆ కారణాలేటి చెప్పమ్మా అని ఈశ్వరుడు అడుగుతాడు. కుమారుడా నాకళ్ళు కామరాలు కమ్ముకొచ్చినాది. కేళీ విలాసకాలు నాతో వృతకాలందు అన్నది. అపుడు శివుడు సరేనని నీ వద్ద మూడు మైల్లు ఉన్నవని చెప్పాడు. అపుడు శక్తి నా వద్ద మూడు మైల్లు ఏవని చెప్పమంది. అమ్మట నీ పురుటి నాడుపురిటి మైల సవత్త నాడు సవత్తమైల, నెల మైల ఒకటి ఈ మైల్లు పోవాలంటే సముద్రంలో స్నానం చేసిరా అంటాడు. ఎక్కడా గంగ పుట్టకుండా చేస్తాడు ఈశ్వరుడు చెరువులు, సంద్రాలు ఇంకి పోతాయి. శక్తి స్నానం చేయడానికి మూడు నెలలు చెట్టనక చేవనక కొదగిరి పర్వతాలు తిరుగుతాది. ఎక్కడా నీళ్లు పుట్టవు. అపుడు పాండవుల్ని తలుస్తాది. ఉరుములు మెరుపులతో వడగళ్లవానై కురుస్తాది. ఎద్దు పట్టిన అడుగులోని గుల్లతోడి గుల్లనీళ్లు అడుగున ఉంటాయి. శక్తికి ఒంటి నిండా బురద అంటుకుంటుంది. స్నానం అయిపోయిందని మళ్లీ ఈశ్వరుని

కోటకు ఎలుతుంది కళ్యాణం పొందుటకు అపుడు శివుడు అబ్బబ్బా ఇలా ఒంటి నిం
బురదతో ఉన్నావేమి? ఇలా ఉంటే నీతో కల్యాణం అందలేను నేను చెబుతాను ఆలకిం
నేను భూమి గిరి గీస్తాను. అందులో అంతరాలు తంత్రాలు శంకు, చక్రం, నాగచె
మూడోనేత్రం, గీతలోపెట్టు అరికాలి తామర, బొడ్డున పొన్న పువ్వు, ఈపున ఇంచార
కళ్ల చింతామణి, గీతలో పెట్టి మళ్లీ స్నానానికి వెళ్లమన్నాడు. అపుడు సముద్రంలో నీరున్న
చెరువుల్లో నీరు పారుతున్నది. పాల సముద్రంలో చెంగని దూకింది ఎంత వెళ్లి
మోకాలు లోతే శక్తి ముందుకు వెళ్లుతున్న కొలదీ ఎనక సముద్రం పెరిగిపోతున్న
మహానదిలో పడ్డది. గానుగలో చెరుకు పడ్డట్లుగా శక్తి గంగలోకి పడినది శక్తికి ముసి
దానిలాగ నడుం వంగిపోయింది. తాటి పండు వర్ణాన తలపండి పోయి ఊత క
చేత బట్టి వడ వడ వణికినది. మళ్లా కొడుకు ఈశ్వరుని వద్దకు వెళ్లి నాకు ఆక
వేస్తుంది అన్నం పెట్టు అని శక్తి అంటుంది. ఇందాకేమన్నావు ఇపుడేమంటున్నావు
నిన్నుండడానికి వీలు లేదని, అంతరాలు తంతరాలు చేపట్టుకొని మూడోనేత్రంతో దీటు
చూస్తాడు శక్తి బుగ్గున మాడిపోతుంది ఈ కాలిన బుగ్గిమూడు భాగాలుగా చేస్తాడ
ఒక భాగం బ్రహ్మ, విష్ణువులను చేస్తాడు మిగిలిన రెండు భాగాలలో ఒక భాగం ।ఎ
కోట్ల జీవరాశులను చేస్తాడు. మహానదులు, పర్వతాలు సప్త సముద్రాలు, చెట
చుక్కలు, సూర్య చంద్రులు పుడతాయి. మిగిలిన ఒక్క పోగులో ముగ్గురు ఆడపిల్ల
పుడతారు. వారు లక్ష్మి, సరస్వతి, పార్వతి దేవిలు. ఆ ముగ్గురు రాజులుకి ముగ్గుర
భార్యలవుతారు. ఈశ్వరుడు పార్వతిని, బ్రహ్మ సరస్వతినీ, విష్ణువు లక్ష్మిని పె
చేసుకుంటారు. అపుడు ఇద్దరూ ఏకమై అన్నా తల్లిలేని తనువు ఎందుకు ? మనకి
తల్లిని చేయాలంటాడు. అపుడా మిగిలిన బుగ్గిని శక్తిని చేస్తాడు అపుడు ఆ అమ్మ త
నాలుగు చేతులు, రెండు కాళ్లు నోరు నోరులాగ, ముక్కు ముక్కులాగ, కళ్లు కళ్లులా
చేతులు చేతులు లాగ చేస్తాడు. తల్లికి రాజులు ముగ్గురూ కుంబాలు వండుతారు. ఈ
రాజులు ముగ్గురూ పంచరధాలు ఎక్కుతారు. ఈ రథాన్ని రాజులు ముగ్గుర్నీ ఆ త
మింగేయాలనుకుంటుంది. అపుడు ఈశ్వరుడు శూల ఆమె నోటిలోకి విసిరేస్తాడు
అపుడా శక్తితో ఈశ్వరుడు అమ్మ నీవు నూకాలమ్మవైనా నీవే, మరిడమ్మవైనా నీవే
మాంకాళివైనా నీవే. అన్ని పేర్లు నీవే. ఊరికి నాలుగు పేర్లతో పుట్టుకో, ఎన్ని పేర్లైన
పెట్టుకో, నీ పేరు చెప్పి కొందరువేట ఏస్తారు. కొందరు కోళ్ళు కోస్తారు. కొందరు పళ
పలారాలిస్తారు. కొందరు కోకలెడతారు. పేరు నీది తిండం వాళ్లు. నీకు ఎంత సేపు అ
మీద గుగ్గిలమే. పసుపు కుంకుమలే నీకు ఆహారం ఎరపాడ సముద్రాలు ఇడిచి పెడతార
ఇలమర్రిచెట్లు, చెట్టుక్రింద ఉంది ఉగ్గోరపుట్ట ఆ పుట్టలో పుట్టేది డక్కోర బరిణీలు డక్కో
బరిణిలో జోడు తొమ్మిదులు పుట్టల్లో పుట్టింది పాములపెట్టి. ఈ పాముల పెట్టిలో పన్నెండ
నాగ శిరసులు ఈ రాజులు ముగ్గురూ అమ్మవారిని తీసుకువెళ్లి ఆ శక్తిని పా
సముద్రంలో విడిచి పెడతారు. అమ్మ ! ఇది ఉగ్గోర పుట్ట నీ స్థానం ఇక్కడే. నీ స్థాన
ఇక్కడే అని విడిచిపెడతారు. విడవగానే పుట్టలోకి నూకాలమ్మతల్లి వెళుతుంది. అపుడ
ఓరుగంటి రాజులు, కలియుగ భేతాళుడు సాయంపు రాజులు ఈ దేవతను కొలుస్తార
ఈ ముగ్గురు రాజులు అలాగని ఓరుగంటి పట్టణం తీసుకొని వెళతారు. ఓరుగంట

రాజులు, కళింగ, భేతాళుడు సాయంపురాజులు, ఆది బేతరాజు నలుగురూ ఒక తల్లి పుత్రులు. అందరిలోకి సాయంపురాజు పెద్దవాడు. ఈ పట్టణంలో రాత్రే పగలు, పగలే రాత్రిలాగ ఉంటాది. రాజుల తోడపుట్టింది ఇలకోడి కలకోడి ఆ పెట్ట కొక్కొరోమని కోత ఎర్రగల దేవత ఏలాకానవుందో ! ఆ దేవతను మన సంజీవి పర్వతాన్న నిలుపుదాం డప్పల తోటి డమాలతోటి డప్పల పదారువేలు దండుమూడువేలు మందుగుండు సామాను మేళ తాళాలతో దేవతను తీసుకున్నందుకు రాజులు, బాకు, బల్లాలతో కదిలి దండు కందిరీగల పుట్ట. ఈ నూకాలమ్మ తల్లి కాడికి ఈ నలుగురు రాజులు దండి సైన్యంతోటి బయలు దేరుతున్నారు. కదిలితే దండు కందిరీగలపుట్ట ఓళ్లపై వెళ్లేవారు ఓళ్లపై, బోట్లపై వెళ్లేవారు బోట్లపై వెళుతున్నారు. అపుడు నూకాలమ్మ తల్లి అంటది. మీది ఏవూరు? ఏపల్లి? ఎందుకొచ్చారు? ఆవచ్చిన కారణం ఏమిటి ? అమ్మా, పట్టణవాసం రాత్రి పగలుగా, పగలు రాత్రిలా ఉంటుంది. దేవతల తలంపు లేదు. నిన్ను మేము తీసుకువెళ్లి సంజీవ పర్వతం పై నిలుపుతాము. నీ కొంగు బంగారమై కొలుచుకుంటాం. ఎత్తైబత్తైలు చేస్తాం నిత్య పూజలు చేస్తాం, ఏటలు కూతో, తోడలతో నీకు సంబరాలు చేస్తాం ఏటలే ఇస్తాము, ఎనుబోతులు ఇస్తాము, రంగైన కుంకాల రాశిపోసిస్తాము. నీ కొంగు బంగారం కోరినిన్ను కొలుచుకుంటాం. కొంతకాలం ఎల్లనిచ్చాక నలుగురు రాజులలోకి ముగ్గురు రాజులు కలాంతరం అయిపోతారు. ఈ కోటలో సాయంపురాజు ఒక్కడే ఉంటాడు. ఈ నూకాలతల్లి కొడికి ఎల్తాడు. అమ్మా నీ తపస్సులు చేసినట్టివారు కాలాంతరం అయిపోయారు. నీ బలాలు పట్టికోళ్లు కాలాంతరం అయిపోయారు. నేను చూస్తే ఒక్కడినే ఉన్నాను. కొంతకాలం ఎల్లనిచ్చాక నీ భార్య సాదేవి 'గర్భంలోంచి చక్కని ఈరభట్టాపురం రాజు జన్మిస్తాడు. అక్కడి కోటలూ పేటలూ నువ్వేటి ఏలుతున్నావు? ఆ రాజు మంచి వరపుత్రుడయిపోతాడు. రాజు జన్మించాక తమ ఊరు రుబేమ్మలు (బ్రాహ్మణులు) తమ్మోరు బేమ్మలు తమవద్ద ఉంటారు. నక్షత్రాలు ఏడినట్లు మంచి రోజునాడు పసిబాలుడు పుడతాడు వీరబ్రహ్మవారూ మీరూ పంచల్ని పడిగట్టండి. ఇది అవునో కాదో కాయో? పండో మీరు నాతో చెప్పండి పేదపంచికాలు పడికడుతున్నారు. సాయంపురాజు సాదేవి గర్భం నుండి వీర పుట్టావురం రాజు జన్మిస్తాడు. పుట్టీపుడతుండగానే ఈ దేవాది దేవతలు, సూర్యకోటి దేవతలు, అష్టదిపాదికులు, పంచకుడి పాండవులు, ఈ దేవతలందరూ కలిసి ఓరుగల్లు బయలు దేరతారు. రాజుకి పన్నెండు సేర్ల పరికటుయ్యాలు రాజుకి ముప్పై సేర్ల నువ్వలుయ్యాలు యాభై సేర్ల ఎండుయ్యాల కడతారు. ఆ బాలణ్ణి ఈ ఉయ్యాల్లో ఏసి పట్టుకుని ఈ దేవాది దేవతలు, సూర్యకోటి దేవతలు, పంచకోటి దేవతలు ఆ ఉయ్యాల ఊపుకుంటూ జోలపాటపాడతారు. ఇటునుండి ఊపితే ఇంద్రుడు అటునుండి ఊపితే చంద్రుడు మోస్తాడు ఆ రాజుకి పేర్నాంకాలు చేస్తారు సీతమ్మ చిక్కు, రావణ బాణారం అనుమంతు బోదారం, ఇటువంటి పేర్నాంకాలు పెట్టారు. ఎవరన్నపట్నం వారు ఎవరున్న కోటకాళ్లు ఎల్లి పోతారు. ఆ రాజు ఇంతై అంతై పెరిగి ఆ రాజుకి 12 సం. ప్రాయం వచ్చింది. అతడు 12 పట్టరాదేవిలుతో కళ్యాణం అందాడు. విష్ణులోకం దేవలోక బ్రహ్మలోకంతబు చేస్తున్నాడు. కొంతకాలం ఎల్లనిచ్చాక అగ్గిమీద గుగ్గిలం లేదు. గుళ్లో దీపం లేదు. మనుషుల్లో మావుబోతుంది

కోటకు ఎలుతుంది కళ్యాణం పొందుటకు అపుడు శివుడు అబ్బబ్బా ఇలా ఒంటి నిండా బురదతో ఉన్నావేమి? ఇలా ఉంటే నీతో కల్యాణం అందలేను నేను చెబుతాను ఆలకించు నేను భూమి గిరి గీస్తాను. అందులో అంతరాలు తంత్రాలు శంకు, చక్రం, నాగచెత్తు, మూడోనేత్రం, గీతలోపెట్టు అరికాలి తామర, బొడ్డున పొన్న పువ్వు, ఈపున ఇంచారం, కళ్ల చింతామణి, గీతలో పెట్టి మళ్లీ స్నానానికి వెళ్లమన్నాడు. అపుడు సముద్రంలో నీరున్నది. చెరువుల్లో నీరు పారుతున్నది. పాల సముద్రంలో చెంగని దూకింది ఎంత వెళ్లినా మోకాలు లోతే శక్తి ముందుకు వెళ్లుతున్న కొలదీ ఎనక సముద్రం పెరిగిపోతున్నది. మహానదిలో పడ్డది. గానుగలో చెరుకు పడ్డట్లుగా శక్తి గంగలోకి పడినది శక్తికి ముసిలి దానిలాగ నడుం వంగిపోయింది. తాటి పండు వర్ణాన తలపండి పోయి ఊత కర్ర చేత బట్టి వడ వడ వణికినది. మళ్లా కొడుకు ఈశ్వరుని వద్దకు వెళ్లి నాకు ఆకలి వేస్తుంది అన్నం పెట్టు అని శక్తి అంటుంది. ఇందాకేమన్నావు ఇపుడేమంటున్నావు? నిన్నుండడానికి వీలు లేదని, అంతరాలు తంతరాలు చేపట్టుకొని మూడోనేత్రంతో దీటుగా చూస్తాడు శక్తి బుగ్గున మాడిపోతుంది ఈ కాలిన బుగ్గిమూడు భాగాలుగా చేస్తాడు. ఒక భాగం బ్రహ్మ, విష్ణువులను చేస్తాడు మిగిలిన రెండు భాగాలలో ఒక భాగం ౧౨౦ కోట్ల జీవరాశులను చేస్తాడు. మహానదులు, పర్వతాలు సప్త సముద్రాలు, చెట్లూ, చుక్కలు, సూర్య చంద్రులు పుడతాయి. మిగిలిన ఒక్క పోగులో ముగ్గురు ఆడపిల్లలు పుడతారు. వారు లక్ష్మీ, సరస్వతి, పార్వతి దేవిలు. ఆ ముగ్గురు రాజులుకి ముగ్గురూ భార్యలవుతారు. ఈశ్వరుడు పార్వతిని, బ్రహ్మ సరస్వతినీ, విష్ణువు లక్ష్మీని పెళ్లి చేసుకుంటారు. అపుడు ఇద్దరూ ఏకమై అన్నా తల్లిలేని తనువు ఎందుకు ? మనకో తల్లిని చేయాలంటాడు. అపుడా మిగిలిన బుగ్గిని శక్తిని చేస్తాడు అపుడు ఆ అమ్మ తల్లి నాలుగు చేతులు, రెండు కాళ్లు నోరు నోరులాగ, ముక్కు ముక్కులాగ, కళ్లు కళ్లులాగ చేతులు చేతులు లాగ చేస్తాడు. తల్లికి రాజులు ముగ్గురూ కుంబాలు వండుతారు. ఈ రాజులు ముగ్గురూ పంచరధాలు ఎక్కుతారు. ఈ రథాన్ని రాజులు ముగ్గుర్నీ ఆ తల్లి మింగేయాలనుకుంటుంది. అపుడు ఈశ్వరుడు శూల ఆమె నోటిలోకి విసిరేస్తాడు. అపుడా శక్తితో ఈశ్వరుడు అమ్మ నీవు నూకాలమ్మవైనా నీవే, మరిడమ్మవైనా నీవే, మాంకాళివైనా నీవే. అన్ని పేర్లు నీవే. ఊరికి నాలుగు పేర్లతో పుట్టుకో, ఎన్ని పేర్లైనా పెట్టుకో, నీ పేరు చెప్పి కొందరువేట ఏస్తారు. కొందరు కోళ్ళు కోస్తారు. కొందరు పళ్లు పలారాలిస్తారు. కొందరు కోకలెడతారు. పేరు నీది తిండం వాళ్లు. నీకు ఎంత సేపు అగ్ని మీద గుగ్గిలమే. పసుపు కుంకుమలే నీకు ఆహారం ఎరపాడ సముద్రాలు ఇడిచి పెడతారు. ఇలమర్రిచెట్లు, చెట్టుక్రింద ఉంది ఉగ్గోరపుట్ట ఆ పుట్టలో పుట్టేది డక్కోర బరిణీలు డక్కోర బరిణిలో జోడు తొమ్మిదులు పుట్టల్లో పుట్టింది పాములపెట్టి. ఈ పాముల పెట్టిలో పన్నెండు నాగ శిరసులు ఈ రాజులు ముగ్గురూ అమ్మవారిని తీసుకువెళ్లి ఆ శక్తిని పాల సముద్రంలో విడిచి పెడతారు. అమ్మ ! ఇది ఉగ్గోర పుట్ట నీ స్థానం ఇక్కడే. నీ స్థానం ఇక్కడే అని విడిచిపెడతారు. విడవగానే పుట్టలోకి నూకాలమ్మతల్లి వెళుతుంది. అపుడు ఓరుగంటి రాజులు, కలియుగ భేతాళుడు సాయంపు రాజులు ఈ దేవతను కొలుస్తారు. ఈ ముగ్గురు రాజులు అలాగని ఓరుగంటి పట్టణం తీసుకొని వెళతారు. ఓరుగంటి

రాజులు, కళింగ, భేతాళుడు సాయంపురాజులు, ఆది బేతరాజు నలుగురూ ఒక తల్లి పుత్రులు. అందరిలోకి సాయంపురాజు పెద్దవాడు. ఈ పట్టణంలో రాత్రే పగలు, పగలే రాత్రిలాగ ఉంటాది. రాజుల తోడపుట్టింది ఇలకోడి కలకోడి ఆ పెట్ట కొక్కొరోమని కోత ఎర్రగల దేవత ఏలాకానవుందో ! ఆ దేవతను మన సంజీవి పర్వతాన్న నిలుపుదాం డప్పల తోటి డమాలతోటి డప్పల పదారువేలు దండుమూడువేలు మందుగుండు సామాను మేళ తాళాలతో దేవతను తీసుకున్నందుకు రాజులు, బాకు, బల్లాలతో కదిలి దండు కందిరీగల పుట్టు. ఈ నూకాలమ్మ తల్లి కాడికి ఈ నలుగురు రాజులు దండి సైన్యంతోటి బయలు దేరుతున్నారు. కదిలితే దండు కందిరీగలపుట్ట ఓళ్లపై వెళ్లేవారు ఓళ్లపై, బోట్లపై వెళ్లేవారు బోట్లపై వెళుతున్నారు. అపుడు నూకాలమ్మ తల్లి అంటది. మీది ఏవూరు? ఏపల్లి? ఎందుకొచ్చారు? ఆవచ్చిన కారణం ఏమిటి ? అమ్మా, పట్టణవాసం రాత్రి పగలుగా, పగలు రాత్రిలా ఉంటుంది. దేవతల తలంపు లేదు. నిన్ను మేము తీసుకువెళ్లి సంజీవ పర్వతం పై నిలుపుతాము. నీ కొంగు బంగారమై కొలుచుకుంటాం. ఎత్తైబత్తైలు చేస్తాం నిత్య పూజలు చేస్తాం, ఏటలు కూతో, తోడలతో నీకు సంబరాలు చేస్తాం ఏటలే ఇస్తాము, ఎనుబోతులు ఇస్తాము, రంగైన కుంకాల రాశిపోసిస్తాము. నీ కొంగు బంగారం కోరినిన్ను కొలుచుకుంటాం. కొంతకాలం ఎల్లనిచ్చాక నలుగురు రాజులలోకి ముగ్గురు రాజులు కలాంతరం అయిపోతారు. ఈ కోటలో సాయంపురాజు ఒక్కడే ఉంటాడు. ఈ నూకాలతల్లి కొడికి ఎల్తాడు. అమ్మా నీ తపస్సులు చేసినట్టివారు కాలాంతరం అయిపోయారు. నీ బలాలు పట్టికోళ్లు కాలాంతరం అయిపోయారు. నేను చూస్తే ఒక్కడినే ఉన్నాను. కొంతకాలం ఎల్లనిచ్చాక నీ భార్య సాదేవి 'గర్భంలోంచి చక్కని ఈరభట్టాపురం రాజు జన్మిస్తాడు. అక్కడి కోటలూ పేటలూ నువ్వేటి ఏలుతున్నావు? ఆ రాజు మంచి వరపుత్రుడయిపోతాడు. రాజు జన్మించాక తమ ఊరు రుబేమ్మలు (బ్రాహ్మణులు) తమ్మోరు బేమ్మలు తమవద్ద ఉంటారు. నక్షత్రాలు ఏడినట్లు మంచి రోజునాడు పసిబాలుడు పుడతాడు వీరబ్రహ్మవారూ మీరూ పంచల్ని పడిగట్టండి. ఇది అవునో కాదో కాయో? పండో మీరు నాతో చెప్పండి పేదపంచికాలు పడికడుతున్నారు. సాయంపురాజు సాదేవి గర్భం నుండి వీర పుట్టావురం రాజు జన్మిస్తాడు. పుట్టీపుడతుండగానే ఈ దేవాది దేవతలు, సూర్యకోటి దేవతలు, అష్టదిపాదికులు, పంచకుడి పాండవులు, ఈ దేవతలందరూ కలిసి ఓరుగల్లు బయలు దేరతారు. రాజుకి పన్నెండు సేర్ల పరికటుయ్యాలు రాజుకి ముప్పై సేర్ల నువ్వలుయ్యాలు యాభై సేర్ల ఎండుయ్యాల కడతారు. ఆ బాలణ్ణి ఈ ఉయ్యాల్లో ఏసి పట్టుకుని ఈ దేవాది దేవతలు, సూర్యకోటి దేవతలు, పంచకోటి దేవతలు ఆ ఉయ్యాల ఊపుకుంటూ జోలపాటపాడతారు. ఇటునుండి ఊపితే ఇంద్రుడు అటునుండి ఊపితే చంద్రుడు మోస్తాడు ఆ రాజుకి పేర్నాంకాలు చేస్తారు సీతమ్మ చిక్కు, రావణ బాణారం అనుమంతు బోదారం, ఇటువంటి పేర్నాంకాలు పెట్టారు. ఎవరన్నపట్నం వారు ఎవరున్న కోటకాళ్లు ఎల్లి పోతారు. ఆ రాజు ఇంతై అంతై పెరిగి ఆ రాజుకి 12 సం. ప్రాయం వచ్చింది. అతడు 12 పట్టరాదేవిలుతో కళ్యాణం అందాడు. విష్ణులోకం దేవలోక బ్రహ్మలోకంతటు చేస్తున్నాడు. కొంతకాలం ఎల్లనిచ్చాక అగ్గిమీద గుగ్గిలం లేదు. గుళ్లో దీపం లేదు. మనుషుల్లో మావుబోతుంది

ఎండలో ఎండుతుంది. మీ పిన్న పెద్దనాట, నేను పాల సముద్రంలో ఉండేదాన్ని మీ రాజులు తీసుకొచ్చి నా కొంగు బంగారంలా కొలుస్తాము అని కోరుకొన్న రాజుల కాలం అయిపోయింది. నీవు తలపెట్టినప్పటి నుండి పూజలు బత్తాలు చేయడం మానివేశావు. ఆ రాజులతో పుట్టిన కోడిపుంజులు కూడా కొక్కురో కో అని రెక్కలు కాళ్లు కోడి కూత కూస్తున్నది కూతకి తృడు వజ్రాలు, కెంపులు, నవరత్నాలు, మాణిక్యాలు కూడి కుప్పల్లా కుప్పలెడుతున్నాయి. దినం కుంచాలతో కొలిచి పంట పర్వతాలు ఏకంగా దొలిపించి, ఓరుగల్లు సందటకు రాజులు సక్కడాల కాలపు పొద్దుతో ఓరుగల్లు బాజీల కొలువు ఓరుగల్లు వరకు నట్ట ఓరుగల్లు రాజులు ఉన్న పట్టణం. తరువాత నూకాలతల్లి పూజ చేయడం మానేసినారు. నూకాలతల్లి అంత్రరాగాన కొచ్చి పుత్ర సంతానం కలగ నివ్వలేదు. బొండువాక్యాన్ని కొట్టిపారేస్తుంది. రాజు నాకు సంతానం లేనిదే స్వతంత్రం ఎందుకు? ధనధాన్యాలెందుకు మణిమాణిక్యాలెందుకు బాధలు లేని భాగ్యం ఎందుకు? నాకు యెండి కోటలెందుకు? ఇత్తడి దేనికి? అపుడు 12 మంది రాణులు పట్నం అన్ని దేవతలకు మొక్కుకున్నారు. కోటి యాత్రలు కడుపుతున్నారు. ఈ నూకాల తల్లి ఈల్ల నీడలో కలిసి ఏలుతుంది. అంతా బొండు కొన్ని కొట్టి పారేస్తుంది. ఆ రోజు కోటి యాత్రలు తిరిగి ఇంటికి వచ్చేస్తాడు. ఆ పన్నెండు మంది పట్టవా దేవీలను పిలుస్తాడు. నాకు బాల్లేని భాగ్యం ఎందుకు? అందుకు ఎవరు కన్నవారికి వారు ఎల్లండి అంటారు. ఈ రాజు అలిగి అద్దాలమేడలోకి ఎల్లిపోతాడు. రాజుగారి పెద్దభార్య మాణిక్యాలమ్మ పొట్టిది. మా గట్టిది. రాజు పెలి భార్య అప్పలారా! చెల్లిలారా మనం ఏమితప్ప చేశాం? చేను పంట ఆడవారిది కడుపు పంట మగవారిది. రాజా! మా మీద అన్యాయం ఆడకు అగ్గి ఒడి గట్టకు పాపం ఆడకు? మేం ఏం తప్ప చేశాం? అని ప్రశ్నిస్తుంది. రాజు మారు మాట్లాడకుండా ఎవరిగది అల్లెలిపోండి అన్నాడు. నూకాలతల్లి గిరిరాజు కోటకు వచ్చి చిలకవాని పట్నం చిమాల గడ్డ గంగారాన్ని బద్దిని కన్నవారి పట్నం చేరుకుంటుంది. అప్పడా తండ్రి గిరిరాజుల ఇత్తడి దేవుడు, రాగి దేవుడు, ఏడేడు పద్నాలుగు దేవుళ్లూ పండగ చేసికొని ఏడు కుంటాడు. అప్పడు నూకాలమ్మ ఆ గిరి రాజు కోటలోకి వస్తాది. బంగారు బల్లి గజస్తంభం ఎక్కి ఆ గోడమ్మట కిందికి దిగుతాది. ఆ గిరి రాజు కలలో చెపుతాది. ఆ రాజు చుట్టూరా దిక్కులు చూత్తాడు. అపుడు ఏవీ కనబడదు. నాయాడ పిల్ల వచ్చిందని కలగన్నాను ఏదీలేదు. దెయ్యంలేదు, రాకాశి లేదు. ఏ శక్తీ లేదు. బండి మాంకాళి లేదు. నేను కాసిన కల నిజమో కాదో? మంచో చెడో ఏడేడు పద్నాలుగు దేవుళ్లూ ఆ తలపుల్లో బయటకు వస్తాడు ఆ దండి గుమ్మం వద్దకు వచ్చేటప్పఇకి నూకాలతల్లి దాష్టం అవుతుంది. అపుడు నూకాలమ్మ బాబూ నాకు వైరం వచ్చింది. నాకు రోసం వచ్చింది. అని చెపుతాది. అపుడు గిరి రాజు నీకు వచ్చిన వైరం ఏమిటి? నీకు వచ్చిన రోసం ఏమిటి? అని అడుగుతాడు. ఏటో నాకు చెప్ప అంటాడు. అపుడు గిరిరాజుని కూతురు నూకాలమ్మ అంటుంటే. మీరు తండ్రి గిరి రాజు ఏడుగురు ఆడవారిని ఏల కన్నావు. ఆడపుట్టక పుట్టే కంటే అడవిలో మానై పుట్టాం గాదు. నువ్వు కోటి నోములు మోయలేదా' నీ పాపిట్టి గర్భాన ఎలా పుట్టాం? కోటి నోములు నోయలేదా కొడుకుని గనలేదు. అపుడు గిరి రాజు నూకాలమ్మ నడుగుతారు నిన్ను ఎవరు కొట్టారు? ఎవరు

తిట్టారు? ఎవరేమన్నారు? నువ్వు కాలినడకన ఏలనొచ్చావు? కారణమేమి? అమ్మా నీ తల్లి ఏ లోకం ఎల్లిందో? రాజు ఇలకోడి మనది కలకోడి వెండికోటలు పెండి కోటలు, వీర భూమి మనది. రాజు కొమ్ము ఎక్కువై పోయింది. నా కొమ్ము తక్కువై పోయింది. గిరి రాజు భార్య భూదేవి నా పెనిమిటి జూదంలో ఓడిపోయాడని ఆయమ్మ అడిగి తెలిసి కొంటుంది. గిరి రాజు భార్య అడవిలోకి వస్తుంది. రాతిపై శిరసిలి కిందికి పెట్టి పాదాలు పైకి పెట్టి తపస్సు చేస్తుంది. నా భర్త దేశానికి రాజు అని భరతం పట్టడాన్ని నూకాలతల్లి తండ్రి గిరి రాజు నువ్వు కోటలో ఉండు అని చెప్పి అతడు భార్య వద్దకు ఎలిపోతాడు. అపుడు భార్య అతనిని చూసి ఏడుస్తుంది. అపుడు ఆమె కుంటిలోనించి కారిన నీరు గిరిరాజు తోసిడితో పట్టి తాగమంటాడు. ఆ యమ్మ ఆ నీరును తన హస్తాలతో నీరు తాగేస్తాది. చేతులు దారి మీదికి ఇడిచి పెడతాది. ముత్యంమంత చుక్క ఎండరాయిపై పడి ఆ రాయి బద్దలై పోతుంది. అపుడు అందులో నుంచి పోతురాజు జన్మిస్తాడు. పుట్టపుట్టగానే ఈరమథం ఏస్తాడు. ఏబూథి పండుతోటి, వీర జటలతోటి, మారాజు పుడతాడు అరికాలి తామర అమరి ఉంటాది. ఈపున ఇంజర మంటాది. బొడ్డున పొన్న పువ్వుంటాది. అట్టగుడి అటకాలు లోకానికి ఎలుగై ఉంటాడు. కళ్ల చింతామణి అమరి ఉంటాది. ఈ ముగ్గురూ ఏకమై చెట్టనకా చేమనకా, కొండనకా, పెండనకా నడచివస్తున్నారు. నడిచి నడిచి కోటకు వస్తారు. ఈ పోతురాజును కోటకు కాపలా పెడతారు. అపుడు నూకాల తల్లి కొడికి గిరిరాజు, గిరిరాజు భార్య వస్తారు. గిరిరాజు భమటన పుట్టాడు. సదమున పోతురాజు నీకు ఎవరైతే పగవారున్నారో వారిపై నీ తమ్ముని యుద్దానికి తీసికెళ్ళు అంటాడు. అయితే తమ్ముడున్న తోట చెప్పమంటాది. అమ్మ ఎడమ చేయి బాగాని పైకి ఎల్లమంటాడు. అపుడాయమ్మ చెట్టనకా, పుట్టనకా, ఆకలనకా దప్పికనకా నిద్ర లేకుండా కారడవుల్లోకి వెలుతుంది. చమటన పుట్టాడు సగమున పోతన్నా! గంగి రేగిన్నెడి గరిడి పోతురాజు బొడ్డులో పుట్టాడు, బూసపట్టి కామసం అని ముద్దు పేర్లతో పిలుస్తాది. తమ్ముడూ ఆ పేర్లు సమ్మతం కకుంటే మరో పేరుతో పిలుస్తాయి. సూర్యదేవుని కంటే చూడ చక్కనివాడ చంద్ర దేవుని కంటే చూడ చక్కని వాడా రాహోయి అని పిలుస్తోంది. అక్క పిలుపునకు ఉలకడు పలకడు ఒల్లకుంటాడు అప్పా అన్న పిలుపు లేదు. తమ్ముడూ నేను చూస్తే ఆడదాన్ని నువ్వు చూస్తే మగవాడివి. నాకు దప్పికయితే దాహం ఎవరు తీరుస్తారు ? ఆకలయితే అన్నం ఎవరు పెడతారు? నానేం తప్పు చేశాను ఎందుకు పలకడం లేదు? అంటది. కోర మీసాలవాడు కోపంబు గలవాడా? రాగి మీసాలవాడు రంగైనవాడా? ఈర జటల వాడ వద్దన్న పుడితివి. అప్పలకి తమ్ముడూ అనంత రాయుడు చెల్లిలికి చెల్లునట్లు బావలకి మరిది, రాహోయి తమ్ముడూ అని పిలుస్తుంది. అపుడు నూకాలమ్మ కోపగించి మూడు నెలలు నించి పిలుస్తున్నాను. రాలేదు. మెర్ర మెర్ర చూపుల వాడా, మెట్ట గుడ్లువాడా, డొప్పచెవుల వాడా, డోలు ముఖము వాడా ! నీ వెంటి కండలు పూడిస్తా నీ చర్మం తీస్తాను నా దొడ్డి గుమ్మానికి డేరకడతాను, నీ శిరస్సుతెగి తోరణం కడతాను. అని తిడతాది. అపుడు నా తమ్ముడు కుంటాలు పెడితే వస్తాడా అసో కొర్ర కూడు కంబాలు కొండల్ల కుడువు' అది కూడి కుంబాలు ఒడ్డెల్ల కుడువు వరి కూడి కుంబాలు వడ్డల్ల కుడువు నీకాహారం పెడతాను నీక్కొట్టిన కొబ్బరి

పేరిమామిళ్లు మధురం రుచితేనె, మాది మామిడి పళ్లు ఆహారం పెడతానురా! అని చెపుతుంది. నీకు ఉలిపిరి గలికి ఊరగాయ పచ్చడి తెలతెల్ల కోరళ్ల పాలముంజుల, ఈదువా జొన్నలు ఏకంగా అట్టు వేస్తాను. తమ్ముడూ నీకు నవకాయిపిండి వంటలు చేశాను రా తమ్ముడా అని పిలుస్తుంది. గారెలు వండాను బుట్టలో వేశాను నేతులు వండి నూతులో ఏశాను ఏడు గానుగుల తెలగపిండి, మూడు చెట్ల మునగ కూర గానుగురోకలి మాదిరి నూనెదార కొలిస్తాను ఈ విధంగా పెడతాను రా! అని పిలుస్తాది. వచ్చినా రాకున్నా మా మంచి ఇదొక్క ఆహారం చెబుతాను నీకు ఏడు కొమ్ముల పోతు ఆహారంగా పెడతానంటాది. నాలుక్కాళ్ల జీవికి రెండే కొమ్ములుంటాయి. ఏడు కొమ్ముల పోతు ఎక్కడా ఉండదు. ఈ భూలోకం పుట్టక ముందే ముట్టిందేమో? అని ఆశ్చర్యపడతాడు. అపుడు తమ్ముడు పోతురాజు ముస్తాబై బంగారు పాంకోళ్లు ఏసుకు వెళ్తాడు ఎండుగుప్పగొడుగు నీడవేసుకుని మిట్టమధ్యాహ్నం బయలు దేరతాడు కాకులు దూరని కారడివి గెద్దలు దూరని పెద్దడివి ఎంబడి ఉల్లితోటలు ఊర్లు చెరుకుతోటల చేళ్లు దాటుకున్నాడు. టేకు వనాలు, పాములు దూరని పోవనాలు దానిమ్మడవులు అన్నిదాటి అప్పన్న పట్నం మదనగిరి పట్నం ఎలతాడు అపుడు అక్క నూకాలమ్మ బండరాయిమీద పడుకుంటుంది. చేత్తో లేపితే చేయెంగిలి, నోటితో లేపితే నోరెంగిలిది. అరజాతి ఆడపిల్ల ఎట్టి గొపున అక్క నీలాల కళ్లు నిద్ర కందినాయని తమ్ముడు అడివికి ఎలతాడు పెద్ద పులిని చంపి తోలుతీసి ఎండేసి తాటి చెట్టు నరికి దాని మొవ్వ నరుకుతాడు వీరభూమిపై మనిషికి దుమ్ములు మూడుతీసి కట్టుకడతాడు. మోచేయంత విభూతి పెడతాడు మేకపోతులా గడ్డం పెంచుతాడు. మోచేయంత మీసాలు బుర్ర నిండా ఈర జటలే. చేతులకు కడియం ఉంటుంది. బైరాగి బట్ట కట్టి పాంకోళ్లు తొడుక్కుంటాడు. బైరాగిలా బ్బగాదు నామాలు పెట్టుకుంటాడు. గంట కొట్టుకుంటూ అప్పదగ్గిరికి వస్తాడు. అపుడు బైరాగి అనుకుని నూకాలమ్మ లేచి వెళుతుంది. వజ్రాలు కెంపులు మాణిక్యాలు గుప్పెటతో పట్టుకుని రాగి పాత్రలే వేయబోయే సరికి వేషం మార్చి అచ్చం పోతురాజులా అయిపోతాడు. తమ్ముడూ నేను మూడు నెల్లకి పిలిచాను నువ్వు ఆర్నెల్లకొచ్చావు. నేను పిలిచినప్పుడు నువ్వే రాజ్యానికెల్లావు అని అడుగుతాది. నువ్వు పిలిచినపుడు నేను కాశాలలో ఉన్నాను. కల్లమ్ము తున్నాను. ఢిల్లీలో ఉన్నాను ఢిల్లీరాజు పట్టుకుని దివిటి వాయిస్తున్నాను అక్కా ఆకలేస్తుంది అన్నం పెట్టు అంటాడు. తమ్ముడా! నా కోటకు రాగానే ఆకలేస్తుంధా? అంటుంది నువ్వు గిరిరాజు కోటలో ఉన్నప్పడు నువ్వు తిన్న అన్నాల పేర్లు చెప్పు అంటాది. అప్పా మూడునెలళ్లనాటి మొక్కజొన్న కూడు ఆర్నెల్ల నాటి ఆడక్కొడియాలు తిన్నానంటాడు. అపుడు నూకాలమ్మ అన్నం పెడతానని చెప్పి కాశీ రామేశ్వర ఎల్లిపోయి కాశీలోని జోడి బోండువలు తెస్తాది. ఈ జోడి బొండువాలపై అందులో వజ్రంతో తెచ్చి కాశీగంగ తెప్పించి ఏస్తాది కొర్రకూడు కుంబాలు కొండల్ల పొడుగు కొట్టివి కొమరులు కొమరంటిపళ్లు డంకాల కలదు తేనె మామిడిపళ్లు, మదిరిక తేనెలు మాడి మామిడి పళ్లు, నవకాయ పిండివంటలు నూకాలమ్మ పోతురాజుకి పెడతాది. ఇంకా మూడు చెట్ల మునగాకు, ఏడుగానుగుల తెలగపిండి గుగల రాట్నం దారు నూనెతో కూరచేసి వడ్డిస్తాది. అపుడు అక్కా! ఏడు కొమ్ముల పోతుని చూపిస్తే

గానీ భోంచెయ్యనంటాడు. అపుడు తమ్ముణ్ణిక్కడ ఉంచి అక్క ఎల్లిపోతుంది. ముసలమ్మ ఏకి నడుకు తుంది అపుడు నూకాలమ్మతల్లి ఎల్లి ఆవిడకు కళ్లు కనబడకుండా చేసి మామ్మా! నాకు దప్పికగా ఉంది. మంచి నీళ్లమ్మాంటాది. ఆవిడ అలా ఎల్లగానే అక్కడ ఉన్న కోడి గుడ్లలో పెద్ద గుడ్డు ఒళ్లో పెట్టుకుని బయటకి వచ్చేటపుడు రాట్నంకి కాలుతగిలి అది పగిలి పోతాది. అపుడు మామ్మ తిడతాది. నూకాంబిక చెంగుతగిలి కళ్లు వస్తాయి. ఆ కోడి గుడ్డు పట్టుకుని తమ్ముని వద్దకు వస్తాది. నూకాంబిక గోటితో పాత సింధూరం పెట్టికొని కోడి గుడ్డుపై పెడతాది. ఆ గుడ్డు పగిలి పుంజు బయటకి వస్తాయి. అపుడు తమ్ముని దగ్గరకు వచ్చి తమ్ముడా ఏడుకొమ్ముల పోతు కేక విను కొవ్వు కొండల పాకొంగిపోతాడు. పాలుపొంగినట్లు పొంగిపోతాడు ఉప్పరు కండల ఉప్పరుతాడు తమ్ముడూ ఏడు కొమ్ముల పోతును తెచ్చానని పుంజునక్కడ పెడతాది. అపుడు తమ్ముడు ఓడిపోయానని ఒప్పకుంటాడు అపుడా కుంబాలు మూడు భాగాలు చేసి ఒక భాగం తనకు, ఒక భాగం తన అక్కకు, ఒకటి తన భార్య ఎర్నమ్మకూ ఇస్తాడు. అరణ్యంలో భూమి బ్రద్దలయ్యి ఎర్నమ్మ పుడతాది. ఆ ఎర్నకి ఆకాశం ఒక దవడ, భూమి ఒక దవడ, నాలుక నల్గొండ నా పరాయిలాగ, ఉంటాది. దాని ఒంటి నిండా ఈర జటలే. 78 సీర్లు కడతాది. నాకు ఆకలి తీర లేదు ఇంకా అన్నం పెట్టు అంటాది. నిన్ను పిలవడం మాది తప్ప అంటాడు పోతురాజు ఉయ్యాల్లో పిల్లాణ్ణేసుకున్న ఆ తల్లి చేషుకి కూడు పట్టుకుని ఎల్తాది. అటు నుండి వచ్చే సరికి కుర్రాడు కక్కు కుంటాడు, పారుకుంటాడు అపుడు ఎర్రకూడు, తెల్లకూడు, పచ్చ కూడు చెంబుతో నీల్లు ముగ్గెట్టి పెడతారు. అది ఒక ఆహారం తీసుకో అంటాది అది తిన్నాక కూడ ఆకలి తీర దంటాది ఆ ఊరి పెద్ద కొడుక్కి పెళ్లి జరుగుతుంది. అతన్కి దిగదుడిచి ఎర్రకూడు, పచ్చకూడు పెడతారు అపుడు కూడా అది తిని ఆకలి తీరలేదంటాది. నూకాలతల్లి ఓర్చిన ఓర్పు ఏర్లు గడలై పారుతుంది. గొప్ప కోనేరు నిండుతుంది దానికి పల్ల పోతుంది. ఆ కోనేటిలో ఉండు మత్స్యాలు, తాబేళ్లు చచ్చిపోయి కప్పలై తేల్తాయి. ఎగవీధి కెల్తే దిగవీధి, దిగవీధి కెల్తే ఎగవీధి కంపు. అక్కడ ఎర్నమ్మ ఇంకా నాకాకలి తీరలేదంటాది. అయితే అప్పడు దోసిలి పట్టమంటాడు ఆరెకరం నీడ కొమ్ముకాస్తది. అపుడు సింకుచాట, గొరక చీపురు, చెప్పలదండ మెళ్లొ వేస్తాడు, అపుడు ఆమె ఎల్లిపోతాది. అపుడు అక్క వద్దకు పోతురాజు వస్తాడు. ఎర్ని రాకుండా తెల్లార్లు కంటిమీద రెప్ప వెయ్యకుండా ఉండాలి. అది రాకుండా ఉండాలంటే చీపురుకట్ట పట్టుకుండాలి. మేకలాగ, గొర్రెలాగ 66 రూపాలలో వస్తాది. ఆ వచ్చిన దానిని జాగ్రత్తగా కాయాలి. మనం తాగుతుంటే తీసుకుపోతాది.

## నూకాలతల్లి వర్ణన :-

నూకాల తల్లి నాగుపామును బట్టి నాడికట్టు ఏస్తది జెర్రి పోతును బట్టి జాకెట్టు ఏస్తది పెద్దపాడ పామును బట్టి పైగెడుపస్తది ఉల్లి నాగును బట్టి బయాట ఏస్తది కలకోటి నాగుల కాళ్ల కడియాలేస్తది సపత పావును బట్టి మట్టెలేస్తది గిరినాగునుబట్టి గుల్ల దండలు ఏస్తది కన్నవారు పెట్టారు గుత్తు కాసుల పేరు మెళ్లో ఆని పగడాలు ఆ పగడాలపై కంఠముడి పట్టెడి బంగారు కాసుంటుంది. కొనచెవికి కట్టిల్లు కొండచిలువను బట్టి కమ్మతగిలిస్తాది. ముప్పై తులాల నత్తి కాడు, శంఖనాగు పట్టి పెలగు ముక్కు పుల్ల

కన్నవారు పెట్టారు బంగారు గాజులు 5 వేళ్లకు ఉంగరాలు బంగారాన్ని అడ్డం నడుమకి గిరినాగును బట్టి జడవేసుకుంటుంది కోటలో కెలతాది నిలువుటద్దంలో నీడచూస్తుంది. చింతాకంత హెచ్చుచక్క దనంగా 12 ఏళ్ల బాలా కుమారి లాగ తయారౌతాది రాజుపట్నం ఓరుగంటి పట్నంఎలతాది. ఆ రాజు అద్దాల మేడలో పడుకుంటాడు పన్నెండు మంది జమానులను కాపలా పెడతాడు. రాజు పన్నెండు మంది పట్టవీదేవిలకి సంతానం ఇయ్యడానికెల్తాది నూకాలతల్లి అడవుల్ని దాటి రాజకోట కానుకుంటాది రాజకోటలో కెల్తాది. పన్నెండు మంది పారా జమానులు నూకాలతల్లి కన్నులు చూశారు. బుల్లీ నీది ఏవూరు? ఏ దేశం? ఏవరి కోసం? దేని కోసం వచ్చావు? వచ్చిన కారణాలేమిటి? మాతో చెప్పమని జమాన్లు అడుగుతారు. ఆ జమాన్లతో నూకాలతల్లి అంటాది మీ రాజుతో నేను మాట్లాడి వచ్చి తరువాత వెళ్లి పోతానంటది. తరువాత జమాన్లు ఆ రాజుతో మాట్లాడే జనులు ప్రపంచంలో ఎవరూ లేరు. నువ్వు దేవతవా? దెయ్యానివా? నువ్వు అసరమ్మవా? అమ్మ తల్లివా? బండి మాంకాలివా? ఎల్లిపో అని చెపుతారు. అపుడు నూకాలతల్లి, కత్తికళ్ల జూపి కావు మంత్రించింది. గోరుతో గోరెడు పాత సింధూరం తీసి పార్దాజనులపై పార జల్లింది. రామా రామా అని పన్నెండు మంది జమానులు ధరపై ఒరిగి పోతారు. అపుడు నూకాలతల్లి రాజుకాడికి ఎల్లి రాజన్న అద్దాల మేడలోకెల్లి, మంచం కాడికెల్లి నిలబడతాది. రాజు తెలివిలో పడలేదు. అమ్మవారి చేతిలో యెండి అగరుబత్తిలు ఉన్నాయి. చేత్తో ఏడువేలనెత్తెంది రాజుగా ఎన్ను మీద ఏడు సరుపుల సరుపుతాది రాజుమేల్కొని దిక్కులు సూత్తాడు. ఆ రాజు కళ్లకి నూకాలతల్లి గంతలు కడతాది అపుడు ఆ రాజు బుల్లీ నా కోటలోకి వచ్చిన కారణం ఏమటి అని అడుగుతాడు. అపుడు ఆ తల్లి ఓ రాజా! నీ పన్నెండు మంది పట్టపుదేవిలకు పుత్ర సంతానం ఇస్తాను దోసిడి సాపు అంటాది. అపుడు దేవీ నాకు సంతానం వద్దు నాకు నీవేకావాలంటాడు. ఏమయ్యా రాజునా కన్నవారు పెట్టిన ఆభరణాలతో అలంకరించుకున్నాను. నేను తలచుకొన్న తలపు నీకు లేదు. ఆ ఓరుగంటి రాజుకి తల్లి పిల్ల న్యాయం లేదు. ఆడు పంచ దుర్మార్గుడు, పాపిష్టుడు. ఆడు నూకాల తల్లి చెంగు పట్టుకుని అమ్మవారిని పట్టెమంచంపై పడలాగుతాడు రాజు వచ్చిన తోవన వెల్లిపోతాను నన్ను వదులు అన్నాది. అపుడు రాజు దేవీ నిన్ను పడతిగా చేసుకొని నీకు పట్టాభిషేకం కడతానంటాడు దేవీ నా కంచు కోటలు చూచు యెండి కోటలు సూడు కొండ తోటలో గుర్రాలుంటాయి, పసుపు తోటలో ఏనుగులుంటాయి. నా మాట అలకించు ఆ రాజు నూకాలతల్లి చెక్కిలి చేరతాడు. అక్కు చేర్చి పూలు ముద్దాడతాడు. రాజా నీకూ నాకూ జోడీ అయితే లోకం ఆలిస్తాదా? దేశం ఆలిస్తాదా? నీతల మండిపొద్ది అని నూకాలతల్లి అంటాది. నూకాలతల్లి రాజుతో, మనిషితో మాటాడినట్లు మాటాడతాది. ఆ తరువాత మారుమ్మై, అంబర వీధిపై వీరపీఠం వేస్తాది. ఆ నూకాలతల్లి అక్కడి నుండి రాజు చేసిన పనులన్నీ చూస్తాది. రాజుకి గండలు కొట్టడం వలన తన మోకాలు తానే పట్టుకొని దేవీ నిన్ను పోనివ్వను, నా కోటదాటనివ్వను, నా మెడదాట నివ్వను నేను దేశానికి దేవుణ్ణి, రాజ్యానికి రాజుని తిరుమూడు లోకాల్లోని, నా కత్తికి తిరుగులేదు. అలాగని తన మోకాలు పట్టుకుని తను అంటాడు. అపుడు రాజు పన్నెండు పంది పార జవానులను పిలుస్తాడు. రాజు మాటకి జమానులు జోడు గండుబార్లు చేతపట్టుకుని కోటూ బూటూ ఏసుకుని రాజు కోటకి గజ్జెల గుర్రాల్లో వస్తారు. అపుడు రాజు వద్దకి

వచ్చి మమ్మల్ని పిలిచిన కారణం ఏమిటి? చెప్పమంటారు. పట్టుకోండి, పట్టుకోండి అని రాజు అంటారు. మీ మోకాలు పట్టుకుని మీరే ఉన్నారు. మమ్మల్నేమంటారు. అలాకాదు జవాన్లూ నేను పుట్టాను. పన్నెండు మంది పట్టవాదేవీలను కళ్యాణం పొందాను. ఆ దేవి నన్ను భంగపించి పోయింది. ఆ దేవిని పట్టుకుని తీసుకొచ్చి నాకు అప్పగించండి. నెలముప్పై రోజులకు మూడు రోజుల జీవం ఇస్తాను ఆ దేవిని పట్టుకుంటే మీ శరీరంలో ఎన్ని కీళ్లు ఉన్నాయో కీలుకి అయిదు రూపాయలు చొప్పన ఇస్తాను. ఆ దేవి ఏతోవన పారిపోయింది అని అడుగుతారు. మన పట్నం ఇంకాదాటి ఉండదు. అపుడు జవాన్లు వీది తిరుగుతారు. అపుడు నూకాలతల్లి ఎక్కడా కనిపించదు. ఈ పన్నెండు మందిలో ఒకడు ఈ రాజుకి పిచ్చి పట్టింది. మనకేమయింది ఇంక పోదాం పదండి అంటాడు. తిన్నగా రాజు కాడికి ఎల్తారు. రాజుతో ఆవిడ పారిపోయింది. ఎక్కడా కనబడలేదంటారు. అపుడు తల్లి రాజుకల్లో కనబడ్తాది. అపుడా రాజు విషయ బ్రహ్మ కొడుకు ఇంజనుడు బ్రహ్మపురి పట్నంకి ఓరుగంటి రాజుకి జాబురాయిస్తాడు. బ్రహ్మ ఆ జాబుని అందుకొని చదివి అలాకాదు బ్రహ్మ ఆ రాజుపట్నం రా అని చెపుతాడు ఆబ్రహ్మ తెల్లవారి తలస్నానం చేసి, సూర్యదేవునికి బతలిబట్టి కోమటింటికి ఎల్లి అక్కడి కాటాపట్టుకుని రాజు పట్నం బయలు దేరతాడు. చిన కొండలూ, పెద్ద కొండలూ, కొర్రగిరి పర్వతాలూ దాటి రాజపట్నం చేరుకుంటాడు ఇదిగో మా తల్లిదండ్రులు ఏడు గోదాముల పాత బంగారం గడించారని చెపుతాడు అపుడా బ్రహ్మ కాటాలోని గుళ్లు ఒకవైపు, పాత బంగారం ఒకవైపు పెట్టగానే ఏడు మడుగులు సరితూగుతుంది. బ్రహ్మ ఎడమూట, పెడమూట వేసి కావిడి వేసుకొని ఊరవతలికి తీసెకెల్లి అక్కడ కావిడి దించాడు. అక్కడ కొలిమిపెట్టి ఆ కమ్మరం ఉల్లి తెరబడ్డది ఊకపోశాడు నేరేడు బండి ఒంటిది నీలాలు వేశాడు నిమ్మపండు వంటి నిప్పు వేశాడు. అగ్ని గుండంలో ఏగి సమానులు, బెల్లంకి దూలాలు, గుగ్గిలం మాకుల గొల్లగెత్తం ఆ కమ్మరంలో పోశాడు. ఊదేటి తుత్తులు రెండు ఆ అగ్ని గుండం దగ్గర పెట్టాడు. ఆ అగ్ని గుండం పెరిగి అగ్ని గుండంలో నిప్పలు పడుతున్నాయి. ఈ పాత బంగారం కొలిచి కుంచుడోసినాడు. కొలవక్కుంచుడూ, కాలిచి కుంచుడూ, చూసి కుంచుడూ, చూడక్కుంచుడూ ఈ పాత బంగారం కమ్మరంలో కాల్తుంది. ఉడికొచ్చి బంగారం కనపువ్వు ఛాయ. ఇద్దరు వస్తాదులను పిలిపించినాడు వారు నూనూగు మీసాలవారు, మంత్రాలు గట్టిన మగవారు ఆ కాల్చిన బంగారాన్ని కారుతో పట్టుకున్నారు. చెరుకూరు సమ్మెట చేతికిచ్చినారు. ఆ కారుతో పట్టుకున్న బంగారాన్ని ఏశాడు సమ్మెట రణభేరి మోత, ఊదేటి తుత్తులు ఉరుముల్నిపోతాయి. అమ్మవారి రూపంగా నాలుగు చేతులు, రెండు కాళ్లు కళ్లు కళ్లు లాగ నోరు నోరు లాగ ముక్కు, ముక్కులాగ చింతా కాంత హెచ్చు చక్కదనంగా తయారుచేశాడు. తయారు చేసిన ప్రతిమకి బంగారు చీర రవిక కట్టబెట్టాడు ఈ ప్రతిమ చూస్తే నూకాలతల్లి పోల్చలేం. నూకాలతల్లిని చూస్తే ఈ ప్రతిమని పోల్చలేం రాజుకాడికి ఈ ప్రతిమని తీసుకెళ్తాడు. నన్ను భంగపించి పోయావు సొలిపట్నం జాబేసాడు మగ్గం నేతగాల్లికి పన్నెండు మంది జవాన్లు యాంతాళ్లు పట్టుకుని వచ్చారు. రాజు పడుకున్న పందిరి మంచం కోళ్లకు ఆ ప్రతిమని కడతారు. రాజు ఇవాల ఏం పనిచేశాడో అని నూకాలతల్లి చూస్తుంటుంది. ఈ ప్రతిమని ఇలా కట్టాడా? అని తల్లి ఆలోచిస్తాది. ఆ రోజు తాంబూలం ఏసుకొని బంగారు పాంకోల్లు ఏసుకొని వాటితో

ప్రతిమని శిరస్సుపై తంతాడు. తుప్ప తుప్పమని ఊస్తాడు. నూకాలతల్లి ఈ పన్లు కనిపెట్టి కన్నవారి స్థలంలోకి వస్తాది. ఆ పంచన ఉంటాయి పంచరధాలు ఆరధం పై నూకాలతల్లి వీర మఠం ఏసుకుని చంద్రహారంలు వేసుకుని, యెండికత్తి చేత పట్టుకుని రాజు పట్టణానికి ఎలతాది. ఆయమ్మ రధం నుండి క్రిందికి దిగి ఎండ కెత్తింది ఎనుపదేరాలు పొద్దుకెత్తింది పొన్నపూదేరాలు, మాడికెత్తింది మైనపు-దేరాలు ఆ తెరలోపల నూకాలతల్లి బంగారాన్ని బద్దల నిలిపింది. ఆ బంగారు బద్దల మీద నూకాల తల్లి వీర మఠం వేసుకుని రాజు పట్నాన్ని పన్నెండు చెరువుల్ని పాడుచేస్తుంది. గోటితో గోరు పోక సింధూరం అంకించుకుంది. ఈ పాక సింధూరం ఆ కుంటకోనేటిపై విసిరింది. ఈ నీరంతా ఆ నీలారగంగతో ఎర్రగా డాకిరేసింది ఎర్ర గంగంతా బురదనీరైంది. కోనేరెండిపోయింది ఆ కోనేటిలో ఉన్న బూక్కొర్రిలు మత్స్యాలు, తాబేళ్లు చచ్చిన శవాల్లాగ గసకాయమడ్లగా యిడిపోయినాయి. ఎగమీది కెలితేదిగ మీది కంపుదిగమిది కెర్రేపొగపీది కంపు ఈ కంపు కుండలేక కాకులూ గద్దలూ కోలాడతాయి. రాజు పన్నెండు మంది పట్టవా దేవీలను పిలిపించి మన నీళ్ల బావికెళ్లి పన్నెండు బాండువాలతో గంగ తెమ్మంటాడు రాజు స్థానం చేయడానికి రాజు పట్టవా దేవీలు వారు నంబూళ్ళి పిలుస్తారు. ఆ పన్నెండు బాండువాలతో వాళ్లని నీళ్లు తెమ్మంటారు. ఈ పన్నెండు మందీ సుమ్మలు నెత్తిమీద పెట్టుకుని కోనేటి వద్దకు ఎల్లగా మన కోనేటి వద్ద సంపెంగవాసన ఉండేది. ఈ కంపేంటి అంటారు సంద్రవన్నా ఎండుతుంది కానీ మనరాజు గారి కోనేరు ఎండదని కొందరు కోనేటి వద్దకు వచ్చు సరికి అందులో నీరుండదు. ఎల్లిన నంబులు రాజధానికి తిరిగి వచ్చేస్తారు. అపుడాళ్లు రాజుతో చెపుతారు. ఎవరో చెండాల్ది ఎండకెత్తింది ఎన్నపుదేరాలు, కొద్ది కెత్తింది పొన్నపుదేరాలు, మనిసెకెత్తింది మైనపుదేరాలు దేరాల్లోపల బంగారు బద్దలు ఆ బంగారు బద్దెలపై వీరమఠం వేసుకుని ఉంది. రాజు పాతాళ గంగను పైకి తీసుకువస్తాడు. రాజు తలమీదుగా స్నానం చేస్తాడు. ఆకోట సావిట్లో ఉన్నాడు రణభేరీలు. ఆ రణభేరీలు పట్నంలో చాటించాడు నూనూగు మీసగాళ్లందరూ సురతాడుకోడిరి రమ్మనిసెప్పి రాజుముందు బయలుదేరతాడు. కదలితేదండు కందిరీగల పుట్ట ఆ వచ్చిన దండుని చూసింది నూకాలమ్మ. ఈ దేవి నా పట్నం అంతా పాడుచేసింది. దాని అంతం చూస్తేనేగానీ నేను కూడైనా తిన్ను అంటాడు. ఆమె పారిపోతానని తెరచుట్టూ ఇనుప చిక్కాలతో బంధిస్తాడు. నూకాలతల్లి జనాల్ని చూసి పారిపోడానికి కలిసి కుప్పించి పారిపోదామంటూ దూకింది. ఆమె క్రిందపడగా ఆ పన్నెండు మంది జమానులూ నూకాలతల్లిని పట్టుకొని, కాళ్లకూ చేతులకూ బంధాలేసి, మెల్లో గొలుసులు ఏసి, బంధించి సభకు తీసుకెళ్తారు. అపుడు నూకాలతల్లి జమాన్లతో మీకు ఆడవాళ్లు పుట్టలేదా? నున్న వొగ్గేయండిఅన్నది. అమ్మ, నిన్ను ఒగ్గేస్తే రాజు మమ్మల్ని బ్రతకనియ్యడు. నిన్ను విడిచి పెట్టం అంటారు. కానీ నేను మీకు అప్పను గానా, మీరు నాకు తమ్ముళ్లు గారా అంటుంది. కానీ జమాన్లు ఓరుగంటి పట్నం పట్టుకు తీసుకువస్తారు. అక్కడ ఒక రకం మర్రిచెట్టు ఉంటాది. దానికి ఆకులూ కొమ్మలూ కోటి వేల చీమలు ఉంటాయి. నాలుగు జాతుల చీమలు ఉంటాయి. కర్రియావుతల కండచీమలూ, పేనుగు తలకాయ రంగు చీమలు, గొల్లావు తలకాయ బొర్ర చీమలు, పెద్ద పులి తలకాయ పులి చీమలు. ఈ నూకాలమ్మ వారు ఒంటి మీదున్న నవభూషణాలు తీసివేశాడు.

సరితాళ్లతో చీమలున్న చెట్టుకి ఇరిచి కట్టాడ. తాడతేనెపట్టు పట్టుకున్నట్లు అమ్మవారి చుట్టూ చీమలు పట్టుకున్నాయి. ఆమెను తాకగానే పై దవడ పైకి క్రింది దవడ క్రిందికి ఇరిగి పోయినది. ఆ చీమలు చుట్టూ ఎగిరిపోతున్నవి. దేవీ నువ్వు ఇలా చావవు. నిన్ను ఎలా చంపాలో అని ఆలోచిస్తాను. ఇంటింటా మూడు గరిటెల నూనె దండితే ఆరుపూట్ల నూనె కూడింది. అక్కడ అగ్ని గుండం తవ్వించి బెల్లపు పెనం రప్పించి అగ్ని గుండంలో పెట్టి ఈ ఆరు పూట్ల నూనె మరిగించాడు. పాలపొంగులా వచ్చింది. నూకాలమ్మను తీసికెళ్ళి మొక్కజొన్న చేతపట్టి నూనెలో ముంచి నూకాలమ్మపై జల్లుతున్నాడు. ఆ నూనె తిరిగి పోయింది. సిరిసిరి పొక్కులు అమ్మవారిపై తుగుస్తున్నాయి. నువ్వు ఇలా చావవు. ఎలా చస్తావు అని అంటాడు. ఏడూర్ల గొల్ల గెత్తం పన్నెండు కావులు తెప్పించి అగ్నిగుండం తవ్వించి ఏగి సమానులు, చెల్లంగి దూలాలు, గుగ్గిలం మానులు అగ్ని గుండంలో ఏసేసి డబ్బాలతో చమురేసి ముట్టించాడు. తెప్పించిన గొల్లగెత్తం అందులో వేయించాడు. ఆ మంటలు మేఘాలను తాకుతున్నాయి. నూకాలమ్మ చేతులూ కాళ్ళూ కట్టేసి అందులో పడేస్తాడు. కంటెంటి కన్నీరు పెట్టింది. అగ్ని గుండం ఆరిపోయింది. అందులో నీరు తేలి నూకాలమ్మ సల్లగా పైకి తులుతాది. జమాన్లు ఇది ఇలా చావదు. దీన్ని చంపి దీని కడకాల దుమ్ము ఆనవాలు సూడాలంటాడు. ఉప్పర్లను పిలిపించి ఏడు తొట్ల లోతు గొయ్యి తీయించి అమ్మవార్ని అందులో పడవేశారు. అమ్మవారిపై పెద్ద పెద్ద రాళ్లేసి దానిపై కత్తి వాపేనలు, పరిమికట్టలూ అన్నీ కూడా కప్పేశాడు. జమాన్లూ! దేవి ఈ సొంపులో సచ్చి పోతాది అని పన్నెండు మంది జమాన్లనూ కాపలాపెట్టి రాజు ఓరుగంటి పట్నం ఎల్లిపోతాడు.

ఈ సాములో వుండి కొద్ది దినం నాటికి వాన, గాలి కాయించింది. ఈ జమాన్లు తడిసి పోతారు. పెద్ద పరికంపలు కుళ్లిపోయి కంపేస్తుంది. ఈ జమాన్లు నూకాలమ్మ సచ్చిపోయింది అని భావించి రాజుకు చెప్పడానికి ఎల్తారు. ఆళ్లెల్లేసరికి ఈ నూకాలమ్మ తల్లి ముక్కంట ఊపిరొగ్గింది. అపుడు ఆకాశ మార్గాన ఇయ్యన్నీ ఎగిరి పోతాయి. పాను పంట బట్టబయలు అయిపోతాది. ఈ నూకాలమ్మ తల్లి బయటకి వచ్చి ఆలోచన చేసి తెల్లవారి జామున నీలాడ రేవు కాసి పారిపోతుంది. ఆడవాళ్లు నీళ్ల తేవడానికి నూతుల కాడికి ఎల్తారు. ఆ ఆడవారి మధ్య నుంచి పారిపోతుంది నూకాలమ్మ. వారామె వైపు చూసి నవ్వుకుని తిట్టుకుంటుంటారు. ఆ ఆడవాళ్లు నా వైపు చూసి ఎందుకు నవ్వుతున్నారు? నా సంబరాలైనా, పెళ్లైనా, నా లాసిమటిస్తాను అంటది. అపుడు మగవారు చూస్తే ఆక్షేపిస్తుంది ఓ ఊడుకుడొకలో పొంచి దాక్కుంటాది. అపుడు పేదరాశి పెద్దమ్మ పేడ కళ్లేరతాది. నూకాలమ్మ మూలుగుతుంటాది. అమ్మమ్మ అక్కడికి వచ్చి నూకాలమ్మ కన్నులు చూస్తారు. అమ్మ నా పెద్ద కూతురులా ఉన్నావు అని పట్టుకుని నీకు నేను ఒక కోక పట్టుకుని వస్తానని ఆ మామ్మ శాలిపట్నం ఎల్తాది. మూడు జొన్న గుడ్డునేయించి అది మడతపెట్టి నత్తకాయలో పెట్టింది. అమ్మవారికి మూడు జొన్లచీర అందించింది. అది కడుతున్న కొద్దీ పెరిగిపోతుంది. అపుడు నూకాలతల్లి చీరమీద నేత నేయిస్తుంది. అడ్డు చంగు హంసల్ల నేత పైనాట చెంగునెపరువాల నేత కుచ్చిళ్ళ చెంగు కుచ్చిళ్లనేత, నడుంమీద నాగుపాము నేత, ఆమె మిగిలిన చెంగున ధనియాలు, ఆవాలు

మూటకడుతుంది. ఆమెట్ట మీదున్న మేదరోడి కోటకెల్తాది. వాడు నూకాలమ్మకి దణ్ణం పెట్టి అమ్మా నీకు ఏం కావాలేటి? నీకు వచ్చిన వైరం ఏటి? అని అడిగాడు. అపుడు అన్నా! నన్ను ఏడు ఘడియలు ఎక్కడైనా దాచిపెట్టు అన్నా! నన్ను దాసినా వంటే నీ కొంగు బంగారమై ఉంటానంటది. అమ్మా! నీకొచ్చిన వైరానికి కారణం ఏవరూ? అంటాడు? నేను రాజుగారిపై యుద్ధానికి వెల్లాను. ఓడిపోయాను పారొస్తున్నాను అంటుంది. అమ్మా నేను తట్ట బుట్టా అమ్ముకొని రాజకూడు తింటున్నాను. రాజుకు తెలిస్తే నన్ను సంపుతాడు అంటాడు. అన్నా! ఇంకా ఇలా ఎలితే ఏ ఊరుంది అని అడుగుతాది. అలా ఎలితే చాకలికోట ఉందని చెపుతాడు. అపుడు నూకాలతల్లి మేబుట్ట, మేజంగిడి నీకు వరంగా ఇచ్చానంటడి. అపుడు చాకలి వద్దకి వెళ్ళి అన్నా నన్ను ఏడు ఘడియలు దాచిపెట్టు నీ కొంగు బంగారమై ఉంటానని అంటాది.

అపుడు చాకలి దగ్గరకు వెళ్ళి అన్నా నన్ను ఏడు ఘడియలు దాచిపెట్టు నీ కొంగు బంగారమై ఉంటానని అంటాది. అపుడు చాకలి నీకు వచ్చిన వైరం ఏమిటని అడుగుతాడు. నేను రాజుతో యుద్ధం చేసి పారిపోయి నీవద్దకు వచ్చానంటది. అపుడు చాకలి అమ్మో నేను రాజుగారి చాకలిని అతడు పెట్టిన కూడు తింటున్నాను. రాజుతో వైరం నాశక్యం కాదంటాడు. అపుడు నీకోవరం ఇస్తాను. రెండు చేతులూ చాపు అంటాది. రెండు చేతులూ చాపి ఎంత వరమో? అని సంబరం పడతాడు. చాకలి నా సంబరం ఏదైనా ఉన్నప్పడు ఒక చేత్తో దివిటీ మరో చేత్తో సిద్దా పట్టుకొని ఉండు అలాంటి సమయంలో నీకు చీమ కుట్టినా బకురుకోకుండా ఉండు అని అంటాది. అన్నా! ఇలాపోతూ ఎల్తే ఎక్కడికి ఎల్తామని అడుగుతాది. అమ్మా! ఇలావెల్తే కుమ్మరి దివాణం వస్తాది ఎల్లు అంటాడు. ఆ కుమ్మరి చక్రం పట్టి కుండలు చేస్తుంటాడు. నూకాలమ్మ ఎల్లగానే దణ్ణం పెడతాడు. అపుడువాడితో నూకాలమ్మ ! నన్ను దాస్తే నీకు కొంగు బంగారమై ఉంటాను. నీకు వరాలిస్తానని చెపుతుంది. నేను రాజుతో వైరం పెట్టుకుని ఓడిపోయి వస్తున్నాను. అమ్మా! నేను రాజు చెరువులో మట్టి తీసుకువచ్చి కుండలు చేస్తాను. నేను రాజుతో వైరం తెచ్చుకోలేను అని చెపుతాడు. అపుడు ఎలా ఎల్తే ఏ పట్టణం వస్తాది అది అడుగుతాది నూకాలమ్మ అలా ఎల్తే పరాబత్తుడు (మాదిగ) ఉన్నాడు ఎల్లు అని అమ్మవారికి ఒక కుండ ఇస్తాడు. అపుడు నూకాలమ్మ అక్కడికి ఎల్తాది. అతడు నూకాలమ్మకి దణ్ణం పెడతాడు. మరేం లేదు పెద్దయ్య రాజుతో యుద్ధం చేసి ఓడిపోయి ఇక్కడికి వచ్చినాను. నన్ను దాస్తే నన్ను మొక్కిన మొక్కుకి నా జాతి ఆడపిల్లకి జోడీ ఎతుక్కున వస్తాను. అన్నా! మరేం కాదు. నాకు సంబరాలైనప్పడు డప్ప పట్టుకుని బయలు దేరి రమ్ము అని వరం ఇస్తాది. అమ్మ అర జాతి ఆడపిల్లలు తూగుటుయ్యాల ఊగుతున్నారు. అందులో కెల్లి ఊగరమ్ము అంటాడు. ఎప్పడయితే పోరాబత్తుని కోటకు ఎల్తాదో తల్లికి రాజపట్నం కనిపిస్తుంది. కోట నందు బంగారు కిటికీలు, యెండి తలుపుల్తో ఉంది. ఆమె అక్కడ నేనుండ లేనంటది. నన్ను సున్నపు గోలెంలో దాయి అంటాది. ఆడు అలాగే దాస్తాడు. జమాన్లకు అమ్మాక వారు కనిపించిక ఎలిపోతారు. అపుడు అమ్మవారు ఆ రాజుకి ఎర్ని వచ్చేటట్లు శపిస్తాది. రాజు ఆవిధంగా ఎర్నితో బాధపడి మరిణిస్తాడు. నూకాలతల్లి ఆనాటి నుండి ప్రజలచే పూజలందుకుంటుంది.

# అనుబంధం - II

# నూకాలమ్మ సమాచారం అందించిన వారిపేర్లు

## అనుబంధం - II

1. బుద్ద లక్ష్మి నగేష్ - 29
2. బుద్ధ నాగజగదీశ్వరరావు - 36
3. కె.టి.పి. జ్యోతీశ్వరం - 53
4. కె. అచ్చుతాంబ - 48
5. దాడి. రమాదేవి - 70
6. ఆరిపాక. అమ్మాజీ - 62
7. అచ్చియ్యమ్మ - 60
8. బి.వి.ఎ.ఎస్.నాయుడు - 55
9. కొణతాల సంజీవరావు - 65
10. ఎమ్. నారాయణమూర్తి - 35
11. ఈనాడు ఎడిషన్
12. ఆంధ్రప్రభ జాతర స్పెషల్
13. వార్త జాతర స్పెషల్
14. గ్రామదేవతలు ( ప్రత్యేక పరిశోధనాత్మక వ్యాస సంకలనం రచయిత. డా॥ కోటి సూర్యనారాయణ మూర్తి )
15. డా॥ పింజర్ల రామమోహనరావు - 58
16. ఉచ్చింతల బుచ్చేశ్వర గాంధీ - 57
17. ఎమ్. ఉమామహేశ్వరరావు - 23

# అనకాపల్లి గ్రామదేవతలు - ఒక పరిశీలన


రచయిత్రి

**కడలి అన్నపూర్ణ** ఎం.ఏ., ఎం.ఫిల్.,






ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు ఎమ్.ఫిల్.

పట్టమునకై సమర్పించిన లఘు సిద్ధాంత వ్యాసము


వాల్తేరు

1997

వందే నూకాంబికాం దేవీం

పోతరాజ సహోదరీమ్ !

అనేక ఫలి' బహిర్దేశ

స్థితాలయ విరాజితామ్ !!

మహారాష్ట్రులు చేసిన దండయాత్రలకు ఆంధ్రలో చుక్కెదురయ్యింది. శత్రుదాడులను తిప్పికొట్టి దురాక్రమణ దారుని అదుపులో ఉంచడంలో అనకాపల్లి సైన్యం అత్యంత ప్రధాన పాత్ర వహించింది.

గోపాలపాయకరావు, కేవలం యుద్ధ విశారదుడే కాక ప్రజాభిమానం చూరగొన్న నాయకుడు ఈయనకు రణరంగ భైరవ అనే బిరుదు కలదు. సాహిత్య శిల్పాలను ఆదరించేవాడు. అతని ఆస్థానంలో అనేక మంది పండితులు ఉండేవారు. వారిలో 'రుక్మావతీ పరిణయ' కృతికర్త రేకవల్లి సోమనాథ కవి ముఖ్యుడు. ఈ గ్రంథాన్ని ఆయన రాజుకు అంకితమిచ్చాడు.

గోపాల పాయకరావు తరువాత సింహాసన మెక్కిన రెండవ రామభద్ర పాయకరావు పూసపాటి వారితో స్నేహం కొనసాగిస్తూ, విజయనగరం రాజ్య అంతరంగిక, దేశీయ వ్యవహారాలలో ప్రముఖ పాత్ర వహించాడు. మొదటి విజయరామరాజు బుస్సీతో మాట్లాడడానికి రాజమహేంద్రవరం వెళ్లినప్పడు అతనితో రామభద్ర పాయకరావు కూడా వెళ్లాడు.

1756లో జరిగిన బొబ్బిలి యుద్ధంలో కూడా ఇతడు పాల్గొన్నాడు. బొబ్బిలిలో జరిగిన మొదటి విజయరామరాజు హత్య పూసపాటి వారికి, ఫ్రెంచి వారికి మధ్య భేదాభిప్రాయాలు సృష్టించింది.

ఈ సమయంలో ఫ్రెంచి వారికి, ఆంగ్లేయులకు మధ్య మూడవ కర్ణాటక యుద్ధం మొదలైంది. మొదటి విజయ రామరాజు వారసుడు, దత్తత కుమారుడైన మొదటి ఆనందరాజుకు ఈ యుద్ధంలో ఫ్రెంచి వారిపై పగదీర్చుకునే అవకాశం లభించింది. మొదటి ఆనందరాజు 1758లో ఫ్రెంచి వారిపై యుద్ధం ప్రకటించి, ఉత్తర సర్కారుల నుండి ఫ్రెంచి వారిని పారద్రోలటానికి సహాయ పడవలసిందిగా బెంగాల్‌లో ఉన్న క్లైవుకు లేఖ వ్రాశాడు. క్లైవ్ నుండి జవాబు గానీ సైన్యం గానీ రాకుండానే, అనకాపల్లి రామభద్ర పాయకరావు విశాఖపట్నంలోని ఫ్రెంచి ఫ్యాక్టరీని వశపర్చుకొని ఫ్రెంచి పతాకాన్ని దించివేసి, ఆంగ్ల పతాకాన్ని ఎగురవేశాడు. అచిర కాలంలో మొదటి ఆనందరాజుకు, ఆంగ్ల ప్రతినిధులైన ఆండ్రూస్, ఫోర్డ్‌లకు మధ్య కశింకోటలో సంధి జరిగింది. ఆ తరువాత మొదటి ఆనందరాజు కల్నల్ ఫోర్డ్ సహాయంతో అతి చాకచక్యగా ఫ్రెంచి వారిపై దండయాత్ర చేసి, దాదాపు మచిలీపట్నం వరకు గల కోస్తా ఆంధ్ర దేశాన్నంతటిని వశపర్చుకున్నాడు. దీనిలో రామభద్ర పాయకరావు ఆధిపత్యం క్రిందనున్న అనకాపల్లి సైన్యం చిరస్మరణీయమైన పాత్ర నిర్వహించింది.

1760లో మొదటి ఆనందరాజు హఠాత్తుగా మరణించడంతో రెండవ విజయ రామరాజు రాజయ్యాడు. ఇతడు మొదటి విజయరామరాజు, ఆయన భార్య చంద్రాయమ్మల రెండవ దత్త పుత్రుడు. రెండవ విజయరామరాజు బాలుడవడం చేత అతని అన్నయైన సీతారామరాజు దివాను పదవి స్వీకరించి, సర్వాధికారాన్ని హస్తగతం

విజయనగర పాలకులలో ప్రసిద్ధుడైన పూసపాటి మొదటి విజయరామరాజు తన రాజ్యాన్ని విస్తరింపచేశాడు. హైదరాబాదు రాజ్యస్థాపకుడైన నిజాము సార్వభౌమత్వాన్ని అతడు అంగీకరించలేదు. మహమ్మదీయ పాలన నుండి కళింగాంధ్రకు విముక్తం చేయడానికి అనకాపల్లి కాకర్లపూడి వంశీయులు ధృఢచిత్తంతో విజయనగర పూసపాటి వారికి అండగా నిలిచి చరిత్ర ప్రసిద్ధి పొందారు.

1732వ సం.లో నిజాము కళింగాంధ్రను తన అధికారం క్రిందకి తీసుకురావలసిందిగా హోజీ హుస్సేన్ రుస్తుమ్ ఖాన్‌లను ఫౌజుదారునకు సలహా ఇచ్చి రాజమహేంద్రవర పరగణాకు అధికారిగా నియమించాడు. అతడు వత్సవాయివారి పెద్దాపుర రాజ్యాన్ని కూలద్రోశాడు. రాజమాత, రాజప్రతినిధి నాగమ్మ రాజ్యవారసుడు, రాజకుమారుడు బాలుడైన జగపతి రాజును విజయనగరానికి పంపించి ఆత్మహత్య చేసుకుంది. కానీ, రాజమహేంద్రవరం పరగణా అధికారిగా ఉన్న రుస్తుమ్‌ఖాన్ స్థానంలో వచ్చిన అతని కుమారుడు నూరుద్దీన్ చేతికి జగపతి రాజు దొరికిపోయాడు. అనకాపల్లి గోపాల పాయకరావులు జగపతి రాజు సంరక్షణకు పూనుకున్నారు. 1734లో వీరిద్దరూ పెద్దసేనతో వెళ్లి తమపై యుద్ధానికి వచ్చిన నూరుద్దీన్ సేనలను చేబ్రోలు వద్ద ఎదుర్కొన్నారు. ఈ యుద్ధంలో నూరుద్దీన్ విజయావకాశాలు ఎక్కువగా ఉన్న సమయంలో సుమారు 2 వేల మంది అనకాపల్లి బోయఫౌజులు ఉమ్మడిగా వచ్చి నూరుద్దీన్ గజాన్ని చుటుముట్టి, అతనిని అంబారీ నుండి బయటకు లాగి తుండెములుగా నరికి చంపివేశాడు. నూరుద్దీన్ దుర్మరణంతో విజయలక్ష్మి అనకాపల్లి, విజయనగర రాజులను వరించింది. జగపతి రాజును విజయనగరానికి తీసుకుపోయారు. దీంతో స్వాతంత్ర్యం లభించింది.

తుమ్మపాల యుద్ధంలో అనకాపల్లి ఫౌజునకు మరొకసారి విజృంభించే అవకాశం కలిగింది. హైదరాబాదు నిజాము సలాబత్ జంగ్ 1753లో ఆంధ్రతీర పరగణాలు ఫ్రెంచి వారికి ధారాదత్తం చేశాడు. కాని ఫ్రెంచివారు ఉత్తర సర్కారులపై తమ అధికారం చెలాయించలేకపోయారు. ఈ పరిస్థితిని ఆసరాగా తీసుకుని శ్రీకాకుళం ఫౌజుదారు ఆ పరగణాలను వశపరచుకొని, తన రాజ్యంలో విలీనం చేసుకోవడానికి ప్రయత్నించాడు. ఇతను నాగపూర్, మహారాష్ట్ర, పిండారీ నాయకుడగు రఘుజీ భోన్ స్లేతో యుద్ధ ఒడంబడిక చేసుకొని ఉత్తర సర్కారులను జయించడానికి రప్పించాడు. మహారాష్ట్ర మహమ్మదీయ, సైన్యాలు ఏకమై ఉత్తర సర్కారుపై దండయాత్ర చేసి, ఆ ప్రాంత ప్రజలను అష్టకష్టాలకు గురి చేశారు. ఆ సైన్యాలు పెక్కు పరగణాలను ధ్వంసం చేసి, సింహాచలం వంటి పుణ్య క్షేత్రాలకు నష్టం కలిగించాయి. ఈ విపత్తు నుండి సర్కారులను సంరక్షించుటకు విజయరామరాజు, గోపాల పాయకరావులు సంసిద్ధులై శత్రురాజులను అరికట్టుటయే గాక, 1753 లో తుమ్మపాల వద్ద జరిగిన యుద్ధంలో వారిపై ఘన విజయం సాధించారు. జఫరాలీ ప్రయత్నాలు విఫలమయ్యాయి. పరాకోటికెక్కిన అధికార దర్పంతో

వారసులు కళింగ తీరాంధ్ర ప్రాంతాలను దాదాపు నూరు సంవత్సరాలు నిరాటంకంగా పాలించారు. గజపతుల పతనానంతరం బోయ, తెలుగు వంశీయులు, దక్షిణ కళింగ రాజ్య భాగాలను తమ అధికారం క్రిందకి తెచ్చుకున్నారు.

తెలుగు రాజవంశీయులు'బాహు బలేంద్ర' బిరుదు వహించి, ఈ ప్రాంతాన్ని 'పొట్నూరు' రాజధానిగా చేసుకొని పాలించారు. ఈ వంశ రాజన్యుడైన ముకుంద బాహుబలేంద్రుని పాలనలో గోల్కొండ నవాబులగు కుతుబ్‌షాహీలచే కళింగం జయింపబడింది. ఇబ్రహీం కుతుబ్‌షాహి శత్రువులపై యుద్ధం ప్రకటించారు. అతని కుమారుడు మహమ్మద్ కుతుబ్‌షాహి ఆ యుద్ధంలో విజయం సాధించాడు. మహమ్మద్ తన సేనకు అధిపతులుగా అశ్వరాయణీ కాకర్లపూడి అప్పలరాజులను నియమించారు. వారు బాహుబలేంద్రుని పై సేనాసమూహంతో దండెత్తగా, యుద్ధంలో పరాజితుడైన బాహుబలేంద్రుడు బెంగాల్ పారిపోయాడు. దాంతో కళింగాంధ్రం కుతుబ్‌షాహి సామ్రాజ్యంలో కలసిపోయింది. ఈ విజయానికి కారకుడైన కాకర్లపూడి అప్పలరాజుకు "కుతుబ్‌షాహి పాయకరావు" బిరుదునిచ్చి అనకాపల్లి కేంద్రంగా పరిసర ప్రాంతాలలో ఒకరాజ్యం నిర్మించుకోవటానికి అనుమతి ఇచ్చాడు.

ఈ విధంగా క్రీ॥శ॥ 1611 సం॥లో అప్పలరాజు అనకాపల్లి రాజ్య వ్యవస్థాపకుడయ్యాడు. అనకాపల్లిలో శత్రుదుర్భేద్యమైన కోట, శ్రీ భోగలింగేశ్వరాలయం, నూకాంబికాలయం నిర్మించాడు. నేటికీ భోగలింగేశ్వరాలయం, నూకాంబికాలయం నాటి వైభవానికి చిహ్నాలుగా నిలిచి యున్నాయి. నేటి విశాఖ జిల్లా దక్షిణ ప్రాంతాల మీద తన అధికారం విస్తరింపుచేసి, వేలుపాక, సత్యచరములందు తన వంశీయులను రాజప్రతినిధులుగా నియమించాడు.

క్రీ.శ. 1627వ సం.లోఅప్పలపాయకరావు మరణించడంతో అతని తమ్ముడు వెంకటరాజు సింహాసన మెక్కి ఒరిస్సాలో కుతుబ్‌షాహి పరిపాలన విస్తరింప జేయటానికి గణనీయంగా కృషి చేశాడు. తరువాత అతని కుమారుడు రామభద్ర పాయకరావు సింహాసన మెక్కాడు. ఇతని కాలంలో రాజ్యం సుఖశాంతులతో వర్ధిల్లుటయే గాక కళారాధనలో ఎంతో పేరుపొందింది. రామభద్ర పాయకరావు శతాధిక గ్రంథకర్త ఇతని "సర్వకామదాంబ పరిణయం", చంపూరామాయణం, నీలగిరినాథ శతకం, పద్మినీ పరిణయం, మొదలగు రచనలు బాగా ప్రసిద్ధి పొందాయి.

ప్రస్తుత విజయనగరం జిల్లా విజయనగరంలో 1652 సం.లో పూసపాటి వారు విజయనగర రాజ్యం స్థాపించడంతో కళింగాంధ్ర చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభమైంది. 1688వ సం.లో ఔరంగజేబు గోల్కొండ రాజ్య మొఘలు సామ్రాజ్యంలో విలీనం చేశాడు. దీని వలన దక్షిణ కళింగాంధ్రలో గల రాజ్యాల పటుత్వం సన్నగిల్లి క్షీణదశకు చేరుకున్నాయి. విజయనగర రాజ్య నిర్మాణంలో కళింగాంధ్రకు క్షీణ దశ పోయి సుస్థిరత ఏర్పడింది.

# 1) అనకాపల్లి చరిత్ర

## అనకాపల్లి మండల గత చరిత్ర

### అనకాపల్లి అను పేరు వచ్చుటకు గల కారణం :-

నేడు ప్రముఖ వాణిజ్య కేంద్రమైన అనకాపల్లి ఒకనాడు ప్రాచీన ఔన్నత్యానికి ఉనికిపట్టు. ఈ పట్టణానికి సమీపంలో ఉన్న "బొజ్జన్న కొండపై" అతిప్రాచీన దక్షిణ భారతీయ వాస్తు శాస్త్రానుసారమైన శిథిల అవశేషాలు ఉన్నాయి. ఇది క్రీస్తుకు ముందునాటివి అయి ఉండవచ్చని చరిత్ర కారుల అభిప్రాయం అయితే ఈ ప్రాచీన స్థలం పేరేమిటో తెలిపే ప్రత్యక్షాధారాలు లభ్యం కాలేదు. కానీ మెగస్తనీసు, ప్లీనీ, హ్యూయన్‌త్సాంగ్‌ల రచనలు, సింహళ దేశీయ రచన దాత వంశ చరిత్ర, తూర్పు గంగరాజుల శాసనాలను బట్టి భరత వర్షపు సప్త రాజధానీ నగరాలలో ఒకటైన "దంతపురంగా" ఊహిస్తున్నారు.

బ్రహ్మదత్తుడనే ఒకరాజు బోధి సత్వుని మహాపరి నిర్వాణానంతరం అతని దంతము ఒకటి తెచ్చి, దానిపై పవిత్ర స్థూపాన్ని నిర్మించాడు. క్రీ॥పూ॥ 5వ శతాబ్దం నుండి క్రీ॥శ॥ 4వ శతాబ్దం వరకు దంతపురం బౌద్ధ మతానికి నాసి కెక్కింది. ఇక్కడున్న బౌద్ధక్షేత్రాన్ని బట్టి చరిత్ర కారులు పై ఊహచేస్తున్నారు.

దంతపురాధీశుడైన గుహశివుడు క్రీ॥శ॥ 4వ శతాబ్దారంభంలో యవనులు దండయాత్ర చేయడంతో పవిత్ర ధాతును సింహళానికి పంపించాడు. ఇప్పటికినీ దానిని సంహళంలో ఆరాధిస్తున్నారు. ఈ దంతపురం 1వ శతాబ్దం అంతం వరకు కళింగ రాజ్య ముఖ్య పట్టణాలలో ఒకటిగా ఉండేది. ఆ తరువాత అది ఏమైందో తెలియదు. కాకతీయ, చాళుక్య సేనల దాడిలో ఇది శిథిలమై ఉంటుందని చరిత్రకారుల ఊహ !

తూర్పు కళింగ గాంగులను రెండవ అనియంకభీమ మూడవ అనియంక భీమల ఆధిపత్యంలో కళింగం తిరిగి ప్రాభవం సంపాధించుకుంది. వీరిరువురిలో ఒకరు శిథిల దంతపురం పరిసరాలలో అనియంకపల్లి' అనే గ్రామాన్ని నిర్మించారని, అదే కాలక్రమంలో అనకాపల్లిగా మారిందని చెబుతారు. క్రీ॥శ॥ 1400 సం॥లో తూర్పు గాంగ మహారాణి పార్వతీ మహాదేవి పరంగా వెలువడిన శాసనంలో ప్రప్రథమంగా"అనకాపల్లి' కనిపిస్తుంది.

15వ శతాబ్ది ప్రారంభంలో ఒరిస్సా గజపతి రాజు వంశ స్థాపకుడగు కపిలేశ్వరుని మూలంగా తూర్పు గాంగుల పరిపాలన అంతమొందించబడింది. కపిలేశ్వరుడు అతని

# భూమిక

మానవుడు అభివృద్ధి పథం వైపు పయనించిననూ అది దేవతలైనా గ్రామ దేవతలను ఆరాధించడం మరువడు. దానికి నిదర్శనం అనకాపల్లి నూకాలమ్మ. నూకాలమ్మను నమ్మి కొలిచిన వారికి ఆమె సకల సౌఖ్యాలు కలిగిస్తుంది. ఆగ్రహం కలిగినట్లు అయితే వారిని అథః పాతాళానికి త్రొక్కి వేస్తుంది. దానికి నిదర్శనంగా నూకాలమ్మ అప్పారావు అని పిలువబడే అప్పారావుని అమ్మవారు ఏ విధంగా శిక్షించినదో అనకాపల్లి ప్రజలంతా దర్శించి, తెలుసుకున్న నగ్నసత్యం. నూకాలమ్మ మాత్రమే కాదు, మరిడమ్మ, సత్తెమ్మ, మొదలగు అనేక మంది గ్రామ దేవతలు దీనికి నిదర్శనం. ఆయా దేవతలు తమకు అనుగ్రహం కలిగిందంటే ఆ గ్రామం అంతా సకల సౌకర్యాలతో విరాజిల్లుతుంది. ఆగ్రహం కలిగిందంటే ఆ గ్రామ వినాశనం జరుగుతుంది.

ఈ విధంగా ప్రతి గ్రామంలోనూ ఉన్నటువంటి గ్రామ దేవతలను ఆ గ్రామ ప్రజలు భయముతో భక్తి శ్రద్ధలతో ఆరాధిస్తారు. అమ్మవారి జాతర, పండుగల ఉత్సవాలను ఘనంగా జరిపిస్తారు.

గ్రామదేవతల పండుగలు, సంబరాలలో భారత దేశ ప్రాచీన సంస్కృతి అంతావెల్లి విరియును. మానవుని సంస్కృతిని తరువాత తరం వారికి తెలియచేయడానికి గ్రామదేవతల ఆరాధనా విధానములు, పండుగలు, జాతరలే అని చెప్పటంలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు.

గ్రామ దేవతలు : గ్రామాలలోని ప్రజలను వ్యాధులనుండి రక్షిస్తూ, బాధలనుండి తొలగిస్తూ, పంటలకు అనుకూల్యమును కల్పిస్తూ గ్రామదేవతలు కాపాడుతుంటారని గ్రామీణుల నమ్మకం. కొన్ని దేవతా విగ్రహాలు చతుర్భజాలతో, లంబజిహ్వాతో, వికట దంతములతో, తీక్ష ఈక్ష్ణములతో భయంకరంగా గోచరిస్తూ ఉంటారు. కొందరు సౌమ్యంగా, గంభీరంగా, ప్రసన్నంగా కూడా ఉంటారు. గ్రామ దేవతా పూజలలో సంస్కృత మంత్రాలకు స్థానం ఉండదు. బ్రాహ్మణేతరుడు పూజారిగా వ్యవహరిస్తూ ఉంటాడు. ఇలా ఊరూర వెలసి పూజలందుకుంటున్న గ్రామ దేవతలలో అసంఖ్యాకంగా ఉన్నా నూటొక్కమందిని "నూటొక్క అమ్మోను తల్లులకు కోటి దండాలు" అనే జానపదుల పాట వలన తెలియవస్తుంది. వీరిలో అంకమ్మ, ఎల్లమ్మ, కనకమ్మ, కామాక్షమ్మ, గంగాలమ్మ, గొలుసులమ్మ, తలుపులమ్మ, నూకాలమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ, మల్లమ్మ, మరిడమ్మ మొదలగు దేవతల పేర్లు తరుచుగా వింటూవుంటాము. ఈ గ్రామ దేవతల పండుగలో, జాతరలో, సంబరాలు, ఉత్సవాలు ఊరేగింపులు మన ప్రాచీన సంస్కృతిని ప్రతిబింబింపచేస్తూ ఉంటాయి.

సాధారణంగా ప్రతీ గ్రామమునకు ఒక గ్రామ దేవత ఉంటుంది. ఆమె పుట్టుక మహిమలకు సంబంధించిన కథలు, గాథలు, పాటలు, పద్యాలు జానపదుల నోట వినబడుతూ ఉంటాయి. అవి కనుమరుగు గాకుండా సేకరించి గ్రంథస్థం చేసి భావి తరాలకు అందించడం పరిశోధకుల కర్తవ్యం. గ్రామ దేవతలపై పరిశోధనలు జిల్లాల వారీగా మండలాల వారీగా, గ్రామాల వారీగా జరుగుతూ ఉన్నాయి.

వాటిలో ఒక భాగమే అన్నపూర్ణ చేసిన "అనకాపల్లి గ్రామ దేవతలు - ఒక పరిశీలనము". దీనిలో అనకాపల్లి చరిత్ర గ్రామ దేవతల ఆరాధన వికాసములు, అనకాపల్లి నూకాలమ్మ, ఇతర గ్రామ దేవతలు, పేరంటాళ్ళు మొదలగు అంశాలు చోటుచేసుకున్నాయి. ఈ అంశాలను నిశితంగా పరిశీలించి ప్రకటించడంలో అన్నపూర్ణ కృతకృత్యురాలయిందని చెప్పవచ్చు. త్వరలో "విజయనగర గ్రామ దేవతలపై కూడ పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసము సమర్పిస్తుందని ఆశిస్తూ ...

**కె. కోటారావు**

# అభినందన

కె. కోటారావు, ఎమ్.ఎ., తెలుగు, ఎమ్.ఎ., సంస్కృతం
భాషా ప్రవీణ, విద్యా ప్రవీణ,
తెలుగు లెక్చరర్, ఎ.ఎమ్.ఎ.ఎల్. కాలేజ్
అనకాపల్లి.

అన్నపూర్ణ సాహితీ జిజ్ఞాస నాకు తెలుసు. అష్టావధానంలో పృచ్ఛకురాలుగా పాల్గొన్న, కవి సమ్మేళనంలో కవిత వినిపించిన ఆమె ప్రత్యేకత స్పష్టంగా గోచరిస్తుంది. అంతేకాదు పరిశోధకులకు ఉండవలసిన బహు విషయ పరిజ్ఞానం, అధ్యయన శీలం, చారిత్రక దృష్టి, సత్య ప్రకటనాభిలాష మొదలైన లక్షణాలు ఆమెలో గోచరిస్తూ ఉంటాయి. అందువలననే ఆమె చక్కగా "అనకాపల్లి గ్రామ దేవతల"పై లఘు సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసి సమర్పించగలిగింది. ఒక విషయానికి వద్దాం.

సమస్త సృష్టికి మూలం ఒక శక్తి స్వరూపం. ఆ శక్తి వలననే భూమ్యాకాశాలు, పర్వత సముద్రాలు, సకల జీవరాశులు ఆవిర్భవించాయి. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఉద్భవించారు. ఆశక్తిని జగన్మాతయని, ఆది పరాశక్తి అని వేద శాస్త్ర పురాణాలు ప్రవచించాయి. శంకర భగవత్పాదులు ఆమె దివ్య మంగళ విగ్రహాన్ని నుతించారు. మహర్షులు, మత ప్రవక్తలు, కవులు, పండితులు, గాయకులు అందరూ భక్తితో కొనియాడినవారే.

"అమ్మల గన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ, చాలపె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి పుచ్చినయమ్మ, తన్నులో
నమ్మిన వేల్పుటమ్మలమనమ్ముల నుండెడియమ్మ, దుర్గ మా
యమ్మ కృపాబ్ధియిచ్చుట మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్"

అని ఆయమ్మను పోతన మహాకవి స్మరించాడు.

ఆ జగన్మాతను అనాదినుండి జానపదులు మాతృదేవతగా ఆరాధిస్తూ వచ్చారు. ఈ దేవత క్రమక్రమంగా వివిధ మత, జాతులచే పూజింపబడుతూ అనేక రూపాలను ధరించింది. వివిధములైన ఆకృతులతో విరాజిల్లుతున్న ఈ దేవతలు - అర్చన, ఆలయ, విగ్రహ, మంత్ర, తంత్రాదులను బట్టి వైదిక దేవతలు, శిష్ట దేవతలు, గ్రామ దేవతలు, క్షుద్ర దేవతలుగా విభజించబడి పూజలందుకుంటున్నారు. అయినా యీ చతుర్విధ దేవతల మధ్య వ్యత్యాసం అధికంగా గోచరిస్తుంది.

అనకాపల్లిగా మారియుండవచ్చు అని పరిశోధకురాలు గావించిన సమన్వయం ఆమోదయోగ్యంగా ఉంది.

ఆరాధనలో పరమేశ్వరునితోపాటు పరమేశ్వరికి కూడా ఎంతో ప్రాధ్యాన్యం ఇవ్వబడింది. పరమేశ్వరి సర్వసృష్టి స్థితిలయకారిణిగా పరబ్రహ్మ స్వరూపిణిగా ఉపనిషత్తులలోను పురాణాలలోను బహుధా అభివర్ణింపబడింది. జగద్గురు శంకర భగవత్ పాదులు "శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్" అని ఆ జగన్మాత ప్రభావాన్ని ప్రస్తుతించారు. ఆ పరాత్పర వివిధ గ్రామాలలో విభిన్న రూపాలతో బహువిధమ నామాలతో విచిత్రో దంతాలతో చిరకాలంగా ఆరాధింపబడుతోంది. గ్రామ దేవాతగా పరిగణింపబడుతుంది. ఆ గ్రామ దేవతారాధన ఎప్పటినుండి ఆరంభింపబడిందో ఇదమిద్ధంగా నిర్ణయింప వీలుపడదు.

ఈ సిద్ధాంత గ్రంథంలో గ్రామదేవతారాధన ప్రారంభదశ, వికాశం, గ్రామ దేవతల ఆరాధన విధానం మొదలైన పెక్కు విషయాలు పూర్వరంగంగా వివరింపబడ్డాయి.

ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క దేవత ఎంతో ప్రశస్తి వహిస్తూ ఉంటుంది. బెజవాడ కనకదుర్గ, విశాఖ కనకమహాలక్ష్మివలే అనకాపల్లి అనగానే నూకాంబిక అంటే నూకాలమ్మ ప్రసిద్ధమైన దేవతగా స్మరణలో నిలుస్తుంది. ఆ తల్లి యొక్క దివ్య మంగళ విగ్రహం పరమాకర్షకమైనది. భక్తుల పాలిటి ఆమె కల్పవల్లి అని ప్రజల విశ్వాసం. ఆర్తులు ఎన్నెన్నో రకాల మొక్కుబడులతో ఆ తల్లిని కొలుస్తూ ఆమె అనుగ్రహాన్ని పొందుతూ ఉంటారు. అనకాపల్లిలో ప్రధాన గ్రామదేవతగా పరిగణింపబడుతున్న ఆతల్లి గొప్పదనం ఎంతటిదో ఈ గ్రంథంలో సమగ్రంగా అభిర్ణింపబడింది.

నూకాలమ్మతో పాటు అనకాపల్లిలో నిత్యము ఆరాధించబడుతున్న ఇతర దేవతల చరిత్రకూడా ఈ సిద్ధాంత గ్రంథంలో చక్కగా వివరించబడింది. ఇతర దేవతలతో బాటు పేరంటాళ్ళు, సంతోషిమాత కూడా ఏవిధంగా అర్చింపబడుతున్నారో విశదీకరింపబడింది.

సమగ్రంగా అనకాపల్లికి సంబంధించిన గ్రామదేతల చరిత్ర సర్వస్వాన్ని సమగ్రంగా పరిశోధించి ఒక సిద్ధాంత గ్రంధాన్ని సంతరించి సాహిత్యలోకానికి అందించిన కడలి అన్నపూర్ణని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. ఇతోధికంగా ఆమె సాహిత్యవస్యగావించుగాతమని ఆశీర్వదిస్తున్నాను.

శుభంభూయాత్

**వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి**

# పరితోషం

ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి
ఎం.ఏ. పి.హెచ్.డి. (తెలుగు),
ఎం.ఏ. పి.హెచ్.డి. (సంస్కృతం)
తెలుగు శాఖ
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, విశాఖపట్నం - 3.

ఆంధ్రరాష్ట్రంలో విశాఖ జిల్లా అత్యంత విశిష్టమైనది. ఆ విశాఖ జిల్లాలో అనకాపల్లి అనే పట్టణం ఎంతో ప్రాముఖ్యాన్ని వహిస్తోంది. ఆ అనకాపల్లి పట్టణానికి సంబంధించిన గ్రామదేవతల పుట్టుపూర్వోత్తరాలని సమగ్రంగా పరిశీలించి కడలి అన్నపూర్ణ లఘు సిద్ధాంత వ్యాసాన్ని రచించి అస్మదాంధ్ర విశ్వకళా పరిషత్తునకు సమర్పించి ఎం.ఫిల్ డిగ్రీ పొంది ఆ రచనను ఈనాడు గ్రంధ రూపంలో ప్రచురించి సాహిత్య లోకానికి అందించడం అత్యంత ప్రశంసార్హం.

చాలాకాలంగా జానపదుల భక్తివిశ్వాసాలకి ఆరాధనలకి పరమాధారమనదగ్గ గ్రామదేవతలపై ఈనాటి సాహిత్య పరిశోధకుల దృష్టి ప్రసరించడం గమనార్హం. తత్ఫలితంగా వివిధ గ్రామ దేవతల చరిత్ర వెలుగులోనికి వస్తుంది. ఎన్నెన్నో విచిత్రమైన అంశాలు బయటపడుతున్నాయి.

గ్రామ దేవతలపై పరిశోధన చేయవలసి వచ్చినప్పుడు ఆ గ్రామ చరిత్ర, ఆయాదేవతల ఆవిర్భవానికి సంబంధించిన వృత్తాంతం అనే రెండు అంశాలు ఎంతో ప్రాధాన్యం వహిస్తాయి. పరిశోధకులు సమగ్రమైన చారిత్రక పరిజ్ఞానం కలిగి, ఆయా దేవతలపై తరతరాలుగా ప్రచారంలో వున్న జనశ్రుతులని సేకరింపగలిగినప్పుడు ఆ పరిశోధన ప్రమాణ బద్ధమౌతుంది. విషయ సార్థక్యం చేకూరుతుంది.

"అనకాపల్లి గ్రామ దేవతలు ఒక పరిశీలన" అనే ఈ లఘు సిద్ధాంత గ్రంధంలో తొలి ప్రకరణంలో అనకాపల్లికి సంబంధించిన చారిత్రక అంశాలు సమగ్రంగా వివరించబడ్డాయి. పరిశోధకురాలి చారిత్రక విజ్ఞాన వైభవాన్ని నిరూపిస్తున్నాయి. "అనియంకపల్లి" అనకాపల్లిగా మారిందని క్రీ.శ. 1400వ సం॥లో తూర్పు గాంగ మహారాణి పార్వతీదేవి పరంగా వెలువడిన శాసనంలో ప్రప్రథమంగా అనకాపల్లి ప్రస్తావింపబడిందని పరిశోధకురాలు వివరించింది. గ్రంధారంభంలో అనేక ఫలిబహిర్దేశస్థితాలయ విరాజితామ్" అని నూకాంబికా స్తోత్రాన్ని పేర్కొంది. అనియంకపల్లి, అనేకఫలి అనేవి

# ముదుపు

ప్రొ. : కె. మలయవాసిని, ఎమ్.ఎ., పి.హెచ్.డి.,
తెలుగు శాఖ,
ఆంధ్రా యూనివర్సిటీ,
విశాఖపట్టణం - 3.

చిరంజీవిని అన్నపూర్ణది అనకాపల్లి. ఆమె అనకాపల్లి నూకాలమ్మ యెడల పరిపూర్ణమైన భక్తి ప్రపత్తులు కలది. ఎం.ఫిల్.లో ఏ విషయం మీద పరిశోధన చేయాలి అనే ఆలోచన వచ్చినప్పడు అనకాపల్లి నూకాలమ్మ ఆరాధనా విధానం, ఆ తల్లిపై సాహిత్యం సేకరించి పరిశోధన చేస్తే బాగుంటుందను కున్నాం, పరిశోధనకు దిగిన తరువాత నూకాలమ్మతో పాటు మరో 10 మంది గ్రామ దేవతల, పేరంటాళ్ళ విషయం కూడా సేకరణలో లభించింది.

పరంపరగా పూజలందుకుంటున్న ఆయా గ్రామ దేవతల, పేరంటాళ్ళ జీవిత గాధలను ఆరాధనా విధానాలను భక్తితో సేకరించి శ్రద్ధతో విశ్లేషించి రచించిన ఈ లఘు సిద్ధాంత వ్యాసాన్ని గ్రామ దేవతారాధనా సాహిత్యార్చనకు ముడుపు కట్టింది శ్రీమతి అన్నపూర్ణ.

'నూకాలమ్మ'ను గూర్చి అధ్యయనం చేయడం ఆరంభించిన నాటినుండి చి॥ అన్నపూర్ణ జీవితంలో శుభపరంపర ఎదురుకావడం ఒక విశేషం.

పుట్టిన ఊరు 'అనకాపల్లి' గ్రామదేవతల అధ్యయనం ఎంఫిల్ పట్టాకుపరిశోధనాంశం అయితే, మెట్టిన ఊరు విజయనగరం కావడం, ఆజిల్లా గ్రామ దేవతల అధ్యయనం పిహెచ్‌డి. పట్టాకు పరిశోధనాంశంగా ఎన్నుకోవడం మరో శుభపరిణామం.

త్వరలో ఆ సిద్ధాంత వ్యాసాన్ని కూడా భక్తి శ్రద్ధలతో కూర్చగలదని ఆశిస్తూ

ఈ లఘు సిద్ధాంతవ్యాసానికి అక్షర రూపాన్ని కలిగిస్తున్న ఈ శుభతరుణంలో ఆమెకు శుభాభినందనలు అందిస్తూ...

**కోలవెన్ను మలయవాసిని**

# అభినందన

శ్రీ దాడి వీరభద్రరావు, ఎమ్.కాం., సాహిత్య రత్న,
అనకాపల్లి శాసనసభ్యులు, మాజీ మంత్రివర్యులు, అనకాపల్లి.

కడలి అన్నపూర్ణ తన ఎమ్.ఫిల్ డిగ్రీ కొరకు అనకాపల్లి గ్రామ దేవతలు అనే పరిశీలన వ్యాసం సలక్షణమైన వివరములతో రూపొందించారు. డాక్టర్ మలయవాసిని పర్యవేక్షణలో తయారైన ఈ వ్యాసంలో మన ప్రాంతంలో ఉన్న ప్రముఖ దేవతలు, దేవాలయముల యొక్క చరిత్ర క్లుప్తంగా చోటు చేసుకున్నది. అన్ని గోళములలో వివిధ ప్రపంచాలను శాశించే దేవి గ్రామ దేవతల రూపంలో సామాన్య మానవుల కోర్కెలను తీర్చే గ్రామ దేవతలుగా విరాజమానమై యున్నది. కాబట్టి గ్రామ దేవతల ఉత్సవాలు గ్రామ గ్రామాన సృష్టి ఉన్నంత కాలం లోకకళ్యాణం కొరకు నిర్వహింపబడుతూనే ఉంటాయి. అట్టి ఉత్సవాలు సాంప్రదాయములు, మహిమలు అన్నింటిని సమీక్షించిన అన్నపూర్ణ కృషిని అభినందిస్తూ

మీ

**(దాడి వీరభద్రరావు)**

ఆడపిల్లకు చదువెందుకులే అని అనుకోకుండా ఇంతవరకు నేను చదువుకోవడానికి తగిన అవకాశం కల్పించి ప్రోత్సహించిన నా తల్లిదండ్రులైన శ్రీ కడలి. తేజఃప్రణవ జ్యోతీశ్వరం, అచ్చుతాంబలకు నా కైమోడ్పులు. అనుక్షణం నన్ను అనుసరిస్తూ ప్రతీ విషయంలోనూ తన సలహా సూచనలు అందిస్తూ నా పురోభివృద్ధికి తోడ్పడుతున్న మా శ్రీవారు శ్రీ నందివాడ వేణుగోపాలరావు గార్కి నా నమస్సుమాంజలులు. నా పుస్తక ముద్రణాది విషయాలలో తమ పూర్తి ప్రోత్సాహమందిస్తున్న నా అత్త మామలు అయిన శ్రీ నందివాడ బ్రహ్మానందం నాగరత్నం గార్లకు నా హృదయపూర్వక నమస్కారములు. అనకాపల్లి గ్రామ దేవతల చరిత్రలను సేకరించుటలో తమపూర్తి సహకారాన్ని అందించిన నా సోదరులు కడలి శ్రీనివాసరావు, కడలి కల్యాణకుమార్‌లకు నా శుభాశీస్సులు. తమ ఉత్తరాల ద్వారా నన్ను ప్రోత్సహించి ప్రింటింగ్ విషయంలో భాధ్యతాయుతంగా అందువచ్చిన తప్పలను సరిచేసి అధిక శ్రమ తీసుకున్న డా॥ పింజర్ల రామమోహనరావు గారికి నా నమస్సులు. అమ్మవారి విషయ సేకరణలో సహకరించిన శ్రీ బుద్ధ లక్ష్మీ నగేష్ గారికి నా ధన్యవాదాలు.

"ధనం మూల మిదమ్ జగత్" అన్నారు పెద్దలు. ఇంత కృషీ ధనం లేకపోతే వ్యర్థం అవుతుంది. అందుకే ఈ అమ్మవారి చరిత్రను పుస్తక రూపం కల్పించబడడానికి ఆర్థిక సహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా యొక్క కృతజ్ఞతలు. అక్షరాలంకరణ చేసి అందంగా అతి తక్కువ సమయంలో ముద్రించి ఇచ్చిన సాయి ప్రింట్ పాయింట్స్, రాజమండ్రి వారికి ఆయా గ్రామ దేవతలు గూర్చి తమకు తెలిసిన విషయములను విశదీకరించి చెప్పిన అనకాపల్లి ప్రజలందరకూ మరియు ప్రత్యక్ష, పరోక్షముగా సహాయము చేసిన వారందరికి నా యొక్క కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు

రచయిత

**కడలి అన్నపూర్ణ**

# నా"నుడి"

నేను వ్రాసిన "అనకాపల్లి పట్టణ దేవతలు - ఒక పరిశీలన" అన్న సిద్ధాంత సంకలనంలో ముఖ్యంగా అనకాపల్లి ప్రజల గ్రామదేవత, కోరిన కోర్కెలు తీర్చు కల్పవల్లి అయిన శ్రీశ్రీశ్రీ నూకాంబికా దేవిని గురించి ఆ తల్లిని ఆరాదించే విధానం భక్తులను ఆమె ఆదరించిన తీరును గురించి వ్రాసాను. అందుకు ఆతల్లి కృపయో సర్వ కాలమందు సహకరించినది. అంతేగాక ఆ తల్లి ఆశీర్వచనం వల్లే నేనీ సిద్ధాంత గ్రంధాన్ని త్వరగా పూర్తిచేయడమే గాక దీనిని సమర్పించిన మరునాడే 1997లో ఉద్యోగం రావటం, తరువాత 1998లోనే వివాహంగావడం, 1999లో సుపుత్రిగా జననం. ఈవిధంగా ఆ తల్లి వరాల వర్షాన్ని కురింపించిందంటే అది ఏమాత్రం అతిశయోక్తి, ఆశ్చర్యము కాదు. ఆతల్లి భక్తులందరిని ఆవిధంగానే అనుగ్రహిస్తుంది. అందుకనే కనకాపల్లి అయిన అనకాపల్లిలో నేను పెరిగినందుకు ఈ ఊరి ప్రజలే గాక అందరూ ఆతల్లి చరిత్రను తెలుసుకొనే విధంగా వ్యవహారిక భాషలో ఈ కనకాపల్లి కల్పవల్లి అయిన ఆ నూకాంబికా తల్లికే ఈ పుస్తకాన్ని "అంకితం" ఇస్తున్నాను.

ఈ విధంగా అమ్మవారి దయతోపాటు నా హితవరి, గురువు అయిన ఆచార్య శ్రీమతి కోలవెన్ను మలయవాసిని గారి మార్గ దర్శకత్వము, ప్రోత్సాహము వలననే ఈ పరిశోధనను ఇచ్చిన సమయంలో సక్రమంగా పూర్తిచేయడమే గాక అచ్చు వేయించ గలిగితిని అందుకు సర్వదా నేను కృతాజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. నా మనవి మన్నించి నా రచనను ఆమూలాగ్రం చదివి తప్పలను సరిచేసి పరితోషం వ్రాసిన మా పూజ్య గురువులు శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి, నా పరిశోధనకు పూర్తి వెన్నుదన్నుగా నిలచి నా పరిశోధనా గ్రంధాన్ని చదివి తమ అభిప్రాయాన్ని ముడుపు రూపంలో అందించిన మా అధ్యాపకురాలైన మలయవాసిని గారికి మరియు అనకాపల్లి పట్టణంలో సాహితీ పండింతులు అయిన శ్రీ కె. కోటారావు గారికి శ్రీ ఆర్.సాంబశివరావుగార్లు నా గ్రంధాన్ని చదివి అభినందనలు అందించినందుకు వారికి నా ధన్యవాదములు.

ముఖ్యంగా మా అనకాపల్లి శాసనసభ్యులు, సాహితీ ప్రోత్సాహకులు, రచయిత అయిన శ్రీ దాడి వీరభద్రరావుగారు నా పుస్తకమునకై వారి అమూల్యమైన కొంత సమయాన్ని వెచ్చించి స్వయంగా వారు కూడా నా గ్రంధానికి అభినందన వ్రాసి ఇచ్చినందుకు వారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

నేను విద్యార్థినిగా ఇంత విద్యనార్జించుటకు జ్ఞానాన్ని ప్రసాదించిన కస్పా ప్రాథమిక, బాలికోన్నత పాఠశాలల ఉపాధ్యాయ, ఉపాధ్యాయునులకు శ్రీ ఆదినారాయణ మహిళా కాళాశాల (అనకాపల్లి) అధ్యాపకురాండ్రకు, కాంప్రిహెన్సివ్ కాలేజ్ (రాజమండ్రి) ఉపాధ్యాయులకు, ఆంధ్రా యూనివర్శిటీ అధ్యాపకులకు, అధ్యాపకురాండ్రకు నా హృదయ పూర్వక నమస్కారములు.

# చిత్ర పట సూచిక

# విషయ సూచిక

తొలి ప్రచురణ : జనవరి 2000

కాపీలు : 1000 కాపీలు

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ముద్రించబడినది.



ప్రతులకు సంప్రదించవలసిన చిరునామా :

కడలి పబ్లికేషన్స్
C/o K.T.P. జ్యోతీశ్వరం
తాలూకా ఆఫీసు వద్ద,
అనకాపల్లి - 531 001.
విశాఖ జిల్లా,
ఫోన్ : 25769

రచయిత్రి విలాసం :
కడలి అన్నపూర్ణ
C/o K.T.P. జ్యోతీశ్వరం
తాలూకా ఆఫీసువద్ద,
అనకాపల్లి-531 001. విశాఖ జిల్లా,
ఫోన్ : 25769

చేసుకుని, తన సోదరుని శ్రేయస్సుకు భంగకరంగా వ్యవహరించసాగాడు. రెండవ విజయ రామరాజుకు రామభద్ర పాయకరావు విధేయుడై ఉండేవాడు. అది ఇష్టం లేని సీతారామరాజు తల్లి కాకర్లపూడి రాజుపై ద్వేషం ఏర్పరచుకున్నది.

ఈ విపత్కర పరిస్థితులలో రామభద్ర పాయకరావు మరణించాడు. అతని సింహాసనాన్ని రెండవ అప్పల పాయకరావు అధిష్టించాడు. ఇతని కాలంలోనే ఆంగ్లేయుల అంగబలంతో సీతారామరాజు అన్యాయంగా అనకాపల్లిపై యుద్ధం ప్రకటించాడు. 1777లో విజయ నగర సేన అనకాపల్లి కోటను ముట్టడించింది. రాజు అప్పల పాయకరావు, యువరాజు రామభద్ర పాయకరావులు విజయనగర సేనను తరిమి కొట్టారు.

సవ్య మార్గంలో తన దురాలోచన ఫలించక పోవటంతో నీచ మార్గాన అనకాపల్లి వశపర్చుకోవాలని సీతారామరాజు పధకం వేశాడు. అనంత వరమునకు చెందిన అనప్పిండి విస్సన్న అను పేరుగల వానిని, అప్పల పాయకరావు, అతని కుమారుడు రామభద్ర పాయకరావులకు విష ప్రయోగం చేయడానికి సీతారామరాజు నియమించాడు. దురదృష్టవశాత్తు ఈ కుట్రకు తండ్రీ కొడుకులిద్దరూ బలైపోయారు. వెంటనే సీతారామరాజు అనకాపల్లి రాజ్యాన్ని విజయనగరం రాజ్యంలో చేర్చుకున్నట్లు ప్రకటించారు.

ఈ న్యాయ విరుద్ధమైన చర్యకు, ఆంగ్లేయ ప్రభుత్వ అనుమతి సంపాదించటానికి సీతారామరాజు ప్రయత్నించాడు. 1788లో మద్రాసులోని ఆంగ్ల కంపెనీ అధికారి, అనకాపల్లిని విజయనగరంలో కలుపుకొనుటకు, వితంతువులైన కాకర్లపూడి రాణులిరువురికి జీవన భృతి క్రింద సంవత్సరానికి పదివేల రూపాయలు ఇవ్వటానికి అంగీకరించి అనుమతి మంజూరు చేశారు. సీతారామరాజు అనేక సాకులతో రాణులకు భరణం ఇవ్వకుండా పెక్కు బాధలకు గురి చేసేవాడు. చివరకు 1804లో అప్పల పాయకరావు సతీమణికి జీవిత చరమ దశలో మతిభ్రమణం కలిగి 1814లో దయనీయమైన స్థితిలో మరణించింది.

ఆ తరువాత ఆంగ్లేయాధి కారులు రామభద్ర పాయకరావు దత్తత స్వీకారాన్ని గుర్తింపక, అతని దత్తత కుమారుడికి ఏటా అనకాపల్లికి ఇచ్చే భరణాన్ని కూడా ఇవ్వకుండా నిలిపి వేశారు. అంతటితో ఆగకుండా అతనిని అనకాపల్లి కోటను విడిచి వెళ్లవలసిందిగా ఆజ్ఞాపించారు. రాకుమారుని దాయాదియైన చందనాడుకు చెందిన జగన్నాథ పాయకరావు ఈ విషయాన్ని ఆంగ్లేయులకు తెల్పి న్యాయం చేయమని అర్థించి విఫలుడైనాడు. ఆధారాలు చూపినా దత్తత కుమారుణ్ణి వారసునిగా కంపెనీ అధికారులు అంగీకరించకపోవడంతో 1832 జనవరిలో ఆంధ్రలో ఆంగ్లేయులపై జగన్నాథ పాయకరావు లేవదీసిన విప్లవానికి ప్రజల మద్దత్తు లభించింది. ఆంధ్రప్రదేశంలో విదేశీ ప్రభుత్వంపై లేవదీసిన ప్రథమ విప్లవం ఇదే.